# [illegible]కడుపు

## 1

ఆకాశం సంధ్యను ముసుగులా కప్పింది. స్వర్ణకాంతు లీనుతున్న మబ్బులు సోమరిగా గాలిలో తేలిపోతున్నాయి. కాలువనీరు పచ్చగా ప్రవహిస్తున్నది. దూరంగా రైలు కూత. నారాయణరావు ఆఖరుసారి పీల్చి సిగరెట్టును కాలువ లోకి విసిరివేశాడు. ఒక్కక్షణం 'చుయ్' మన్న ధ్వని విని పించింది. నారాయణరావు తదేకంగా దానివైపే చూస్తు న్నాడు. సిగరెట్టు నీరు పీల్చుకొంది. ఉబికింది. విచ్చి పోయింది. వానపాముల్లా ఎటుదటు తొలగిపోయింది. అతని కేదో సత్యం గోచరించినట్లయింది.

"ఈ సిగరెట్టుకూ శారదకూ భేదమేమిటి?" అను కొన్నాడు నారాయణరావు.

అతని కెందుకో చెప్పరానంత దిగులువేసింది. శరీర మంతా చల్లగా, ముద్దగా, బరువుగా వున్నట్లు ఫీలయ్యాడు. మోకాళ్ళమధ్య తల ఇరికించుకొని కళ్లు మూసుకొన్నాడు. [illegible]న్నో ఆలోచనలు మేలుకొని, అతన్ని చికాకుపరచ

[illegible]తన శారద!

ఒకప్పుడు శారద తనదే ననుకొన్నాడు. తనకోసమే శారద ఈ భూమండలంలో అవతరించింది. కానివస్తానే శారదకోసం తనన్నా జన్మించివుండాలి. లేకపోతే తమ ఇద్దరి మధ్యా ఇంతటి సన్నిహితత్వం, ఇంతటి ప్రేమానురాగాలు వుండటానికే వీలులేదు. వెలుగు నీడల్లాగా, పదార్థము, ఆకృతుల్లాగా, ఈ సంబంధం అవిభాజ్యం. దేవాదిదేవుడయినాసరే తమను విడదీయలేడనుకొన్నాడు. ఆ నమ్మకంతోనే తను జీవిస్తూ వచ్చాడు.

కానీ చివరను జరిగిందేమిటి? తను అనుకొన్న దానికి పూర్తి వ్యతిరేకం. తను చూస్తుండగానే, తనకళ్ళ ముందే, శారద తనకు దూరమైపోయింది. తనకు కాకుండా పోయింది. ఈ విడిపోవటానికి కారణం దేవాదిదేవుడయినట్లయితే ఏమయ్యేదో మరి! కానీ శారద తండ్రి - ఫక్తు తన మేనమామ - శారదను తనను విడదీశాడు. పురుషోత్తంగారు చెబుతున్న కారణాలు వినిన తరువాత, శారద ఎడబాటుకు విచారపడనవసరం లేకపోయింది. కానీ, ఆ విచార రాహిత్యం అతను ఎక్కువకాలం అనుభవించలేదు. ఒకనాడు జబ్బుగా వున్నట్టు వుత్తర మొచ్చింది. తెల్లవారే అతను చనిపోయినట్టు టెలిగ్రాం వచ్చింది. నారాయణరావు నిలువునా వణికిపోయాడు. నల్లని చీకటి అలలు ముఖాన్ని ముంచెత్తుతున్నట్ట కాళ్ళక్రింది భూమి దొలుచుకుపోతున్నట్టు గిజగిజ లా... తను వచ్చాడు. చూశాడు. అప్పటికన్నీ ... శారద మూలగా కూచున్నది. గడపద...

యణరావు చూశాడు. అతని కెక్కడిలేని విచారమూ పుట్టు కొచ్చింది. గదిలోకెళ్లి నిశ్శబ్దంగా ఏడ్చాడు. శకుంతల తొంగిచూచి నాన్నతో చెప్పింది. పురుషోత్తం కదలలేదు. మెదలలేదు. అసలు శకుంతల చెప్పిన మాట అతను విన్నాడో లేదో మరి!

వెంటనే వెళ్లిపోదామనుకున్నాడు. పెట్టె, బేడ సర్దు కొన్నాడు. శకుంతల వెళ్లి తల్లితో చెప్పింది. రామమ్మ పరధ్యానంగా వుండి కూతురు చెప్పినదాన్ని వినిపించు కోలేదు.

"అమ్మా! బావ వెళ్లిపోతున్నాడు."

రామమ్మ ఉలిక్కిపడ్డది. "ఏమిటీ?"

"నారాయణ బావ పోతున్నాడు" అన్నది. అతను పోవటం తన కిష్టంలేనట్లు.

"ఎక్కడికే? ఎక్కడికి పోతున్నాడు?"

"వూరికేమో? పెట్టె సర్దుకొంటున్నాడు. నువ్వెళ్లి వుండమని చెప్పవులే!"

ఆమె వచ్చి చూసేసరికి నారాయణరావు సర్దుకోవటం పూర్తయింది.

"ఏమి నాయనా! పెట్టె సర్దుతున్నా వెందుకూ?"

"వెడతానండీ అత్తయ్యా! నాకిక్కడేమి బాగుండ లేదు. అదీ గాక—ఇక కాలేజికి సెలవులుగూడా ఎక్కువలేవు."

"అయినా సరే నాయనా! నువ్విప్పుడే బయల" దేరకు. మీ మామయ్య వుత్త బెంబేరు మనిషి. ఈదిగులతో ఇప్పటికే ఆయన సగమైనాడు. ఏదో నువ్వుండబట్టి ఒక పూటైనా ఎంగిలి పడుతున్నాడు. లేకపోతే మరీ హైరానా పడిపోతాడు. మా బాబుగా, ఆయన కాస్తకుదుటపడ్డదాకా-- రెణ్ణాళ్లుండిపో బాబూ!– చెట్టంత అల్లుడు అలా పోయాడా ? ఇక దాని నూరేళ్ల బతుకూ అలా బుగ్గికావలసిందేనా–"

అత్తయ్య విషాదంలో పడ్డదంటే–ఇక ఒళ్లు పట్టట మనేది ఒకంతట తేలదు. ఎదుటి వారు ఏమనుకుంటారో నన్నదిగూడా ఆమె గాఉ ఆలోచించదు. నారాయణ చటుక్కున లేచి బైటకొచ్చాడు. కొన్ని నిమిషాలపాటు ఏమి చేయవలసిందీ తోచలేదు. ఎటు వెళ్ళవలసిందీ నిర్ణయించుకో లేక పోయాడు. ఒక గజ్జి కుక్క అతన్ని చూసి మొరిగింది. నారాయణరావు క్షణంసేపు దానివేపు చూశాడు. అది దూరంగా పరుగెత్తింది. అనాలోచితంగా అతనూ దాని అనుసరించాడు.

చాలా సేపటికిగానీ తను చాలా దూరమొచ్చినట్లు నారాయణరావు గ్రహించలేదు. తిరిగి పోదామా అను కొన్నాడు. కానీ పోబుద్ధిగా లేదు. మామగారిల్లంటే అతని కెందుకో భయం వేస్తున్నది. ఏదో అదృశ్య భూతం దాని నావేశించినట్లు, దుఃఖం పొరలు తున్నట్లు అతనికి తోచ సాగింది. ఒకప్పుడు ఆ ఇంట్లో విరిసిన దిరిసెన పూవులాంటి శారద నవ్వుతో కనిపించేది. సంతృప్తి ఆమె సర్వంలోనూ

గోచరించేది. నిజమే కానీ ఈనాడు అందుకు పూర్తిగా భిన్నం. అందుకే తను ఆ ఇంట్లో వుండలేక పోయినాడు. ఇంటికి వెళ్లిపోదామనుకొన్నాడు. అత్తయ్య వద్దన్నది. తను ఆగిపోయాడు. తలుచుకొంటుంటే నారాయణరావుకు సిగ్గేసింది. నిజంగా తను – అత్త చెప్పింది కనుకనే ఆగిపోయాడు? మామగారు భోజనం మానేస్తాడన్నదే కారణమా తను పోకపోవడానికి? నారాయణరావు తనను తాను మోసం చేసుకోలేక పోయాడు? ఇలా నిగ్గదీసి అడుగుతున్న తన అంతరాత్మకు ముందు సమాధానం చెప్పుకోవాలి. తనేదో ప్రయోజనాన్నాశించే ఇక్కడ వున్నాడు. అదేమిటో తనిప్పుడు స్పష్టంగా చెప్పుకోలేకపోవచ్చు. అంత మాత్రాన నిష్ప్రయోజనమని తను అనుకోలేడా ఏమీ లేకపోతే తనెందుకు వెళ్లలేకపోతున్నాడు? బహుశా అది శారదమీది అభిమానం కావచ్చును. లేతవయస్సులో ఆమె కొచ్చిన దుర్దశకు కావచ్చు. ఏది ఏమైనా—

"ఎవరిది?"

నారాయణరావు మామూలు స్థితిలో కొచ్చాడు.

"ఎవరా కూచుంది! మాట్లాడరేం?"

"నేనేనండి, పురుషోత్తంగారి మేనల్లుణ్ణి"న్నాడు నారాయణరావు.

"ఈడ కూచున్నారేందండీ అబ్బాయిగారూ! సీకటి పడ్డది. పురుగు పుట్రా లెగిసే యాలయింది. ఇంటికి బోదాం రాండి" అన్నారొకరు.

"నా స్నేహితుడొకాయన పైకి వెళ్లాడు. ఆయన కోసం ఎదురు చూస్తున్నాను. రాగానే ఇద్దరం వస్తాం" అన్నాడు నారాయణరావు.

వాళ్లు వెళ్లిపోయారు. వెళ్లిన తరువాత నారాయణ రావు వాళ్లతో అబద్ధమాడినందుకు బాధపడ్డాడు. తనెందుకు అబద్ధమాడడం? నిజం ఎందుకు చెప్పలేక పోయాడు?" ఏమిటో! మనిషి చేసే కొన్ని పనులకు బొత్తిగా అర్థం వుండదు." అనుకొన్నాడు.

అప్పటికే బాగా చీకటిపడ్డది. చుక్కలు నీటి బుడగల్లా, ఆ తమసార్ణవంలో మెరుస్తున్నాయి. బలువైన మబ్బా కటి గర్భవతిలా తూర్పుకు నడుస్తున్నది. ఏవో పురుగులు 'గీ' మంటూ రొద పెడుతున్నాయి. నారాయణరావు మోచేయి నేలకానించి వూపుతూ లేచాడు. లాగుకు, చొక్కాకు అంటుకొన్న రేగటి బెడ్డలు దులుపుకొన్నాడు. జేబులో చూచుకొన్నాడు. సిగరెట్లు లేవు తల వంచుకొని బయలు దేరాడు. దూరంగా ఎడ్ల గంటల చప్పుడు వినిపిస్తు న్నది. కట్టమీదుగా ఒకాయన చొప్పమోపు తీసుకెడు తున్నాడు. నడక వూపుకు, మోపు అందంగా మోగు తున్నది. నారాయణరావు ఆలోచిస్తూ, నడుస్తున్నాడు. ఈ రాత్రి శారదను రహస్యంగా కలుసుకొని మాట్లాడాలను కొన్నాడు. ఏదో విధంగా తనీ అవకాశం కలిగించుకోవాలి. లేకపోతే ఈ ప్రయాణానికి అర్థమే వుండదు. అయితే— ఏమని శారదనడగాలి? ఎట్లా అడగాలి? అయినా ఏ విష

యాన్ని గురించి తనదుగదలచుకొన్నాడు? ఏమీ లేకపోతే తనెందుకున్నట్లు?

"అరె ఇదేమిటి? నేనెక్కడికొచ్చాను? రామాలయం ఏదీ?" అనుకొన్నాడు నారాయణరావు. అతను దోవ తప్పాడు. మళ్లీ యాంబైగజాలు వెనక్కు వచ్చి కుడివైపు గొందిలోగుండా ఇంటికొచ్చాడు.

"అమ్మా! బావొచ్చాడు" అన్నది శకుంతల.

"నీళ్లు వేడిగా వున్నాయో లేదో చూడు. లేకపోతే రెండు పిడకలు పొయిలో వెయ్యి - ఇప్పటిదాకా ఎక్కడికెళ్లావు నాయనా! మీ మామయ్యగారు కనుపించ లేదూ?" అన్నది రామమ్మ.

"లేదు."

"ముందు నువ్వు స్నానం చెయ్యి - శకూ! నీళ్లు చూశావు టే."

"మసిలిపోతున్నాయి" అన్నది శకు.

"బావకు అంగొస్త్రం తెచ్చివ్వు."

వేడినీళ్లు, చన్నీళ్లు కలగలిపి శకుంతల బావకు అందిస్తున్నది. ఈలోపుగా రామమ్మ అన్నం వడ్డించింది. ఒకసారి అందించటంలో శకుంతల వేళ్లు తగిలాయి. నారాయణరావు జ్ఞాపకాలు బుసకొట్టాయి. ఆదరా బాదరా స్నానం చేశాడు. రెండు మెతుకులు అటూ ఇటూ కెలికాడు. ముసుగు పెట్టుకొని గదిలో పడుకున్నాడు. అప్పటికి పురుషోత్తంగారింకా ఇంటికి రానేలేదు.

# 2

నారాయణరావు !

నారాయణరావు శారద విషయంగా చాలా దుర దృష్టవంతుడు. శారదను భార్యగా పొందే అదృష్టం నిజంగా అతనికి లేదు. ఈ దురదృష్టానికి ఎంతయినా విచారించవల సిందే ! అయితే నారాయణరావు జీవితాన్ని తెలిసినవా రెవరూ, అతని కీదశ దుర్దశ అని అనలేరు. ఎందుకంటే అతను చిన్నతనంలోనే తండ్రిని పోగొట్టుకొన్నాడు. అతను కడుపున పడినప్పటినుండీ సుందరమ్మకేదో ఒక జబ్బు వస్తూనే వుండేది. జగన్నాథం నానా చెరలూపడి ఆవిడకు మందు ఇప్పిస్తూ వుండేవాడు. అయితేనేం ? దిక్కుమాలిన సంసారం! దిక్కుమాలిన రోగాలు!! ఎంత పైౖవేటు ఏడిచినా నాలుగు రాళ్లు చేతిలో పడడమంటే గగనంగానే వున్నది.. అయినా జగన్నాథంగారు నానా కష్టాలుపడి, కుటుంబాన్ని లాక్కొస్తూనే వున్నాడు. తన బాధలు ఇంకొకరితో చెప్పు కోవటమంటే అతనికెందుకో చిన్నతనంగా వుండేది. చెప్పు కోవటానికేం ? వైన వైనములుగా చెప్పుకోవచ్చు. చెప్పు కొన్న తరువాత ఒరిగి ఒళ్లోపడేదేమిటి? ఎదురుగా "అయ్యో పాపం ! అలాగుటండీ !" అంటారు. చాటునపడి తిడతారు. అలాంటి వాళ్లను రోజూ తనెంతమందిని చూడటం లేదూ ?

కొడుకు పుట్టాడని వినంగానే జగన్నాథంగారి సంతో షానికి సరిహద్దులు చెరిగిపోయాయి. పనిగట్టుకొని పాతబంధు వులందరికీ వుత్తరాలు।వాశారు. కనిపించిన పరిచయులందరికీ

చెప్పుకొన్నాడు. వందరూపాయలు ఖర్చుపెట్టి బ్రహ్మాండంగా బారసాల జరుపుకొన్నాడు.

అంతే!

అత నా సంతోషం పూర్తిగా అనుభవించనే లేదు. మంచాన బడ్డాడు. దీనికంతా కారణం నారాయణరావే నని చాలా మంది అన్నారు. కాని సుందరమ్మ అలా అనుకో లేకపోయింది. ఆ మాట జ్ఞప్తి కొచ్చినప్పుడల్లా ఆమె ఆత్మ గిజగిజ లాడేది. కొంత కాలంపాటు వంటిమీద నగలు అమ్మి జరుపుకొచ్చింది. ఇంకొంతకాలం అందిన చోటల్లా అప్పులు చేసింది. జగన్నాథంగారు కోలుకోలేదు. సుందరమ్మ ఇక చేసేదేమీ లేక అన్నగారికి వుత్తరం వ్రాయించింది. నాలు గో నాటికల్లా పురుషోత్తం వచ్చాడు. బావను చూశాడు. ఇక లాభం లేదనుకొన్నాడు. గంటలలోని దేగానీ, రోజుల దాకా గూడా వుండదనుకొన్నాడు. వ్యవహారాలన్నిటినీ పారచూశాడు. చేసిన బాకీ లేమిటో కనిపిస్తూనే వున్నాయి. ఉన్న ఇల్లేమో వుండనే వున్నది. పదిమంది పెద్దమనుష్యుల్ని పిలిచాడు. ఆ కొంప కాస్తా చెల్లెలు పేర పెట్టించాడు. ఆవిడ తదనంతరంగానే నారాయణరావుకు ఆ ఇల్లు సంక్రమించదు. జగన్నాథం స్పృహలో లేడు. ఎలాగో సంతకం పెట్టించాడు. సాక్షులుగూడా సంతకాలు చేశారు. ఈ తతంగం పూర్త యిన రెండు గంటలకే జగన్నాథంగారు చనిపోయారు.

వారం పది రోజులు గడిచాయి. అన్నిటికీ తానే నిలబడి పురుషోత్తంగారే కార్యక్రమమంతా జరిపించారు.

మధ్యాహ్నం ఎక్కడి బంధువు లక్కడి కెళ్ళారు. నడవలో మధ్యగా దీపం వెలుగుతున్నది. వంటింట్లో ఏదో చప్పుడవుతూన్నది. పురుషోత్తంగారు రెడ్డిగం వేసుకు గోడకు జారగిల బడ్డాడు. ఆరిపోయిన చుట్టనుసిని వుంగరపువేలితో నలిపి, కొసకొరికి, తుభుక్కున వూసి, చుట్ట అంటించాడు. సుందరమ్మ చీకట్లో మూలగా కూచుని కొడుక్కి పాలిస్తున్నది. రెండు మూడు పురుగులు లాంతరు చుట్టూ తిరుగుతున్నాయి.

"సుందరం! రేపు నేను వెడదా మనుకొంటున్నాను" అన్నాడు పురుషోత్తం.

సుందరమ్మ మాట్లాడలేదు. నోటికి గుడ్డ అడ్డం పెట్టుకొని ఏడవ నారంభించింది.

"పిచ్చిదానా! ఏడిచి నువ్వు చెయ్యగలిగిందేమి? పోయినవాడు ఎట్లాగూ రాడుకదా? ఛీ ఛీ — వూరుకో అమ్మా! పసివాణ్ణి ఒళ్ళో వుంచుకొని ఏడవకూడదు - ఏమిటంటే, నేనొచ్చిగూడా చాలా రోజులైంది. ఇక వెడతాను. పోతే ముందు జరగవలసిందేమిటీ? చచ్చినవాడితో మనంగూడా చావలేం! భగవంతు డిచ్చిన ఆయువున్నంత వరకూ — ఈ పాడుపొట్టకు ఏదోవిధంగా తంటాలు పడాలి. మరి నీ అభిప్రాయమేమిటి?" అన్నారాయన.

సుందరమ్మ జవాబు చెప్పలేదు. కాస్సేపు ఆలోచించి పురుషోత్తంగారే అన్నారు :

"అమ్మాయీ! నాకు తోచిందేదో నేను చెబుతున్నాను. నువ్వు గూడా బాగా ఆలోచించు. ఇంతకంటె

మంచి మార్గమేదైనా వుంటే సరే! నాకూ సంతోషమే!!—ఈకొంప నీకుండి ఇంత తిండి పెట్టదు. జానెడు గుడ్డ ఇవ్వదు. ఉండటానికి చూసినా — నువ్వొక్కర్తివీ వుండి ఏం చేస్తావ్? ఎలా బ్రతుకుతావ్? ముందు దీన్ని ఎంతకో ఒకంతకు అమ్ముకో — అదీగాక ఇప్పటికప్పుడే రెండు మూడు వందలదాకా నేను బాకీలు తీర్చాను. నేనేపాటివాణ్ణో నీకు తెలుసు. ముందు ఆ చేబదుళ్లు తీర్చకపోతే, నాకు మాట పోతుంది. ఆ మిగిలిన పదిరాళ్లు దగ్గరుంచుకో. ఇంకా పైకి రావలసిన నలుసొకడున్నాడు. వాడికంత కాలూ చెయ్యీ ఇచ్చావంటే, బండపగలేసి అయినా మానెడు గింజలు చేటలో పోస్తాడు. అందాకా నా ఇంట్లో వుండు. నా పిల్లలొకటీ, నా మేనల్లుడొకటీ నాకు కాదు. ఉన్నదాంట్లోనే తలా చారెడు తాగుదాం" అన్నాడు ఆయన.

దీనికీ సుందరమ్మ మాట్లాడలేదు. మౌనం అంగీకారం క్రింద తీసుకొని, పనులన్నీ పూర్తిచేశాడు పురుషోత్తం ఇవ్వవలసినవారి కిచ్చివేశాడు. రావలసినవి — (నిజంగా లేవు) వసూలు చేశాడు. ఒక తెల్లవారుజామున బండి కట్టించి తన వూరికి బయలుదేరాడు.

సుందరమ్మ దాదాపు పిచ్చిదానిలా అయిపోయింది. తను ఏనాడూ వూహించని విషయాలు, ఒకదాని వెనుక మరొకటి ఇలా, చకచక జరిగిపోతున్నవి. ఈ ఆకస్మిక సంఘటనల కామె నివ్వెరపోయింది. భర్త గతించినదానికే ఆమె హృదయం శోకంతో విహ్వలమైంది ఇల్లుకూడా పోయింది.

ఇక—ఈ క్షణంనుండీ ఆ ఇంటికీ తనకూ ఏ విధమైన సంబంధమూ వుండదని తెలిసినప్పటినుండీ సుందరమ్మ జ్వరపడిన దానిలా అయిపోయింది. పాటికి పదిసార్లు ఇల్లంతా కలయజూచింది. దాదాపు అయిదారేళ్లనుండి తను ఇక్కడ వున్నది. ఈనాటితో దీనికీ తనకూ ఋణం తీఱిపోయింది. తను వంటచేసిన గది, తను సాదుగిన్నె పెట్టె గూడు, సత్యనారాయణ పఠం, కరివేపాకు మొక్క, పడకగది, చూరులో ఆయనగారి పాత చెప్పులు – ఇలాగే ఒక్కొక్కటి విడరాని బంధమై ఆమెను ముందుకు కదలనివ్వడంలేదు. సామానంతా బండిలోకి సర్దిన పురుషోత్తం చెల్లెల్నిగూడా ఎక్కమన్నాడు. సుందరమ్మ "అన్నయ్యా" అని కావలించుకొని బావురుమని ఏడ్చింది.

"నేను రానన్నయ్యా! నన్నిక్కడే చంపెయ్" అన్నది.

"ఏ ముఖం బెట్టుకొని నే నక్కడికొచ్చేదిరా అన్నయ్యా" అన్నది. పురుషోత్తం చెప్పవలసినవి చెప్పాడు. మెల్లగా సుందరమ్మను బండిలోకి ఎక్కించాడు. "ఇదుగో! కుర్రాడు. జాగ్రత్తగా పట్టుకో–– ఆఁ ఆఁ— జారతాడు" అని హెచ్చరించాడు. సుందరమ్మ, గిలగిలలాడిపోతున్న చంటివాడికి పాలుకుడుపుతున్నది.

"ఇక పోనివ్వవోయ్ బండి" అన్నాడు పురుషోత్తం.

చిన్న వూపుతో బండి కదిలింది. సుందరమ్మ ఆ మసకచీకట్లో కళ్లు విప్పుకొని తన ఇంటి వైపు చూసింది.

కొంప బావురుమంటోంది. వేపచెట్టు మీద కాకులు రెండు మూడు సార్లు అరిచి, నూనేశాయి. బండి వీధి తిరిగింది. సుందరమ్మ పమిట నోటికడ్డం పెట్టుకొని కుమిలి కుమిలి ఏడ్చింది.

# 3

ప్రస్తుతం పురుషోత్తం మంచివాడు కాకపోయినా దుర్మార్గుడు మట్టుకు కాదు. చిన్నప్పుడే సంసారభారం నెత్తిన పడ్డది. ఆ కారణాన పదిమందిలోకి రావటం పోవటం అలవాటయింది. పదిమంది ప్రాప కాన మేస్టరు గిరీ సంపాదించుకొన్నాడు. దానికి తోడు ఏదో ప్రయివేట్లుగూడా చెప్పుకొంటూ నాలుగు రాళ్లు తెచ్చుకొంటున్నాడు. ఎవరికన్నా నోట్లు రాయాలన్నా, లెక్కా డొక్కా చూడాలన్నా చూసి పెడుతుంటాడు, తృణమో పణమో తెచ్చుకొంటాడు. పల్లెటూరు జీవితం నిలవ నీరులాంటిది. ఒకంతట దాని నడకలో పరిణామమంటూ వుండదు. నెమ్మదిగా, సూటిగా, మత్తుగా జరిగిపోతూ వుంటుంది. పురుషోత్తం దాదాపు పాతికేళ్లనుండీ పల్లెలలో గడుపుతున్నాడు. అతను తరుచు పట్నాలు చూడకపోవటంలేదు. అయితే, నగర జీవితం అతనిలో క్రొత్తగా ప్రవేశపెట్టిన మార్పేమీ లేదు. ఒడుదుడుకులు లేని బాటమీద బండి సాఫీగా నడిచిపోతోంది. పురుషోత్తానికి బంధువులంటే ఆపేక్ష అంతగా లేదు. చుట్టాల తోటే అతని తండ్రి చిదికిపోయాడు. ఆ సంగతి జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా అతను వుద్విగ్నుడయ్యేవాడు. కాని అతనికి సుందరమ్మ

ఒక విడవరాని బంధమయింది. ఈ బంధాన్ని అతను వదలించుకోవాలనీ ప్రయత్నించలేదు. ప్రయత్నించినా వదలదనే నమ్మకం కావచ్చు. అసలు వదిలించుకోవాలనే ఇచ్ఛ లేకపోవచ్చు. అసలే అంతంతమాత్రంగా వున్న సంసారానికి ఈ సుందరమ్మ, నారాయణరావు ఏ మాత్రమో భారం కాకపోరు. కానీ ఈ భారాన్ని ఒక భారంగా పురుషోత్తం గుర్తించలేదు.

దానిని గుర్తించిన ఘనత రామమ్మగారికి లభించింది. ఆవిడ ఈ బరువును వదిలించుకొనడానికి అవకాశం కోసం చూస్తున్నది. ఏ క్షణాన ఆ అవకాశం లభించినా, ఆవిడ దాన్ని జారవిడవదు.

ఇల్లు అమ్మగా వచ్చిన నాలుగు రాళ్లూ సుందరమ్మ అన్నగారి దగ్గర దాచుకొన్నది. ఆయనగారు వాటిని వడ్డీకిచ్చి, చిలవలకు పలువలు పెంచాలని ప్రయత్నించాడు. ఆ ప్రాంసరీ నోటుగూడా చెల్లెలుకు చూపించాడు.

"అదేమిటన్నయ్యా! మనిషిని మనిషి నమ్మకపోతే గొడ్డు నమ్ముతుందా? నువ్వు నాకు నోటు చూపించకపోతే మట్టుకేమిరా? నువ్వు నన్ను అన్యాయం చేస్తావా? నీ అల్లుణ్ణి చేస్తావా?" అని భరవాసాగా మాట్లాడింది.

"కాదే సుందరం" అన్నాడు పురుషోత్తం. "నువ్వాలా అనుకొంటావని కాదు. చూడమ్మా! నీకింకా తెలీదు. లోకం మహా చెడ్డది. ఒకడు సుఖపడుతున్నాడంటే చూచి సహించలేదు. పచ్చగా వున్న ఇంటిమీదకు రాళ్లు రువ్వు

తుంది - నువ్వేమీ అనుకోకు. ఆ మాట నా చెవిని పడి నప్పటినుంచీ, మనస్సు పరిపరివిధాల పోయిందనుకో. తోబుట్టువు డబ్బు హరించేటంతటి నీచుణ్ణి నేను కాదు. అహ— ఇరుగు పొరుగువారు నీతో అన్నారని ఆవిడ చెప్పింది—"

"చెబితేమట్టుకు నేను నమ్ముతానా అన్నయ్యా!" నాకు మటుకు నువ్వుగాక—" అని ఏదో అనబోయింది సుందరమ్మ.

"నమ్మావనిగాదే సుందరం! పది అబద్ధాలు ఒక నిజంతో సమానమంటారు. నేను నోటు రాయించకుండానే ఇచ్చాను ముందు. ఆ మాట విన్నాను. ఇక అన్నం సహించ లేదు. వెంటనే వెళ్ళి రాయించుకొన్నాను. దీన్ని భద్రంగా పెట్టెలో దాచుకో. నే వెళ్ళి భోంచేసి వస్తాను" అని నోటు సుందరమ్మకిచ్చి మరోమాట లేకుండా లోపలికి వెళ్ళిపోయాడు పురుషోత్తం.

నిజమే! సుందరమ్మతో అయిదారుగురు ఆడంగులు ఈ విషయం చెప్పారు. నీడబ్బు వడ్డీకివ్వలేదన్నారు. అదంతా పులుసులో పడిపోయిందన్నారు. కాకపోతే, దిన బత్తానికి కటకటల్లాడే పురుషోత్తం, భార్యకు కాసులెలా చేయించాడో కనుక్కోమన్నారు. పీలిక గుడ్డలతో జీరాడే వాళ్ళంతా ఈనాడు మాయని బట్టకట్టటానికి నీ డబ్బే కారణమన్నారు. సుందరమ్మ అన్నీ విన్నది. అవుననలేదు. కాదనలేదు. వాళ్లు చెప్పినవన్నీ నిజంగానే కనుపిస్తు న్నాయి. తన పుట్టిల్లు తను ఎరుగకపోలేదు. ఎప్పుడూ

దేనికో ఒక దానికి కట కట తప్పనిమాట నిజమే! అటు వంటిది ఇప్పుడు సాఫీగా జరిగిపోతున్నది. తనను అన్న గారు ఆదరంగానే చూస్తున్నారు. వదినమాటకేం గానీ — ఆవిడ బాగానే వుంటున్నది. దీనికంతా కారణం తన డబ్బా? సుందరమ్మ నమ్మలేకపోయింది. తన అన్న తనకు ద్రోహం చెయ్యడు. అయితే, ఈ ఆడంబరాలకు డబ్బెక్కడనుండి వస్తున్నది? ఈ సందేహానికి జవాబుగా పురుషోత్తం నోటు చూపించాడు. ఏదో వ్యాజ్యంలో ప్రవేటు నడిపాడుట. పదిరాళ్లు మిగిలాయట. డబ్బుగా వుంటే, ఆకుకు అందకుండా, పోకకు పొందకుండ పోతుందని బంగారం నల్లగొట్టి పడే శాడట. ఇందులో సందేహించవలసిందేమీ సుందరమ్మకు కనుపించలేదు. పార్టీదారులు రావటం, వ్యాజ్యం విషయం మాట్లాడటం ఆవిడ చాలా దఫాలు విన్నది. స్వయంగా చూసింది. ఈ నిదర్శనంతో ఆవిడ సందేహములన్నీ తీరి పోయాయి. ఇంత కాలమూ ఏదో ఒక తెరవంటిది దామెను కప్పివుంది. ఇప్పు డది తొలగి పోయింది.

నోటీసు తన దగ్గరుంచుకోవటం మంచిది గాదు. అయినా, కాకపోయినా అది అన్నమీద అపనమ్మకాన్నే తెలియజేస్తుంది. ఇన్ని నిదర్శనాల తరువాత గూడా, తను అన్నను నమ్మలేకపోవటంకంటె ఘోర మేముంటుంది? అందు కనే సుందరమ్మ నోటును అన్నగారికే ఇచ్చి జాగ్రత్తచేయ మని చెప్పింది. ఆయనగారు కాసేపు గినుకులాడి పట్టుకెళ్లాడు.

ఈసారి తన డబ్బును గురించి, తనకు హెచ్చరిక లిస్తున్న వారికి సుందరమ్మ ఈ విషయం చెప్పింది. ఈ దెబ్బతో వారి అనుమానాలన్నీ తీరిపోయి, తనతో ఈ ప్రసక్తి తీసుకు రారని ఆవిడ భావించింది. కానీ విన్న తరువాత వారు వెలి బుచ్చిన సందేహాలు మరింత బాధాకరంగా వున్నాయి.

"నోట్లు చూపించడానికేం డెబ్బయ్ ఆరు చూపించ వచ్చు. అది నిజమో అబద్ధమో నీకేం తెలుసు? నువ్వు చదివావా? పోనీ చదివించుకొన్నావా? ఎవరిదో చూపించి, నీదని బుకాయించాడేమో నీకేమి తెలుసు—" ఇత్యాది.

సుందరమ్మ మనస్సు నిజంగా ఈ సారి పరిపరివిధాల పోయింది. నిజంగా అన్నయ్య ఇలాంటి నైచ్యానికి ఒడిగడ తాడా! ఛ తను పూరికే అనుమానిస్తోందిగానీ, తనను అన్యాయం చెయ్యాలని అన్నయ్య కెందుకుంటుంది?

"ఎందుకుండమా?" అన్నాడు ఎవరో? వాటికి సుంద రమ్మ జవాబివ్వలేదు.

* * *

రోజులు గడిచిపోతున్నాయి. పురుషోత్తం కుటుంబం తిరిగి దరిద్రాన్ని చవి చూడవలసి వస్తున్నది. తిండికీ గుడ్డకూ కటకటలాడిపోతున్నారు. ఒక్కొక్కసారి పన్నెండింటికిగానీ పొయ్యి రాజటంలేదు. పిల్లలు అన్నమన్నమని గావుకేకలు పెడుతున్నారు.

"ఇదిగో చూశావా సుందరమ్మా!" అన్నారు ఇరుగు పొరుగువారు. "ఇదివరకు మేమేదో చెబితే నువ్వు నమ్మ లేదు. విరోధం వుండి నీతో చెప్పామని నువ్వనుకొన్నావు. నీ డబ్బంతా ఖాళీ అయింది. మీ వదిన మెళ్లో కాసులేవి? అన్నీ అయిపోయినాయి. ఇక నీ నోట కరక్కాయే గతి. ఎదిగే కుర్రాణ్ణి ముందుంచుకుని అతని చేతికి జుట్టిచ్చావేమి టమ్మా! నీ అమాయకత్వం కూలిపోను. ఇక నీకు నలిచిన పున్నయినా రాదు" అని హితబోధచేశారు.

ఈ బాధలన్నీ సుందరమ్మ చూస్తూనేవున్నది. తిండికి కటకట ల్లాంటివి ఆమెకు తెలియకపోలేదు. అయితే వీటికి అన్నగారు చెప్పే సంజాయిషీ వేరు. ఊళ్లో మరో రెండు మూడు బళ్ళు వెలిశాయట. పెద్ద పెద్ద వాళ్ళ కాళ్ళట్టుకొని, వాళ్ళు తన పిల్లల నందరినీ తిరగ్గొట్టేశారట. పట్టుమని పాతిక మందయినా తన దగ్గరకు రావటం లేదుట. రాబడి పూర్తిగా తగ్గిపోయిందట.

"రాబడి తగ్గింది గానీ ఖర్చు తగ్గలేదు. ఈ రెండింటికీ పొత్తు కుదుర్చుకోలేక చచ్చిపోతున్నాను" అన్నాడు పురుషోత్తం.

అన్న నోటినుండి ఈ అర్థం వచ్చేమాటలను ఇటీవల సుందరమ్మ చాలాసార్లు విన్నది. రామమ్మగారుకూడా యథా శక్తి తన వంతు నెరవేర్చుకోసాగింది. వీరిద్దరూ, తన ఎదుట తరచుగా ఇలా అనడంలో ఒక అర్థమంటూ వున్నదని సుందరమ్మ అనుకోలేదు. ఇరుగు పొరుగులు చెప్పిందాకా

వాటికోక అర్థముంటుందని కూడా ఆవిడ అనుమానించలేదు. చిత్రమేమిటంటే – తను అనునిత్యమూ, వింటున్న ఈ ఇంటి విషయాలు, తన కంటే, బైటవారికే చప్పున తెలిసిపోతున్నాయి. దీన్నిబట్టిచూస్తే, వాళ్లు తన దగ్గర యదార్థాన్ని దాచనన్నా దాచాలి. లేదా తను గ్రహించలేకనన్నా పోవాలి. ముందుముందు – తన ఎదటే – దాదాపు తనతోనే అంటున్నట్లు నిర్దేశించబడిన ఈ రకమైన మాటలు, క్రమంగా నలుగురితోనూ అనడం సాగించారు. ఆ మాటలనుబట్టిచూస్తే, ఆ ఇంటికి, మోయలేనంత మరొక భారమేదో వచ్చిపడినట్లు అర్థమవుతుంది.

“ఇబ్బందీ అంటే–ఇబ్బంది కాక మరేమిటి? ఆర్జనేమీ లేని బొమ్మలమీద బొచ్చుకుమల్లే ఎదుగు బొదుగులు లేని దాయె. ఖర్చు చూద్దామా అంటే – కుటుంబముమీద కుటుంబం వచ్చిపడె. అప్పుడే ఏమయింది మాబతుకు. ఇంకా హీనపడి అడుక్కుతిన్నదాకా మాకీ చెర తప్పదు. తప్పేదేముంది” అంటుంది రామమ్మ తనకు వీలు చిక్కినప్పుడల్లా. ఈ మాటలు ఎవరినుద్దేశించి అంటున్నది, ఆలస్యంగా నయినా సుందరమ్మ గ్రహించింది.

బారమల్లా తనూ, తన కొడుకే! వదిన దెప్పిపొడిచినా, అన్న విసుక్కున్నా, తమ ఇద్దరినే! ఈ విషయం తెలిసికొన్నప్పటినుండీ సుందరమ్మ మనస్సు గింజుకొన సాగింది. గింజుకొని అది వికావికాలవటం తప్ప మరేమీ సాధించలేదు. చివరికదే జరిగింది కూడాను. సుందరమ్మను

రామ రామ ఆ ఇల్లు దుస్సహంగా నరకంగా కనుపించ సాగింది. అది ఆమె మనోవిభ్రమమే కావచ్చు. ఆ ఇంటిలోని ప్రతివారు తన నిర్గమనంపట్ల అత్యంతాసక్తిని కల్గివున్నారని సుందరమ్మ అనుకోనసాగింది. చీటికీ మాటికీ రామమ్మ ఎలక మీదా, పిల్లిమీదా అనటం ప్రారంభించింది. ఇటువంటి అలౌకిక విషయాల్లో ఆమెగారికున్న ప్రవేశం అద్వితీయ మైనది. తనమాటలచేత ఎదుటివారి హృదయం, ఎంత గాయ పడితే అంత సంతృప్తి ఆమెకు లభిస్తుంది. సుందరమ్మ ఆత్మాభి మానం గలదని రామమ్మ ఏనాడో గ్రహించింది. ఆనాడే ఆమె తన గాండీవాన్ని ఎక్కుపెట్టింది. శరసంపత్తిని అపా రంగా కూర్చుకొన్నది శత్రువును పరాజయం పొందేంత వరకూ ఆవిడ వాటిని వుపసంహరించదు. తరిమూచి బాణాన్ని విడుస్తుంది. ఆ నేర్పు ఆమె కాజన్మసిద్ధం.

ఈ విషయాలన్నీ పురుషోత్తానికి తెలుసో లేదో సుంద రమ్మకు తెలియలేదు. ఇలా తనను, క్షోభపెట్టటం భావ్యం గాదని అన్నకు చెప్పుకోవాలని ప్రయత్నించింది. ఆ అవకాశం చిక్కలేదు. చిక్కకపోవటమే మంచి దయిందనుకొన్నది సుందరమ్మ. తను అడిగినట్లయితే అన్న చెప్పే సమాధానం వూహించుకొని గజగజ వణికిపోయింది. తన అన్న ప్రోద్బ లమే లేకపోతే, రామమ్మ ఇంత తీవ్రదశ నందుకోగలదా? ఏ క్షణాన తను అన్నతో చెప్పుకున్నా, తనవీపు బద్దలయిపోతుం దన్న జ్ఞానమే ఆమెకు లేదా? ఎంత లేసి సంగతులైనా వైన వైనాలుగా చర్చించగల తన వదినకు ఈ పాటి పరిజ్ఞానం

లేదనుకోవటం పొరబాటు. తన నేమనినా, భర్త దండించడనే ధీమాలాంటిదేదో రామమ్మకు వుండివుండాలి. ఆ మాత్రం దన్ను లేకపోతే, వదిన అలా పెచ్చరిల్లడానికి అవకాశమేది? అంటే — తేలిన సారాంశమేమిటంటే, తనభారం అన్న మోయలేకుండా వున్నాడు. తన నెలాగైనా వదిలించుకోనాలని అన్న వుద్దేశమై వుండవచ్చు. ఈ అనుమానమే నిజమైతే తన గతేమిటి? ఎక్కడకు వెళ్ళాలి? ఎలా జీవించాలి? తన బాబు గతేమిటి?

నారాయణరావు తలపునకు రాగానే సుందరమ్మ కన్నుల శ్రుతప్తాలయినాయి. గుండె దిగులుతో బరువెక్కిపోయింది ప్రక్కనేవున్న కొడుకును రొమ్ములమీదికి తీసుకొని గట్టిగా కౌగలించుకొంది. ఎంత ఆపుకొందామన్నా ఆమెకు దుఃఖ మాగలేదు, బావురుమని ఏడ్చింది. తను ఏడ్చింది. తన ఏడ్పుకు ఎవరన్నా లేస్తారేమోనని నోట్లో గుడ్డలు కుక్కుకొంది. మనస్ఫూర్తిగా ఏడ్చే స్వాతంత్ర్యం గూడా సుందరమ్మకా ఇంట్లో లేదు.

నారాయణరావు అటూ ఇటూ మసిలాడు. సుందరమ్మ వాణ్ణి భుజంమీదకు పొదుపుకొంది. మెల్లగా చిచ్చుకొట్ట సాగింది. చిరిగిన చొక్కాలో వ్రేళ్లు చిక్కుకొన్నా యొకసారి. నారాయణరావుకు సరయిన గుడ్డలు లేవు. కుట్టించమని తనుఅన్నను అడుగలేదు. తనపిల్లలందరితో బాటు వాడికీ, మొన్న పండక్కు కుట్టిస్తారనుకొన్నది. అంతే! ఆశిష అనుకొన్నట్లు ఏది జరిగింది గనుక ఇది జరుగుతుంది? తల

అట్టగట్టుకుపోయింది. ఒకటి రెండు సార్లు వాడికి తలంటి పోయాలని ప్రయత్నించింది. కానీ అది సందర్భపడలేదు. ఏవో అడ్డుపనులు తగులుతూనే వున్నాయి. అదీగాక ఆవిడకు బొత్తిగా తీరుబాటు లేదు. ఇంటి చాకిరీ సుందరమ్మే చేయవలసి వస్తున్నది. రామమ్మ అనారోగ్యం ప్రధాన కారణం. ఆ జబ్బేమిటో తెలీదు. పురుషోత్తం గూడా పట్టించుకోడు. కానీ ఆహార విహారాదుల్లో మార్పేమీ లేదు. అన్నం తినటం, స్నానం చెయ్యటం, తల దువ్వుకోటం, పేరంటాని కెళ్ళటం లాంటి బరువైన పనులన్నీ, అప్పటికీ రామమ్మే చేస్తుంది. మిగతా స్వల్పపనులన్నీ సుందరమ్మ వంతుకొచ్చాయి. ఆవిడ దాదాపు ఆ యింటి పనిమనిషయింది. పనిమనిషికి ఒక జీతమంటూ వున్నది. ఒక కాలము, జీతము, సెలవులు వున్నాయి. సుందరమ్మకి వేవీ లేవు. భేధమల్లా ఇది మాత్రమే!

అయినా ఈ యింట్లో ఆమెకు గౌరవం లేదు. జాలి లేదు. ఆమె పట్ల సానుభూతి ప్రకటించే హృదయం లేదు. ఉన్నదల్లా రెండే రెండు హృదయాలు. ఒకటి అన్నది. మరొకటి వదినది. ఈ రెండు హృదయాల్లో జాలి వుండేందుకు వీలులేదు. ఉన్నా వారికి దానివల్ల ప్రయోజనం లేదు. శరీరం హీనమయ్యే ఈ శ్రమతో బాటు, ఆమెకు హృదయభేద్యమయిన వచోగరిమగూడా భరించటం కష్టమయింది. ఇక ఏ క్షణాన తనను ఇంటినుండి పొమ్మన్నా పొమ్మనవచ్చు. పరిస్థితులల్లా వచ్చాయి.

ఒక రోజున ఇంట్లో ఏదో వస్తువు పోయింది. రామమ్మ ఇల్లంతా వెదికింది. పిల్లల్ని పేరుపేరు వరసనా పిలిచి అడిగింది. శారద తియ్యలేదన్నది. శకుంతల చిన్న కుంకాయె. నారాయణరావు ఎరగనన్నాడు. ఆ వస్తువు ఇక్కడే పెట్టినట్టు రామమ్మకు గట్టి నమ్మకం వుంది. ఆవిడ నమ్మకాన్ని ఎవ్వరూ కాదనలేరుగదా! ఆవిడ నానాహంగామా చేస్తూ ఇల్లంతా పీరపీహోరం చేయనారంభించింది. అన్ని పెట్టెలు, గభగభమని సగలవేయసాగింది. "పురుషోత్తంగారింట్లో దొంగలుపడి ఏదో ఎత్తుకపోయారట." ఈ వార్త దావానలంలా వీధంతటా ప్రాకింది.

"అసలే ఒక్క ముండాకొడుకు. దానికితోడు..."

"అదీగాక, నిన్న పేరంటానికని, ఎవరిదో కాసుల పేరు — అదే — కామాక్షమ్మది — ఎరువు తెచ్చిందట రామమ్మ. ఇంతలోకే దానికి రెక్కలొచ్చాయి."

దొంగలు ఎప్పుడు పడ్డారని, ఎక్కడ కన్నం తవ్వారనీ, అప్పుడు చప్పుడేమీ కాలేదా అని వేలాది ప్రశ్నలు. ఎవరికి తోచిన ప్రశ్నలు వారడుగుతున్నట్లుగానే. ఎవరికి వచ్చిన సమాధానాలు వారు చెబుతున్నారు.

రామమ్మ ఒక్కొక్క పెట్టె బైట పడేస్తున్నది వెదుకుతున్నది. ఒక్కక్షణం ఆమె ముఖం ఆశ్చర్యాన్ని ప్రదర్శించింది. మరుక్షణం ఆగ్రహావేశ పూరితమైంది.

"హమ్మయ్య! ఆ ఏడుకొండల స్వామికి తల నీలా

లిస్తాను. ఇదే గనక పోతే ఇంకేమయినా వుందా? అమ్మయ్యో!'' అని గుండెలు బాదుకోసాగింది రామమ్మ.

"ఎక్కడ దొరికిందిది?"

"దేంట్లో వుంది?"

"మరీ అంత మతిమరుపైతే ఎలాగమ్మా."

"ముందు కాస్త చూసుకోవద్దూ?"

సుందరమ్మ నిర్విణ్ణురాలయింది. ఆ పెట్టె ఆమెది. ఆ పన్నెండు సవరీల గొలుసు తన పెట్టెలోకి ఎలా వచ్చింది? ఎవరు వేశారు?

"అయ్యో! ఇక మీరు వెళ్ళండి. గొలుసు దొరికింది. పోయిందనుకొన్నాను. మా ఆడబిడ్డ పెట్టెలో వున్నది. తీసిన దానివి నాతో చెప్పవద్దుటమ్మా! ఏమి ఎరగని నంగనాచి లాగా వూరుకొంటావేం! — ఈ మూటేమిటి? గుడ్డలన్నీ ఇలా మూటకట్టా వెందుకు?

ఇలా ఒక్కొక్క మాట రామమ్మ అడుగుతుంటే, సుందరమ్మ ఒక్కొక్క మెట్టు పడిపోతున్నట్లు దిగజారి పోయింది. గోడకు జారగిలబడి, అలానే నిశ్చేష్టురాలయింది. చుట్టూ వున్న జనం ఏమనుకన్నారో, ఏమనుకుంటున్నారో ఆమెకు తెలిసినట్టు లేదు. నారాయణరావు తల్లి పమిటను పట్టుకు లాగుతున్నాడు. రామమ్మ తనకున్న ఆగ్నేయాస్త్రా లన్నింటినీ సంధించి విడిచింది. ఫలితం ఆమెనే చకితను చేసింది.

ఆ రాత్రి సుందరమ్మ భోంచేయలేదు. నారాయణరావు బూరకోసం ఏడి చేడిచి నిద్రపోయాడు. పురుషోత్తం చుట్ట కాల్చుకొంటూ సుందరమ్మ గదిలోకొచ్చాడు. సుందరమ్మ లేచి నిలుచుంది. పురుషోత్తం పెట్టెమీద కూచుని, చుట్ట కాల్చాడు. పొగాకు అడ్డీకాల్పుది గావును నిత్యాగ్ని సంస్పర్శ నది అభిలషిస్తున్నది. వంగి మంచంకోటి ప్రక్కనే పెట్టాడు. సుందరమ్మ అన్నకాళ్ళు పట్టుకొని భావురుమని ఏడిచింది.

"ఇప్పుడేడ్చి లాభంలేదు" అన్నాడాయన.

"ప్రమాణ పూర్తిగా చెబుతున్నా నన్నయ్యా! నా కొడుకుతోడు. నే నేపాపమూ ఎరుగను. ఇటువంటి పని నేను చేస్తానా అన్నయ్యా! నా బుద్ధి ఎటువంటిదో నీకు తెలియదూ?" అన్నది సుందరమ్మ.

"నే నేగంగలో దూకేది? నువ్వు దొంగతనం చేశా వననా? నా పెళ్లాం చేసిందననా? నే నెవరినీ అనను. నిజా నిజాలు ఆ పరమాత్మకు తెలియాలి. ఏది ఏమయినా నువ్విక్కడుండటం మంచిది కాదు. నిజమైనా, అబద్ధమైనా ఇప్పటికే ఈ విషయం వూరంతా పాకిపోయింది. ఇక నిన్ను కాకని పొడిచినట్లు పొడిచి చంపుతారు. నీవల్ల నేను వూళ్ళో తలెత్తుకొని తిరగలేను. కాబట్టి కొంతకాలం నువ్వెక్కడున్నావుండు. ఈ గోల సద్దుమణిగిన తరువాత తిరిగి వద్దువు గాని. దగ్గరేలే -- ఒక వూరున్నది. నాకు కాస్త తెలిసిన వాళ్ళక్కడున్నారు. ప్రస్తుతం ఇదిలా సాగనివ్వు. ఇక

నువ్వేమీ చెప్పకు. ఇంద ఈ పాతిక రూపాయలు నీదగ్గర వుంచుకో. మధ్య మధ్య నేను వస్తుంటాను. ఫరవా లేదు. గుడ్డలు ఇందాకనే సర్దుకొన్నావుగా! చీకటితో వెడదాం. తెల్లవారితే మరీ గోలగా వుంటుంది.''

## 4

ఊరు అట్టే పెద్దదిగాదు. పురుషోత్తం పల్లెతో పోలిస్తే ఇది బస్తీయే! అప్పుడప్పుడు వచ్చి చూసి పోతుంటానని సుందరమ్మకు మరి మరి చెప్పి వెళ్ళి కూడా నాలుగు నెల లైంది. లంకంత ఇల్లు గనక ఇంటివారు అద్దె అడగక పోవచ్చు. పట్టణాలలో లాగా నీళ్ల దగ్గరనుండీ కొనుక్కోన వలసిన అవసరం లేకపోవచ్చు. అంతమాత్రాన పాతిక రూపా యలు నాలుగు నెలలు రావు. ఆ పాతికను సుందరమ్మ ఎంతో పొదుపుగా వాడింది. రెండు నెలల క్రిందటే అవి చెల్లి పోయాయి. సుందరమ్మ అన్నకు నాలుగైదు వుత్తరాలు రాయించింది. ఆ వూరికి వెడుతున్న వారితో కబురు చేసింది. 'ఇదిగో వస్తా' — 'అదుగో వస్తా' ననటమేగానీ పురుషోత్తం వచ్చిందిలేదు. చివరి వుత్తరం తను చెప్పి దగ్గరుండి రాయిం చింది. తనిక్కడ నానా ఇబ్బందీ పడుతున్నాననీ, వడ్డీ డబ్బు వసూలుచేసి పంపమని, లేకపోతే నోటు తనకు పంపితే తనే వెళ్ళి వసూలు చేసుకోగలననీ వ్రాయించింది. పురుషోత్తం జవాబు వ్రాశాడు.

"చిరంజీవిగా దీవించి వ్రాయునది. ఇక్కడ అంతా క్షేమములు. నీవు వ్రాయించిన వుత్తరం పట్టుకొని నేను ఆ ఆసామీవద్దకెళ్ళి అడిగినాను. అతనుగూడా ఇంకా ధాన్యం వగైరాలు అమ్మలేదుట. అమ్మగానే డబ్బు పంపగలను. నీ డబ్బుకు వచ్చిన భయములేదు. చిరంజీవి నారాయణరావు యోగక్షేమములు తెలిపేది.

ఇట్లు,
పురుషోత్తం వ్రాలు

ఈ ఉత్తరం వచ్చిన నెలకైనా పురుషోత్తం రాలేదు. ఆవిడకు ఇరుగు పొరుగులు చెప్పిన మాటలు జ్ఞప్తికి రాసాగాయి. ఒకవేళ అవే నిజమేమో నన్నభావం తటిల్లతలా మెరసి మాయమయేది. కానీ, నిజానిజాల నామె నిర్ణయించలేకపోయేది. రోజులు గడుస్తున్నకొలదీ అన్నమీద అనుమానం బలపడసాగింది. కానీ ఏ అంధవిశ్వాసమో ఆమె అనుమానాన్ని ఒక్కక్షణం జర్జరిత మొనర్చేది.

ఇటువంటి బాధలు ఆమె అనుభవించలేదు. వినలేదు. కనలేదు. ఇటువంటి గడ్డు పరిస్థితులొస్తాయని వూహించనన్నా వూహించలేదు. ఒకవేపు దిక్కు తెలియని అనుభవశూన్యత, అన్నగారింట దారుణమైన అవమానం, ఎదుగుతున్న కొడుకు, ప్రతిదినం తీవ్ర సమస్యగా ఎదురవుతున్న దరిద్రం. వీటి మధ్య సుందరమ్మ జీవితం నలిగి పోతున్నది. రక్షణకోసం ఆమె వేసిన కేకలు ఎవ్వరికీ వినపించలేదు. వినిపించిన వారు రక్షించనూ లేదు.

ఇక గత్యంతరం లేక చేతి కున్న నాలుగు బంగారు గాజులూ అమ్మింది. వాటితో కొన్ని నాళ్ళు గడిచాయి. కానీ వాటి తరువాత? ఆ తరువాత తను చెయ్యవలసిం దేమిటి? ఎలా జీవించాలి? పోనీ తను ఒంటరిదైతే, ఏనాడో ఈ గుక్కెడు ప్రాణమూ వదలి వుండేది. కానీ, తనమీద ఆధార పడి నారాయణరావున్నాడు. తను జీవించి వుండగానే వాడు దరిద్రాన్నంతా అనుభవిస్తున్నాడు. తన తదనంతరం వాడి గతేమిటి? ఎవరు చూస్తారు? ఈ ప్రశ్నకు ఎంత ప్రయత్నిం చినా సమాధానం రాలేదు. తను చచ్చి సాధించేదేమీ లేదు. లేనప్పుడు చావటం అనవసరమే. రోజు లెప్పుడూ ఇలాగే వుండవు. కొంత కాలానికైనా మారక తప్పదు. ఆ మార్పును అనుభవించటానికై తనిప్పుడు జీవించాలని సుందరమ్మ నిర్ణయించుకొన్నది.

ఒక రోజున సుందరమ్మ గదివాకిటిలో వుండి వీధివైపు చూస్తున్నది. దూరంగా ఒక స్త్రీ నెత్తిమీద ఏవో పెట్టుకొని, అమ్ముతుండటం సుందరమ్మకు కనుపించింది. కొన్ని క్షణాలు తనే ఆ మనిషిగా సుందరమ్మ భావించింది. అప్పుడు బ్రతకటా నికి ఇంత హైరాన పడనక్కర్లేదు. కాని తన ఆత్మాభిమా నము, వంశగౌరవము, అన్నగారి పరువు ఇందుకు అడ్డు వస్తున్నాయి. నిజమేగానీ ఇవన్నీ తనకేమీ వరగబెట్టడం లేదు. అయినప్పుడు వాటిని తనెందుకు ఖాతరు చెయ్యాలి?

"అమ్మీ ఇలా రా!" అని సుందరమ్మ పిలిచింది. అమ్మి వచ్చింది. నల్లబై ఏళ్ళుంటాయి. ఇద్దరు కొడుకులున్నారట ఆమెకు.

"ఇద్దరు కొడుకులూ నీకు అన్నం బెట్టరా అమ్మీ!" అన్నది సుందరమ్మ.

"ఎందుకు పెట్టరమ్మా! వాళ్లు మంచోళ్లే! పెళ్ళాలు మంచివిగావు. ఉత్త పొగరుమోతువి. నాకు కూడెడితే లగ్గల కెత్తుతారు. వాళ్ళను నానామాటలూ అంటారు" అన్నది అమ్మి.

"అంటే వూరుకుంటారా మీ పిల్లలు?"

"వూరుకోరమ్మా! చచ్చేట్టు కొడతారు. ఒకసారి మా పెద్దోడు లచ్చిమిని డొక్కలో తన్నినాడు. ప్రాణం అన్నుబట్టింది దానికి. ఇహ నేనక్కడుండలేక పోయానం డమ్మా! నా మూలకంగా ఆళ్లు దెబ్బలు, తినటమెందుకు లెమ్మని నేనే ఈవూరొచ్చి బతుకుతున్నాను. ఎక్కడయి తేనేం తల్లీ! నాకూ కావలసింది బొక్కెడు మెతుకులు" అన్నది అమ్మి.

"రోజుకు ఏ మాత్రం వుంటుంది?"

"ఇదివరకు స్వంతంగా అట్లు పోసుకొనేదాన్ని. అర్థ రూపాయ డబ్బులకు చావుండేదిగాదు. ఏదో నేనూ చెయ్య లేకపోయాను. మారుబేరానికి తెస్తుంటాను. బేడ, మూడ ణాలు దొరకుతుంటై. ఒక్కోరోజున నష్టంగూడా తగుల్తుం టుందమ్మా! ఆయన సరుకు మంచిదిగాదు. సరిగ్గా అమ్ముడు

పోదు—నే పోతానమ్మా! మీ కేమి కావాలో తీసుకోండి. ఇప్పటికే చాలా పొద్దు పోయింది.''

''ఇందుకే పిలిచాను. రెండు రోజులు నా దగ్గర సరుకు కొని చూడు—'' ఆ పైమాట సుందరమ్మ అనలేకపోయింది. ఎవరో పీక నులముతున్నట్లు ఆగిపోయింది.

''అలాగేనమ్మా! రేటు మీకు తెలుసుగా—''

అమ్మి వెళ్లిపోయింది. పోయిన తరువాత సుందరమ్మ చాలాసేపు ఆలోచించింది. తనెందుకలా అమ్మితో అన్నది? నిజంగా—మనిస్ఫూర్తిగా తను అలా అనవలెనని ఆ మాట సుందరమ్మ అనలేదు. సుందరమ్మలో వున మరొక ''వ్యక్తి'' అన్నది. ఉదయపు నీరెండ వరండాలో పడుతున్నది. ఒక దూడ పాలకోసం 'అంబా' అంటూ అరుస్తున్నది. గింజుకొంటున్నది. పసువులు దుమ్ము రేపుకొంటూ అరుచుకొంటూ పొలాలకు పోతున్నాయి. ఇంటి వారిపిల్లలు ''గిన్నె గిరగిరా—శంభు శంకరా'' అని ఆడుకొంటున్నారు. ఎదురింటి పిల్లలు ''వస్తానోయ్ వంకాయ్—రావోయ్ టెంకాయ్'' అంటూ ముచ్చిలి ఆడుకొంటున్నారు. నారాయణరావు దూరంగా పిల్లెమ్మలకోసం ప్రయత్నిస్తున్నాడు. లాగు పిరుదుల మీద చినిగిపోయింది. వళ్లంతా దుమ్ము కొట్టుకొని తెల్లగా అవుపిస్తున్నది.

సుందరమ్మ అలానే చాలాసేపు కూచున్నది. ఈమాట తను అన్నందుకు ఆత్మ వేధింపసాగింది. తను ఇట్లా అమ్ముకోవటం—ఈ వృత్తిమీద జీవిస్తున్నట్టు నలుగురకూ తెలిస్తే

ఎంత అవమానం? ఎంత హీనంగా వుంటుంది? ఆ వెంటనే మరొక ప్రశ్న భయంకరంగా ఆమెను ఎదుర్కొన్నది. ఏ పనీ లేకుండా, ఏదీ చేయకుండా ఎలా జీవించటం? ఏ ఆధారంతో-

చాలా ప్రొద్దెక్కింది. సుందరమ్మ అంతవరకూ అలా ఆలోచిస్తూనే కూర్చున్నది. నారాయణరావు ఆటలు చాలించి "అన్నమో" అంటూ తల్లిమీద పడి మారాం చేస్తున్నాడు. తను చేసిన పొరపాటు ఇప్పటిదాకా సుందరమ్మకు తట్టలేదు. ఈ దిక్కుమాలిన ఆలోచనల్లో పడి పొయ్యి రాజెయ్యనేలేదు. "అన్నం" అని నారాయణరావు అడిగిందాకా సుందరమ్మకా సంగతే స్ఫురించలేదు. గిన్నెలో చూచింది. కాస్త చద్దన్నం వుంది. ముందు ఆ రెండు మెతుకులూ నారాయణకు పెడితే తను తీరిగ్గా వండుకోవచ్చు. పిచ్చి సన్నాసి - ఇప్పటికే చిక్కి సగమైనాడు.

"నాన్నా! స్నానం చేద్దువుగాని రా" అని సుందరమ్మ నారాయణరావును పిలిచింది.

"ఫో. నేను రాను" అన్నాడు కుర్రాడు.

"ఒంటినిండా మట్టయింది. చూడరా! బూడిద గుమ్మడి పండులాగా వున్నావు. మా నాయనగా! రెండు చెంబులు గభుక్కున పోసుకుందువుగాని రా. లేకపోతే నిన్నెవరూ ఆడు కోటానికి రానివ్వరు."

"సన్నీలు పోసుకోను. సలిబుట్టుద్ది"

"పది గంటలప్పుడు చలేమిట్రా తులువ. వూ. ముందు పద" అన్నది సుందరమ్మ కొంచెం గట్టిగా.

నారాయణరావు మూలుగుతో ప్రారంభించి ఏడుపు మొదలెట్టాడు. సుందరమ్మ ఇక వాడికి నీళ్లు పొయ్యలేక పోయింది. పైటచెంగు తడిపి వళ్లంతా శుభ్రంగా తుడిచింది. గిన్నెలో చద్దన్నం పెట్టుకొని రవ్వంత పచ్చడి కలిపి, కొడుకును చంక నెత్తుకొని తినిపించసాగింది. ఆవురావుర మంటూ నారాయణరావు రెండు మూడు ముద్దలు మింగాడు. ఇక తిననన్నాడు.

"అప్పుడే పొట్టనిండిందట్రా" అన్నది తల్లి.

"మంత పుత్తుతుంది."

సుందరమ్మ మాట్లాడలేదు.

"కాత్తె ఆయి యెయ్యనే అమ్మా! నాకు ఆయి గావాలి. లేకపోతే నేను తిన్ను."

'ఆయి' ఇంట్లో అయిపోయి రెండు మూడు రోజులైంది. ఈ రెండు మూడు రోజులూ నారాయణరావు ఇలా పేచీ పెడుతూనే వున్నాడు. చిన్నగిన్నెలో కాసిని నీళ్లుపోసి, వాటినే నెయ్యిక్రింద మార్చి చెప్పి, కొడుకును సమాధాన పెడుతూ వచ్చింది. ఇవ్వాళగూడా ఆతంత్రమే చేసింది. కానీ నారాయణరావు తినలేదు. ఈ చిత్రమైన 'ఆయి' ఎంత వేసినా అన్నపుమంట తగ్గలేదు. తినమంటే తిననన్నాడు.

"నీతో నెట్లా చచ్చేదిరా! ఇలా తిండి తినకుండా ఎంతకాల ముంటావురా! నీతో వేగలేకుండా వున్నాము సాయంత్రం మరింత నెయ్యేస్తాను. ఈ పూటకు తిను. ఇంద –

ఇదేమోనాన్న ముద్ద-వూ-నోరు తెరువు - అదీ! మా బాబు చాలా మంచాడు — కదునాన్నా! ఆ - ఇదేమో మావయ్య ముద్ద - పట్టు — మరీ — ఇదేమో — అత్తయ్య ముద్ద—''

అన్నం అలానే తిన్నాడు. చాపపరిచి పండుకోబెట్టింది. చిచ్చికొట్టింది. చాలా సేపటిగ్గానీ నారాయణరావు నిద్రపో లేదు. పాత గుడ్డొకటి నంటినిండా కప్పింది. అన్నం వండు కొందామని బియ్యం బుట్టదగ్గరకెళ్ళింది. దోసెడు బియ్య మున్నాయి. గూట్లో చెయ్యిపెట్టి చూచింది. నారాయణరావు రబ్బరు బూర, నాలుగు రూపాయల మూడణాల చిల్లర చేతికొచ్చాయి. ఈ కాసిని డబ్బులు అయిపోతే సుందరమ్మ చచ్చిపోవటానిగ్గూడా వీలుండదు పనిలో పనిగా, బియ్యంతో బాటు, పెసలు, అల్లం ముక్కలు, నూనెగూడా తెచ్చు కొంటే తీరిపోతుందనుకొని, గదికి గొళ్ళెం బెట్టింది. ''కుర్రాడు లేస్తాడేమో రాఘవమ్మ, పిన్నీ! కాస్తా చూస్తుండు. నేను కొట్టుదగ్గరి కెళ్ళొస్తాను'' అని ఇంటివారితో చెప్పి బయలు దేరింది సుందరమ్మ.

మొదట్లో ఈ గొడవలు పడటం సరిగ్గా చేతకాలేదు సుందరమ్మకు. ఏడుగంటలకల్లా అట్లుపోసి అచ్చమ్మకిస్తుంది. కందిపచ్చడో, అల్లప్పచ్చడో, కారప్పొడో అట్లలోకి ఇస్తుంది. ఇదివరకు అచ్చమ్మ ఉత్తఅట్లనే అమ్మేది. ఇప్పుడు పచ్చడి గూడా తోడుకావటం మూలాన్ని అమ్మకం బాగా పెరిగి పోయింది. రోజుకు అయిదారు రూపాయలు మొదలు, ఎనిమిది — ఎనిమిదిన్నర దాకా ఉంటున్నది. ఖర్చులన్నీ

పోను రెండు రూపాయలు సుందరమ్మకు మిగులుతున్నాయి. రూపాయడబ్బులకు చావులేకుండా అచ్చమ్మగూడా వెనకేస్తున్నది. అచ్చమ్మ నలాపంపి గిన్నెలు, చెంబులు తోముకొనే సరికి నారాయణరావు లేస్తాడు. వాడికి ముఖం కడిగి, నాలుగట్లు పెట్టి, తలదువ్వి బడికి పంపేటప్పటికి — ఎంతకాదన్నా — ఎనిమిదీ — ఎనిమిదిన్నర వుతుంది. అప్పటినుండీ పది గంటలదాకా వంట, తను భోజనం చెయ్యటమూ సరిపోతుంది. పదకొండు గంటలకు నారాయణరావు బళ్లోనుండి వస్తాడు. వాడికి నీళ్లుపోసి అన్నం బెడుతుంది. ఉదయం అక్షరాలు గోడను ఆనుకొని కొడుకు దిద్దుతుంటే, రేపటికి కావలసిన అట్లకుగాను, పెసలు బాగుచేసుకోవటమో, పప్పు విసరటమో, మరేదో పనితో మూడు గంటలదాకా సరిపోతుంది. నారాయణరావుకి మళ్ళీ అన్నంబెట్టి తలదువ్వి బళ్లోకి పంపాలి. అవలా అవంగానే పప్పు నానబోసుకోవాలి. పొట్టు కడుక్కోవాలి... లేదా ఇంటివారి పిల్లలకు తల దువ్వటమో, మరొకటో ... 5½ గంటలకు నారాయణరా వస్తాడు. కాసేపు వాడి ఆటలు చూస్తూ గడిపివేస్తుంది. తిరిగి ఇద్దరికీ, స్నానాలు, భోజనాలు, గంటసేపు కుర్రాడికి కొత్త అక్షరాలు నేర్పటము, పాతవి దిద్దించటమూనూ ఎనిమిదింటికల్లా కొడుకును పక్కలో వేసుకొని పడుకొంటుంది. తెల్లవారుజామున లేవటం, ... అట్లు పోయటం ... అచ్చమ్మ కివ్వటం ...

చెప్పుకోదగ్గ మార్పు లేమీ లేకుండా ఒక సంవత్సరం గడిచిపోయింది. అచ్చమ్మ గూడా పదిరాళ్లు వెనకేసు

కొన్నది. సుందరమ్మ వగ్గర ఎంత హీనంగా చూసినా నాలుగు వంద లున్నాయి. ఆమధ్య పురుషోత్తం ఒకటి రెండుసార్లు వూళ్ళోకి వచ్చాడని ఎవరో అన్నారు. నిజమేనేమోకాని వస్తే తనింటికి రాకుండా పోతాడా? అలాపోగలడా? ఏమో? ఎందుకు పోగూడదూ? ఒక్క మానవజాతికి తప్ప, మిగతా సకల జీవకోటికీ నియమ నిబంధన లున్నాయి. అవి ఎప్పుడు ఏవిధంగా ప్రవర్తించేదీ చూచాయగా చెప్పవచ్చు. కానీ మానవుని విషయంలో అలాకాదు. ఏ క్షణాన అతడేమి చేసినా చేయవచ్చు. ఏమి మాట్లాడినా మాట్లాడవచ్చు. అతి ఏవిధ ముగా ప్రవర్తించగలడని గిరిగీసి చెప్పగల సాధనమేదీ — ఇంకా కనిపెట్టబడ లేదు.

నారాయణరావు చకచకా చదువు సాగిస్తున్నాడు. గుణింతము, ఒక్కట్లు, తెలుగు నెలల పేర్లు, నక్షత్రాల పేర్లు, 60 సంవత్సరాల పేర్లూ కంఠతా వచ్చు. కొద్దిరోజుల్లో పుస్తకం ప్రారంభించాలన్నాడు మేష్టారు. ''దస్తూరి సరిగా లేదండీ! రెండు కాపీ పుస్తకాలు కొనం''డని సుందరమ్మకు సలహా యిచ్చాడు. వాడిపుడు తన పేరు రాసుకోగలడు. అమ్మ పేరు, నాన్న పేరు గూడా రాయగలడు. తనకు నోటికొచ్చిన నలభై ఏభై పద్యాలూ సుందరమ్మ కొడుకుకు ప్రతిరోజూ చెబుతుండేది. వాడు హఠాత్తుగా 'పండితుడు' కావాలనీ సుందరమ్మ ఆశయంగాదు; అలా కారని గ్రహించటం గూడా ఆమెకు కష్టంకాదు. తనగూడా కొడుకు చదువులో భాగం

పంచుకొంటున్నానన్న తృప్తి మరొక విధంగా లభిస్తే, సుందరమ్మ ఈ పని చేయటం ఏనాడో మానివేసేది.

ఒకనాడు ఆకస్మికంగా పురుషోత్తం వూడిపడ్డాడు. ఒక క్షణం సుందరమ్మ రిచ్చపడ్డది. కాళ్ళకు నీళ్ళిచ్చింది. వెంట ఉన్న శారదను చంక నెత్తుకుంది.

"అంతా బాగున్నారా అన్నయ్యా!" అన్నది. సుందరమ్మ.

"ఆ. అదే బాగు నా బొంద బాగు ... కాసిని మంచి నీళ్ళివ్వమ్మా! నారిగాడేడీ?"

"బళ్ళో కెళ్ళాడు. వచ్చే వేళయింది. ఇదిగో ... ఏమే శారదా! ఇంత చిక్కిపోయావేం, కాలిమీద పుండేమిటే?"

"ఎదు|రాయి కొట్టుకొన్నది. ... ఈ ప్రయాణంతో ప్రాణం విసిగిపోయిందే సుందరం. ఇది నడిచేదీగాదాయె; ఎత్తుకొనేదీ కాదాయె. నా దుంప దెగిపోయిందనుకో...మరి నీ వెలా ఉన్నావు. ఏమిటి కథ?" అన్నాడు అన్నగారు.

తన విషయమేమీ అన్నగారికి తెలియదని సుందరమ్మ అనుకోలేకపోయింది. ఏదో తేల్చి చెప్పేసింది.

"అమ్మా! ఈ రోజుల్లో ఒకడికి బాకీ పెట్టడమంత ఛండాలప్పని మరొకటి లేదనుకో. ఇంకో పదిరోజులు ఆగినట్టయితే, నీ సొమ్ము నూపాయకు బేడ లొచ్చేది. యముడు లాగా వెంటబడితేగానీ ఇచ్చాడుగాదు. ఇదిగో నీ సొమ్ము.

వడ్డీ ఇవ్వలేనన్నాడు. ఖర్చులకు మట్టుకు నాలుగు రూపాయ లిచ్చాడు. ఈ డబ్బు నీ యిష్టంవచ్చిన చోట దాచుకో. దీనివల్ల బోలెడన్ని మనస్పర్థ లొచ్చాయి. డబ్బు ఇంత పాపిష్టిదని నేనిదివర కెరుగను'' అన్నాడు. పురుషోత్తం వెనక నుండి తననెవరో తరుముతున్నట్లు ఆయన మాటల్లో సుందరమ్మ కెందుకో బోలుతనం కనుపించింది.

"వదినె ఎట్లా ఉందన్నయ్యా?"

"దానికేం? వాయువా? నిక్షేపంగా ఉంది. కాక పోతే, మొన్ననే ఏదో సుస్తీ చేసిందనుకో. అదంత లెక్క లోదిగాదు. అయ్యో! నా తెలివి మండిపోనూ, అసలు సంగతే చెప్పలేదు. సుందరం! గోలుసు నీ మూటలో ఉన్నందుకు నలుగురూ నానా మాటలన్నారా? అదెవరు పెట్టారనుకొన్నావ్?

"నేనేమీ అనుకోలేదు" అన్నది సుందరమ్మ.

"మీ వదినే చేసింది. తరువాత నాకా సంగతి తెలిసి, దాన్ని చచ్చేట్లు కొట్టాను. సుందరం! నిన్ను చూడకుండా ఇంతకాలం ఉండటానికి కారణం. నాకు ముఖం చెల్లలేదు. ఒకటి రెండుసార్లు ఈ వూరు వచ్చాను గూడాను. అయితే మనస్సు మహా బాధపెట్టింది. అదీగాక నీ డబ్బొకటి నేను మింగేశానన్న గోలొకటి ఉండె. రాలేకపోయాను. ఇంతకాలం కాపరం చేశానన్న మాటేగాని అది "ఇటువంటిదీ" అని నేనర్థం చేసుకోలేను. అసలు దాని వంశమంతా అటువంటివేగదూ? ఆ తరువాత — నువ్వు

నమ్మా నమ్మకపో సుందరం పది పదిహేను రోజులపాటు అన్నం సహించలేదు...''

సమాధానంగా సుందరమ్మ ఏదో అనబోతున్నది. ''అమ్మా!'' అంటూ నారాయణరావొచ్చాడు.

''ఏమిరోయ్ బాగున్నావా?'' అన్నాడు పురుషోత్తం నారాయణరావును దగ్గరికు లాక్కొంటూ, నారాయణరావు చెయ్యి వదిలించుకుని లాక్కున్నాడు. ''పో నన్నొదిలి పెట్ట''మని గింజుకున్నాడు.

''పో నాన్నా! మన మామయ్యేగదూ'' అని సుందరమ్మ నచ్చచెప్పింది.

ఆ క్షణాన తల్లి మాటల్లోగూడా వాడికి విశ్వాసం కుదరలేదు. పురుషోత్తాన్ని మామయ్యగా నారాయణరావు గుర్తించ నిరాకరించాడు. లాక్కుని తల్లి దగ్గరి కెళ్లాడు.

''ఏమోయ్! మొగాడివయ్యావే'' అన్నాడు పురుషోత్తం.

''మరో నాలుగేళ్లు పోతే నీ కూతురికి మొగుణ్ణవుతానురా నారాయణా'' అన్నది తల్లి—పురుషోత్తం నవ్వాడు. సుందరమ్మ నవ్వింది. విస్ఫారణంగా శారదగూడా నవ్వింది. ఒక్క నారాయణరావే నవ్వలేదు.

రెండు మూడు రోజులుండి పురుషోత్తం వెళ్ళిపోయాడు. నారాయణరావుకు లాగు, చొక్కా కుట్టించాడు. సుందరమ్మకు ఒక చీర తెచ్చిపెట్టాడు. సుందరమ్మ శారద

కోక గాను కుట్టించింది. నారాయణరావు నెమిలి ఈకెలు, సిగరెట్టు పెట్టెలు, తగరము, రంగు బలపమూ శారదకు హృదయపూర్వకంగా ఇచ్చాడు. శారద నచ్చినంత 'ఇదిగా' పురుషోత్తం వాడికి నచ్చలేదు. దానికి కారణం వాడికిగూడా తెలిసి ఉండదు.

ఇప్పుడు సుందరమ్మ దగ్గర దాదాపు వెయ్యిరూపాయల వరకూ ఉన్నాయి. వెయ్యి రూపాయలకంటే మాటలు గాదు. హీనంగా రెండెకరాల పొలం వస్తుంది. నలభై సవర్ల బంగారం వస్తుంది. అయితే ఆ డబ్బును సుందరమ్మ దేని క్రిందా వినియోగించలేదు. పొలాలు పుట్రలు కొనటం తన తాహతుకు మించిన పని, బంగారం కొనటంగూడా అంత మంచిదిగాదు. వీటన్నిటివల్లా తనదగ్గర ఎంత డబ్బున్నది నలుగురికీ తెలిసిపోతుంది. తెలిసినందువల్ల లాభమున్నా, నష్టమున్నా నలుగురకూ ఎందుకు తెలియాలి?

అచ్చమ్మ నాలుగైదు రోజులు అట్లకోసం రాలేదు. ఎందుకోనని కొడుకుని పంపింది. జ్వరపడ్డదట. ఒకరోజు మునిమాపువేళ కొడుకును వెంటబెట్టుకొని వెళ్ళింది. ఇద్దరు కొడుకులూ వచ్చారు అప్పటికే. ఇక తాను బతకనని అచ్చమ్మ శోకాలు పెట్టింది. సుందరమ్మ ఫరవాలేదన్నది. తప్పకుండా నయమవుతుందన్నది. రెండో రోజున ఎవరో చెప్పారు, అచ్చమ్మ కొడుకులవెంట వెళ్ళిపోయిందట.

మళ్లీ తన జీవనసమస్య ఎదురైంది. అయితే ఇది వరకు దాని రూపం వేరు; ఇప్పటిదాని దారి వేరు. అదెంత

భయంకరంగా ఉన్నదో ఇదంత సౌమ్యంగా ఉన్నది. రోజులు గడవ్వకే భయంలేని మాట నిజమే! కూర్చునీ ఎంతకాలం తినటం? తింటే ఎంతకాల మీ డబ్బు వస్తుంది? పోనీ తనే స్వయంగా ఒక కొట్టులాంటిది పెట్టుకొందా మన్నది సుందరమ్మ. కానీ అదంతగా నచ్చలేదు. అదీగాక ఎవరో మద్రాసు సైడువాళ్లు వచ్చి హోటలు పెడుతున్నారట. ఇడ్లీలు, కాఫీలు గూడా చేస్తున్నారట. ఇటువంటి సమయంలో తన అట్లు ఎవరికొక్కావాలి?

# 5

ఈ సందర్భంలో రాజయ్య ఇచ్చిన సూచన అమోఘంగా ఉన్నది సుందరమ్మకు. ఇది నెరవేరాలేగానీ, అంతకన్నా తను కోరతగిన దేమున్నదీ? ఉచ్చనీచాల ప్రసక్తి తనిప్పుడు తీసుకురావటం కూడనిపని. పోవలసిన గౌరవం ఏనాడో పోయింది. ఇవ్వాళ క్రొత్తగా పోవడానికి—ఆ మాటకొస్తే—గౌరవమంటూ ఏమున్నది? పెసరట్లు అమ్ముకొని జీవించడం మంచి పని అయి, అన్నం అమ్ముకోవడం చెడ్డపని అవుతుందా? గౌరవా గౌరవాల విషయం మాసుకొన్నా, తనిప్పుడు పొందుతున్న అగౌరవ మేమీ లేదు. బంధువర్గం రాకపోకలు మానేసి చాలాకాలమైంది. ఉన్న ఒక్క అన్నగారూ అట్ల బేరమప్పుడు వచ్చి భోజనం హోటలప్పుడు మానడు. మానివేసినా తన కొచ్చిన నష్టమేమీ లేదు. సాటి కులస్థులు ఇదివరకే తనతో మాట్లాడటం

మానివేశారు. తనకు అడ్డిపోయిం దేమీ లేదు. అట్ల వ్యాపారం పునరుద్ధరించడమంటూ ఇక జరగదు. నిర్వ్యాపారంగా కూర్చుని, ఉన్నవి కరిగించుకు తినడంకంటే రాయికి మరొక రాయి తోడు చేయటం మంచిదే! ఆ కాస్తంత వాడు పెరిగి 'ఇంత' ప్రయోజకుడైతే తన కష్టాలన్నీ తీరిపోతాయి. అప్పుడు విధిగా అందరూ తన చుట్టూ చేరతారు. సందేహం లేదు. చేతిలో చిల్లిగవ్వ లేనినాడు తోబుట్టువుగూడా నిరసనగా చూశాడు. కాస్త పచ్చి ఉన్నట్టు పసిగట్టి ఏ విధంగా ఉంటున్నదీ తనకు తెలుసు. అయినా సాటివారు తన నే మాత్రం ఆదరించారు? తను దిక్కు లేకుండా ఉన్నరోజులలో ఒక్కరైనా తన క్షేమసమాచారాన్ని కనుక్కొన్నారా? సాటి ఆడదని దయ తలిచారా? లేనప్పు డాత నెందుకు వారిని చూసి...

రాజయ్య ఏ బుద్ధిని ఉన్నాడోగానీ, ఈ సహాయం సుందరమ్మకు చేయటానికి అభ్యంతరమూ లేదన్నాడు. మరొకరు ఈ ప్రయత్నంలోకి దిగకముందే ముందుగా అన్ని ఏర్పాట్లూ గప్‌చిప్‌గా చేసివేయాలన్నాడు.

"ఏమిటండీ సుందరమ్మగారూ! చులాగ్గా రోజుకు పది పదిహేనుమంది కుర్రాళ్లు భోంచేస్తారు. అసలు ఈ హైస్కూలు ప్రయత్నం నాలుగైదేళ్ళనుండి నలుగుతానే వుంది. తలలు గుదరక ఒక దారికి రాలేదు. మరొక సంగతండోయ్ సుందరమ్మగారూ! హైస్కూలు సెక్రటరీ మావాడే! మూడువేలు చందా ఇచ్చాను. వాడితో ఇట్లా

ఇట్లా సంగతని చెబుతాను: అంతా రైటుచేసిపారేస్తాడు. మీరుగూడా ఆలోచించుకోండి'' అన్నాడు రాజయ్య.

రాజయ్య అబద్ధం చెప్పడని, సుందరమ్మకు తెలుసు. వానైనా వరదైనా ప్రతిరోజూ తనింటికొచ్చి అట్లు తినిపోతుంటాడు. ఎప్పుడు కావాలంటే అప్పుడు డబ్బిస్తాడు. అతను వూళ్లో పలుకుబడి ఉన్నవాడనిగూడా సుందరమ్మ విన్నది. తనకు చేయూత నిస్తా నంటున్నాడు. కాదనటం వివేక మనిపించుకొంటుందా?

"ఏదో అనుకోవటమేగానీ, అనుకొన్నంత జరుగుతుం దంటావా రాజయ్యా?"

"ఎందుకు జరగదండీ?" అన్నాడు రాజయ్య "ఈ చుట్టుప్రక్కల ఏడెనిమిది గ్రామాల్లో హైస్కూలంటూ లేదు. బాగా ఉన్నవాళ్లు పిల్లల్ని బస్తీలకు పంపుతున్నారు. మధ్య రకం మానేస్తున్నారు. ఇప్పటికప్పుడే బోలెడంతమంది పిల్లలు చేరతామంటున్నారు. నా మాట వినండి సుందరమ్మగారూ? ఫరవాలేదు."

"ఈ ఇల్లు ఎటుగూడా చాలదు. వూళ్లో నాకెవ్వరూ తెలియదు. హోటలంటే — కాస్త పెద్దకొంప ఉండాలి. వ్యాపారానికి అనువుగానూ ఉండాలి. అటువంటి ఇల్లు దొరకమంటే మనకు దొరుకుతుందా రాజయ్యా?" అన్నది సుందరమ్మ.

రాజయ్య కెందుకో నవ్వొచ్చింది.

"ఇల్లు దేముందిలెండి, నేను చూస్తాను. అంత అవసర మయితే, మా రెండో ఇల్లు అంతదాకా వాడుకొంటుండండి. బజారుతల కొంప. పదిమంది వచ్చేపోయే దోవలోవుంది. మాకు బొత్తిగా పనికిరానిది. కాకపోతే దాంట్లో గింజా గట్రా వేస్తున్నాము. గొడ్లను కట్టేస్తున్నాము. మీరు ఇల్లు చూసుకోండి కావాలంటే ఆ సామానును నా కొట్టంలోకి మార్చిస్తాను" అన్నాడు రాజయ్య.

"అద్దె ఏం పుచ్చుకొంటారు?" అన్నది సుందరమ్మ నవ్వుతూ.

"మీరిచ్చినంత" అన్నాడు రాజయ్య. అతను అప్ర యత్నంగా నవ్వాడు.

రాజయ్య ఈ సందర్భంలో కుడి భుజంగా ఆదుకోక పోతే, సుందరమ్మ ప్రయత్నాలు గుంట పూలు పూయవల సిందే! రాజయ్య తన సామానంతా కొట్టంలోకి మార్పిం చాడు. రెండు రోజులపాటు జీతగాళ్లతో ఇల్లంతా బాగు చేయించాడు, అవసరమైనచోట్ల పనులు కట్టించాడు. నాలుగు తుమ్మలు నరికించి పెళ్లు వేయించాడు. కనీసం వీటికైనా డబ్బు తీసుకోమని సుందరమ్మ పట్టుబట్టింది. రాజయ్య ఒప్పుకోలేదు. తనవంటి స్థితిపరుడు ఒక దిక్కు లేనిదానికి నాలుగు తుమ్మలిచ్చి డబ్బు పుచ్చుకొంటే నలుగురూ కాండ్రించి ఊస్తారన్నాడు.

"రేపు నేను బస్తీకి పోతున్నాను. సరుకేమన్నా కావాలంటే — ఏమేమీ కావాలో చెప్పండి. ఒక్కసారే

కొని పట్టుకొస్తే తీరిపోతుంది. చిల్లరగా కొనటం మహా దండుగ'' అన్నాడు రాజయ్య.

''నిజమే'' అన్నది సుందరమ్మ.

''ముఖ్యంగా రెండు కాగులు కావాలి. ఒక పెద్ద గంగాళము, ఒక చిన్నదీ కావాలి. చిన్నవి పెద్దవి కలిపి ఏడెనిమిది గిన్నెలు కావాలి. పోతే — కూరలు సెట్ ఒకటి అవసరం. చిన్న ఇనుప మూకుడొకటి. రెండు గంటెలు, తంబాళాలు మూడు. బియ్యం రెండు బస్తాలు. చింతపండు రెండు మణుగులు. మిరపకాయలు అక్కర్లేదు...''

''ఎందుకని?'' అన్నది సుందరమ్మ.

''మా ఇంట్లో మూడు బోరీల కాయలున్నాయి. కావాలంటే అవన్నీ వాడుకోవచ్చు...''

ఇట్లా పెరిగి, అట్లా పెరిగి జాబితా నాలుగువందల పైచిలుకుదాకా డేకింది.

''అమ్మయో! నాలుగు వందలే'' అన్నది సుందరమ్మ.

''కాస్త ఘనంగానే ఉండాలండీ! ఈసురోమంటూ హోటలుంటే, బేరంగూడా ఈసురోమంటూనే ఉంటుంది... కావాలంటే వడ్డీ లేకుండా నేనిస్తాను ... నెమ్మదిగా తీర్చుకోండి'' అన్నాడాయన.

సుందరమ్మ ఏమీ మాట్లాడలేదు. ట్రంకు పెట్టెలోనుంచి నాలుగు వందరూపాయల కాగితాలూ తెచ్చి రాజయ్యకిచ్చింది.

"లేవన్నారేం?" అన్నాడు రాజయ్యా నోట్లు అందుకొని.

"ఎప్పుడన్నాను రాజయ్యా!"

నిజమే! సుందరమ్మ డబ్బు లేదనలేదు. మాటల సందడిలో రాజయ్యా బస్తీకి పోతున్నాడని నారాయణరావు విన్నాడు.

"అమ్మా! నేనుగూడా పోతానే?" అన్నాడు.

"ఎక్కడికిరా!" అన్నది సుందరమ్మ.

"బస్తీకి పోతాను. అక్కడ కార్లు రైళ్లు ఉంటాయట నే చూస్తాను" అన్నాడు నారాయణరావు.

సుందరమ్మ ఆశ్చర్యపోయింది. కొడుకు పోతానన్నది ఆడుకోవటాని కనుకొన్నది గానీ, బస్తీకని ఆమె ఊహించనన్నా ఊహించలేదు. కొన్ని క్షణాలపాటు కొడుకువేపు రెప్ప వాల్చకుండా చూసింది. వాడప్పుడే తన 'గిరి' నుండి దాటిపోతున్నట్లుగా ఆమె కనిపించింది.

"ఛా, వద్దమ్మా! బస్తీలోని పిల్లల్నెత్తుకొనే దొంగలుంటారు. వాళ్లు నిన్నెత్తుకుపోతారు."

"రాజయ్యా ఉంటాడుగా! నాకేం భయం!"

"రాజయ్యా ఉన్నా ఎత్తుకెడుతారు."

"అమ్మా" అని మెల్లగా అడిగాడు నారాయణరావు. "మరి బస్తీల్లో చిన్నపిల్లలు ఉండరంటే."

"ఓ, చాలామంది ఉంటారు."

"వాళ్లను ఎత్తుకపోరుగానీ, నన్నెత్తుకుపోతారా దొంగలు..."

సుందరమ్మ ఫకాలున నవ్వింది. ఆదరంతో దగ్గరికి తీసుకొని "దొంగ వెధవ! అన్నీ ఆరాలు తీస్తున్నావా, ఆరాలు" అని మృదువుగా బుగ్గలు మెలిపెట్టింది. నారాయణరావు ముద్దులు కుడుస్తూ, కాళ్లతో చిందులు తొక్కుతూ చేతుల్తో తల్లిభుజాలమీద దరువువేస్తూ, "వూ! నే నొప్పుకోను. నేను పోవాల్సిందే! నేను ఉండను. ఉండను. పోవాల్సిందే" అంటున్నాడు.

ఇంతసేపూ మెదలకుండా కూచున్న రాజయ్య "అలానే బాబూ! నేను తీసుకెళ్లుతాలే!" అని భరవాసా ఇచ్చాడు.

కానీ నారాయణరావు ఆ మాటలు నమ్మలేదు.

"అన్నీ దొంగమాటలు. నన్ను తీసుకెళ్లవు" అని గునుస్తూనే ఉన్నాడు.

ఎన్నో వాగ్దానాలు చేసిన తరువాతగానీ వాడి ఆత్మ శాంతించలేదు. అయినా ఏదో ఒకమూల ఈ అనుమానం వాణ్ణి వేధిస్తూనే ఉన్నది గావున, ప్రతి పావుగంటకూ తన వాగ్దానాల విషయం మననం చేస్తుండేవాడు.

* * *

సాయంత్రానికే రావలసిన రాజయ్య టౌనునుండి రాలేదు. తెల్లవారి పన్నెండింటికి బండి వచ్చి యింటిముం

దాగింది. జీతగాడు పగ్గాలు పట్టుకొని ముందున్నాడు. తోట్లో రాజయ్య చుట్టకాలుస్తూ కూచున్నాడు. నారాయణ రావు ఏదో నములుతున్నాడు. తల్లిని చూడగానే వాడి ఉత్సాహం కట్టలు తెంచుకొన్నది. ఒక పీకెతీసి వూదాడు. అది గుమ్మడికాయంత లావైంది. నోట్లోంచి తీశాడు. 'బుయ్' మని ఈలవేసింది. నారాయణరావును ముందుగా బండి దింపాడు రాజయ్య. జీతగా డందుకొన్నాడు. ఒక్క పరుగులో వెళ్ళి తల్లిని కౌగలించుకున్నాడు నారాయణ రావు, ముఖం వాడిపోయింది. జుట్టు ముందుకు జారి, చెమట వల్ల ముఖానికి అంటుకుపోయింది. ఆప్యాయంగా జుట్టు సర్దింది.

"అమ్మా! ఇవిగో నాకు బూట్లు" అన్నాడు నారాయణరావు సంతోషంగా కాళ్ళ వేపు చూస్తూ.

"ఎక్కడివిరా?"

"రాజయ్య కొనిపెట్టాడు. ఇంకా ఇదిగో బొమ్మ గడియారం! ఆహా. అట్టా పట్టుకోవద్దే చెడిపోద్ది. ఇది తిప్పితే ముల్లు తిరుగుతాయి. ఇదుగో చూశావా... ఇప్పుడు రెండు మూడు అయిందా చూడు. అదిగో ఏడు ఎనిమిది ఐంది... మంగేమో, నాకేమో, బారులాగు, బొరుచొక్కా ఉన్నయ్యిగా..."

"ఈ బస్తాలు ఎక్కడెయ్యమంటారండీ?" అన్నాడు జీతగాడు.

కొడుకు ధోరణిలోపడి సుందరమ్మ వాళ్ళనే మరచిపోయింది. చప్పున తేరుకొని, "నా తెలివి కాలిపోను ... ఉండు నాయనా వస్తాను. ఇక్కడ వెయ్యి. ఆ గంగాళాలు" గిన్నెలూ లోపల పెట్టు.

"లోపలి కెట్టా ఎల్లేదండీ సుందరమ్మగారూ!" అన్నాడు జీతగాడు.

"ఫరవాలేదులే వెళ్ళవోయ్! నిన్నటిదాకా మీరు తిరిగిందికాదూ ఈ ఇల్లంతా!" అన్నది సుందరమ్మ.

సామానంతా అడ్డదిడ్డంగా పడిఉన్నది. దాన్ని సర్దుకోవాలి. ఈలోపుగా సుందరమ్మ కొడుక్కు నీళ్లు పోసింది. స్నానం చేస్తున్నా, అన్నం తింటున్నా నారాయణరావు టూను చిత్రాలు చెబుతూనే ఉన్నాడు. వాడి లేతముఖంలో ఆశ్చర్యము, ఆనందము, జుగుప్స చాలా చిత్రంగా ప్రతిఫలించాయి. కంచం కడగడానికి బైటికొచ్చిన సుందరమ్మకు రాజయ్య బావిదగ్గర కనుపించాడు.

"కొడుకు అన్నం తిన్నాడా?" అన్నా డతను.

"ఆ. నువ్వాక్కడ నుంచున్నా వేం రాజయ్యా!" అన్నది సుందరమ్మ.

"దాసీది నీళ్లు కాచలేదు. రాననుకొని కూడుకూడా వండలేదు. ఏమిటోలెండి సుందరమ్మగారూ! ఎంతపొలం ఉంటే, ఎంత డబ్బుంటేం, ఆడదిక్కులేని కొంప, ఆడదిక్కులేని కొంపే!" అతని కంఠంలో దైన్యం తొణికిసలాడింది.

"ఉండండి. వేడినీళ్ళున్నాయేమో చూస్తాను! అని చూసొచ్చి" ఇలా రా రాజయ్యా! తలంటి పోసుకొందామని కాగబెట్టాను. కాగు పట్టుకెళ్ళు" అన్నది.

"ఎందుకులెండి. ఒకనాటిదా ఈ జాతర" అన్నాడు రాజయ్య.

"ఫరవాలేదులే రాజయ్యా! అన్నంకూడా వుంది. వచ్చి స్నానంచెయ్యి. అన్నం వడ్డిస్తాను."

రాజయ్య సమాధానానికి ఎదురుచూడకుండా, సుందరమ్మ లోపలికెళ్ళిపోయింది. రాజయ్య ఒక్క నిమిషం తటపటాయించి అక్కడనుండి కదిలాడు.



## 6

అనుకొన్నంత ఆర్భాటమేమీ లేదు. హైస్కూలు తెరిచారు. బిలబల్లాడుతూ పిల్లలు, ఉపాధ్యాయులు కొత్త బడిలోకి పోతున్నారు; వస్తున్నారు. స్టాండర్డు తక్కువైనా, నారాయణరావును ఫస్టుఫారంలో చేర్పించాడు రాజయ్య. కొన్ని రోజులపాటు నలుగురైదుగురు ఉపాధ్యాయులు కూడా సుందరమ్మ హోటల్లో భోంచేశారు. తమ తమ కుటుంబాలు తెచ్చుకొన్న తరువాత మానివేశారు. పొరుగూరునుండి చాలామంది పిల్లలు బళ్ళోకి వస్తున్నారు. వారందరూ హోటల్లో తినడంలేదు. దగ్గర వూళ్ళ పిల్లలు ఉదయమే తిని వస్తున్నారు. సాయంత్రంలోగా, ఏదో చిరుతిండి కొనుక్కొని మాపటివేళకు ఇళ్ళకు పోతున్నారు. మరి

కొందరు గిన్నెలలోనూ, టిఫెన్ క్యారియర్లలోనూ అన్నం తెచ్చుకొంటున్నారు. కేవలం హోటలు తిండి తినేవాళ్లు పట్టుమని పాతికమందయినా లేరు. వీరితోనూ మధ్యాహ్నం పూట మాత్రమే తిని, సాయంత్రం ఇళ్ళకెళ్ళేవారు ఆరుగురు దాకా వున్నారు. నికరంగా భోంచేసేవారు ఎంత లెక్కించినా పందొమ్మిదిని దాటరు. వ్యాపారరీత్యా, ఇది తక్కువ సంఖ్య కానీ, ఆ వూళ్ళో అంతకన్న ఎక్కువ వ్యాపారం చేసేవారెవ్వరు?

ఒక్క నెలరోజులపాటు సుందరమ్మ కొడుకు చేత లెక్క రాయించింది. అయిన ఖర్చులు, తమ చాకిరీకూడా కలుపుకొని—పోను, ఇరవై ఐదుగురు పిల్లలమీద నూటపదిహేను రూపాయలు మిగిలాయి.

ఈ లాభాని కింకా కలపవలసిన పద్దులు కొన్ని వున్నాయి. తన భోజనం, కొడుకు భోజనం జమవేయించాలి. ఇటీవల రాజయ్యకూడా ఇక్కడే తింటున్నాడు. అయినా ఇది లాభం క్రిందికి రాదు. అతనేవేవో పనులు చేసిపెడుతున్నాడు. తను ఇంత అన్నం పెడుతున్నది. దానికీ దానికీ చెల్లు. ఈ వ్యాపారం ఇకముందు పెరగదనే నమ్మకం లేదు. హైస్కూల్లో కొత్తక్లాసులు పెడుతున్నారట. పెడితే మరికొంతమంది పిల్లలు ఎట్లాగూ వస్తారు. అందులో కొందరు తిన్నాచాలు. అసలు అభివృద్ధి అనేదే లేకుండా, ఇలా సాగినా సంవత్సరానికి రమారమి పద్నాలుగొందలు మిగులుతాయి. పద్నాలు గొందలంటే — కాస్త సుమారైన

పొలం — రెండెకరా లన్నమాట. ఈ సంవత్సరాంతానికి పద్నాలుగొందలు, ఆ రాజయ్య చేతిలో పెడితే, అతనే ఎక్కడన్నా కొనిపెడతాడు. తను ముసలిదయ్యేసరికి, వాడి కింత ఆధారం చూపెడితే - అంతకన్నా తనకు కావలసింది లేదు ...

*　　*　　*

"అమ్మా !"

సుందరమ్మ వెనక్కి తిరిగి చూసింది. నారాయణరావు ముఖం విచారాన్ని వెలిగ్రక్కుతున్నది. బూట్లు వాకిట్లో విడిచి, పుస్తకాలు, విసిరి దూరంగాపారేసి, తల్లిని కౌగలించుకొని బోరుమని ఏడ్చాడు.

సుందరమ్మ కేమీ అర్థం కాలేదు. కానీ కొడుకు ఏడుస్తుంటే ఆమెకూ ఏడుపొచ్చింది.

"ఏమిటి నాన్నా !" అన్నదామె కాస్సేపుండి.

"నువ్వీ 'హోటలు' మానియమ్మా !" అన్నాడు నారాయణరావు ఏడుస్తూనే.

"ఏం నాయనా ! ఎందుకూ !"

"ఈ పని పాడుదటగా అమ్మా !"

"ఎవరన్నార్రా !"

"ఇందాక కుర్రాళ్ళందరూ నన్ను గేలిచేసి ఒకటే నవ్వటం ... నవ్వారమ్మా ! 'ఓరీ — వీడా హోటలుదాని కొడుకురా !' — 'అందుకే దుక్కలాగా ఉన్నాడ్రా !' —

'ఎంగిలి మెతుకులు ఏరుకుతినే రకంరా' — 'కరుస్తాడోయ్ జాగ్రత్త' ఇట్లా అన్నారు. నాతల బద్దలయిపోయింది, ప్రాణం చచ్చిపోయింది. నువ్వీ పని మానెయ్యవే!" అన్నాడు నారాయణరావు.

సుందరమ్మ ఈ సంగతులన్నీ రాజయ్యతో చెప్పింది.

"పసివాణ్ణి అలా అనటం తప్పుకాదూ రాజయ్యా! ఆ వెధవ లెవరో కాస్త కనుక్కొని బుద్ధిచెప్పు. ఎవరో అల్లాటప్పా మనుషులనుకొన్నారేమో! జాగ్రత్తని చెప్పు."

"సరేనండీ! అలానే కనుక్కొంటాను. రేపు అబ్బాయితో కూడా నేనూ వెడతాను. వాళ్ళెవరో చూసి. చర్మం వొలిపించేస్తాను" అని భరవాసా ఇచ్చాడు రాజయ్య.

నారాయణరావు హృదయం కొంత శాంతించింది.

  

రాజయ్య వాళ్ళెవరో చూడనూలేదు; చర్మం వలిపించనూ లేదు. ఒకవేళ పంతుళ్ళతో చెప్పాడేమో మరి. మళ్లీ ఆ పిల్లలు నారాయణరావును ఆవిధంగా ఎప్పుడూ ఉడికించలేదు. అతను యథాప్రకారం స్కూలుకు వెళ్లుతున్నాడు.

ఒకరోజు నారాయణరావు స్కూలునుండి రాగానే సుందరమ్మ ఒకకార్డు చేతికిచ్చి, "చదవరా నాయనా!" అన్నది.

నారాయణరావు పైకి చదవలేదు. లోలోపల గొణుగు కొని "మామయ్య రాశాడమ్మా? అత్తకు జబ్బుగా ఉన్న దట" అన్నాడు.

"కార్డుకు రెండువైపులా రాసివున్నదంతా ఈ రెండు మాటలేనట్రా!" అన్నది.

"కాదు" అన్నాడు నారాయణరావు.

"పూర్తిగా చదవరా! వింటాను.

"సరే"

"చిరంజీవి నారాయణరావును దీవించి మీ మామ పురుషోత్తం వ్రాయునది ఏమనగా:—

"రెండు వారములనుండి మీ అత్తకు జబ్బుగా ఉంటు న్నది. బొత్తిగా లేవలేకపోతున్నది. చంటివాడు పాలకు ఏడుస్తున్నాడు. పిల్లలిద్దరూ అట్లాగే వుడక వేసి పెడుతున్నారు. మందులకు, మాకులకు చాలాడబ్బు కావలసియుండును గనుక, ఈ ఉత్తరం చూసిన తక్షణమే, మీ అమ్మకు చూపించ వలెను. ఇంతే సంగతులు. ఏమో వ్రాసినానని భావించవద్దు. ఇదే టెలిగ్రాము అనుకొనవలెను. జరూరు. వెంటనే జవాబు వ్రాయవలెను.

ఇట్లు,

పురుషోత్తం వ్రాలు.

"అయ్యో పాపం! ఎంత ఇబ్బంది పడిపోతున్నాడో ఏమో! వాడి గ్రహచార మేమిటోగానీ, చిన్నప్పట్నుంచి

వాడి కొకటే బాధలు ... నాయనా! నువ్వు స్కూలు కెళ్ళే ప్పుడు కాస్త పోస్టాఫీసుమీదుగా వెళ్ళుతావా?'' అన్నది సుందరమ్మ.

''ఎందుకమ్మా?''

''ఒక యాభై రూపాయ లిస్తాను. మామయ్యకు మనియార్డరు చెయ్యి.''

నారాయణరావు మాట్లాడలేదు. ఎందుకు మాట్లాడ లేదా - అని సుందరమ్మ కొంచెంసేపు ఆలోచించింది. ఆమెకు నచ్చిన కారణ మొక్కటీ కనిపించలేదు. ఒకవేళ డబ్బు పంపటం కుర్రవాడి కిష్టం లేదేమో ననుకొన్నది. దురదృష్ట వశాత్తూ ఇదే నిజమయితే—తను పంపటం మానవలసిందేనా? మానితే అన్న భార్య ఏమవుతుంది? కేవలం తన జాప్యం వల్లనే వదినె దాటిపోతే, ఆ పాపం తను భరించవలసి రాదా? ఆ కసుగాయల గతేమిటి? ఇవన్నీ ఆలోచించుకొనే సరికి సుందరమ్మకు ముచ్చెమటలు పోశాయి. ఏ మాత్రం అవకాశ మున్నా ఆమె వెళ్ళి చూసి వస్తుంది. కానీ ఈ హోటలుతో అన్ని ప్రమాణాలు కట్టుబడిపోయినాయి. ఏమి చూదామన్నా ఇదొక గుదిబండ అయి కూచున్నది.

''మామయ్య చాలా తమాషా అయిన మనిషమ్మా!'' అన్నాడు నారాయణరావు.

''ఏమిట్రా?''

''ఉత్తరం నాకు రాసేవాడయితే స్కూలు అడ్రసుకు రాయగూడదూ? నీకు రాయాలనుకొన్నప్పుడు, ఇంకా నా

పేరుగూడా ఎందుకూ? త్వరగా అన్నంబెట్టి నన్ను పంపించు మళ్ళీ టపా కట్టేసేవేళ అవుతుంది.'' అన్నాడు నారాయణ రావు. సుందరమ్మ కొడుక్కి అన్నంబెట్టి, ఏభై రూపాయలు కాస్త చిల్లరా ఇచ్చి పంపించింది.

నాలుగు రోజులకు రశీదు, మరొక ఉత్తరమూ పురుషోత్తం నుండి వచ్చాయి. ఆ ఉత్తరంలో పెద్ద విశేషాలేమీ లేవు. రామమ్మకు జబ్బు తిరుగుముఖం బట్టిందట. ముఖ్యంగా అర్జంటుగా మాట్లాడవలసి కొన్ని విషయా లున్నాయట. వారం రోజుల్లో వస్తానని వ్రాశాడు.

వ్రాసినట్టుగానే వచ్చాడు. ఈలోపుగా సుందరమ్మ వూహించిన వూహలు చాలా చిత్రమైనవేగాక, ఆశాపూరితమైనవి గూడాను. ఈ ప్రయాణం కేవలం, తన కొడుకు వివాహం గురించి — అంటే — శారద వివాహం గురించి అయివుంటుందని సుందరమ్మ వూహించింది. ఈ వూహకు ఆధారమేమిటో ఆమెకే తెలియదు. ఆమె అంతరాత్మ అలా అనుకోమని ఆమెను ప్రేరేపించి ఉండవచ్చు. అన్నగారు ఎప్పుడు వస్తారా అని సుందరమ్మ ఎదురు చూడసాగింది. ఆమె ఆరాటం ప్రకారం కాలం గూడా మారివుంటే, రోజుకు పదిగంటలకంటే ఏ మాత్రమో తక్కువే వుండి వుండేవి. నారాయణరావు ఆదుర్దా కలగి లేదు? ఆరాటమూ కలగలేదు. తన పనేదో తాను చూచుకుంటున్నాడు.

అనుకొన్న దానికంటే ముందే వచ్చాడు పురుషోత్తం. కానీ సుందరమ్మ లెక్కప్రకారము అది ఆలస్యంగా రావ

టమే అవుతుంది. అల్లంత దూరాన చూడంగానే, సుందరమ్మ కెక్కడలేని ఆలోచనలూ ఒక్కసారి పెల్లురికాయి. రవంత తడబాటుకూడా పడ్డది. చెంగుతో ముఖం తుడుచుకొని, లోపలికెళ్లి కాళ్లు కడుక్కోనేందుకు నీళ్లు, వెండిగ్లాసుతో మంచినీళ్లు తీసుకొచ్చింది. పురుషోత్తం చెప్పులు వసారాలో విడిచి, సంచి గోడవారగా బెట్టి, కాళ్లు కడుక్కొన్నాడు. డ్రాయరుమీద పెట్టివున్న వెండిగ్లా సందుకొని గటగట తాగి, మిగిలిన కాసిసు నీళ్లు చేతిలోకి వొంచుకొని ముఖం తుడుచుకొన్నాడు. ఇల్లు చూడంగానే పురుషోత్తానికి లక్ష్మి తాండవిస్తున్నట్లు అర్థమైంది. సుందరమ్మ పాతిక రూపాయల ఖరీదుచేసే పట్టుచీరె, పట్టురవిక ధరించివుంది. చేతులకు నాలుగేసి బంగారు గాజులున్నాయి. మెళ్లో చంద్రహారము, గోవర్ధనగొలుసూ ఉన్నాయి. ఒక మూలగా నారాయణరావు పాంట్లు చొక్కాలు చాకలి కెదురు చూస్తున్నాయి. వాకిటి ముందు డ్రాయరు, ఒక కుర్చీ, ఇటొక బెంచి, అటొక బెంచి ఉన్నాయి. పసిమసిపి హాలంతా వ్యాడుస్తున్నది. పురుషోత్తం గొప్ప ఆర్థిక శాస్త్రవేత్తగాదు. కానీ ఈ విధమైన ఉదాహరణం ద్వారా ఎదుటివారి సంపత్తిని చూచాయగా అంచనా కట్టగలడు. మేధాసంపత్తి కంటే అపారమైన జీవితానుభవం అతని కీశక్తి నిచ్చింది. "ఈ లెక్కనుబట్టి చూస్తే సుందరమ్మను 'బంగారు పిచ్చుక' అనటానికి సందేహం లేదు" అనుకొన్నాడు పురుషోత్తం.

"అంతా బాగున్నరా అన్నయ్యా!"

"ఆఁ బాగుండకేం తీవరమొచ్చింది! చూడవే సుందరం ... ఇటువంటివారికి చావన్నా తొందరగా రాదు. ఛీ ఛీ నా ప్రాణం కొరుక్కుతింటున్నారు" అని బాధను ప్రకటించినవాడైనాడు.

"ఊరుకో అన్నయ్యా! ఏమిటా మాటలు? కష్టాలు మనుషులగ్గాక మానుల కొస్తాయట్రా? వదినకేం జబ్బు? శకుంతలను గూడా బళ్లో వేశావా? సూర్యం పాలు విడిచి పెట్టాడా?" ఈ రకమైన ప్రశ్నలు కొన్ని డజన్ల మేరకు ఆవి డడిగింది. తన ప్రశ్నలతో ఎదుటివారికి విసుగెత్తుతుందేమో నన్న స్పృహకూడా సుందరమ్మకు రాలేదు. అన్నగారి కుటుంబమంటే ఆవిడకున్న అభిమాన మటువంటిది. పురుషో త్తానికి ఒకవంక విసుగెత్తుతున్నా, ఓపిగ్గా దాన్ని మింగివేశాడు. లేని ఉత్సాహాన్ని తెచ్చుకొని సుందరమ్మకు జవాబులిచ్చాడు. ఈ ఇవ్వటంలో అతను కనబరిచిన నైపుణ్యం అద్భుతమైనది. రామమ్మన్నా, పిల్లలన్నా, ఆ సంసారమన్నా అతని కెంతటి అసహ్యమున్నదో ఆ జవాబుల్లో వ్యక్తపరుస్తానే ఉన్నాడు. ఏదో విధిలేక తప్పితే తనకా సంసారంమీద ఆసక్తే లేదని తేల్చివేశాడు. రామమ్మను తిడుతున్నప్పుడు సుందరమ్మకు రకరకాల భావాలు కలిగాయి. ఆవిడమీద కసి తీరుతున్న సంతృప్తితో బాటు, ఏదోమూల జాలికూడా పొటమరిస్తానే ఉన్నది. ఆవిడ వూహలు ఎంతదాకా పోయాయంటే, వదిన ప్రస్తుతః ఉత్తమురాలేనూ. ఇరుగు పొరుగు వాళ్లే ఆవిణ్ణి పాడుచేస్తున్నారె. వదినమీద చాడీలు చెప్పినవాళ్లు, అన్న

మీద లేనిపోని అపవాదులు వేసినవాళ్లు, తననుగురించి మట్టుకు వాళ్ళతో అదేవిధంగా అనకుండా వుంటారా? చిత్ర మేమిటంటే ఈ ఆలోచన సుందరమ్మకు చాలా ఆలస్యంగా వచ్చింది. ఆనాడే వచ్చినట్లయితే, సుందరమ్మ జీవితం మరొక లాగా ఉండి ఉండేది.

పిల్లలందరూ వచ్చారు. భోజనాలు చేశారు. చేస్తున్నంత సేపూ ఏదో ఒక గలభా రేగుతూనే వుంది. నాగులొచ్చి ఆకులుతీసి బాగుచేసింది. కాగు పట్టుకెళ్ళి బాదంచెట్టుక్రింద బెట్టింది. తుండుగుడ్డలు, సబ్బుబిళ్ళ, డ్రాయరుమీద బెట్టింది.

"స్నానానికి లే అన్నయ్యా!" అన్నది సుందరమ్మ.

"అంగోస్త్రం యివ్వమ్మా ... వద్దులే ఇక్కడే ఉన్నాయి—అరె! నారాయణ రా వేఁ! ఇందాకణ్ణించీ వాడు కనుపించనే లేదు" అన్నాడు అన్నగారు.

"ఆ యింట్లో చదువుకొంటున్నాడన్నాయ్" అన్నది సుందరమ్మ.

"ఆ ఇల్లుగూడా మనకిందే ఉందా?"

"లేదన్నాయ్. రాజయ్యగారిది. ఈ ఇల్లుగూడా ఆయనదే. ఈ వూళ్లో ఆయన నాకు పెద్ద అండ ... అదుగో! ఆ వస్తున్నాయనే రాజయ్యగారంటే"

రాజయ్యను చూశాడు పురుషోత్తం. నలభై ఏళ్లుంటాయి. బుగ్గ మీసాలు, దృఢమైన శరీరం, పొట్టి క్రాపు, వెంట్రుకలు ఇప్పుడిప్పుడే నెరుస్తున్నాయి. నీరుకావి ధోవతి

చెంగు దోపి కట్టాడు. బారుచేతుల చొక్కా. కిర్రుచెప్పులు, చేతులకు బంగారపు ముడుగులు ... రాజయ్య సరాసరి ఇంట్లో కెళ్లిపోయాడు. పురుషోత్తం స్నానం చేయటానికై బాదం చెట్టువేపు కెళ్లాడు.

ఈలోగా నారాయణరావు వచ్చాడు. పురుషోత్తాన్ని గుర్తుపట్టలేక పోయాడు. ఏదో ఛాయామాత్రమైన రూప మొకటి అతని మనోఫలకంమీద ప్రతిఫలిస్తున్నది. ఆ రూపా నికీ, తనకూ గల సంబంధాన్ని గురించి ఎక్కువసేపు ఆలోచిం చలేకపోయాడు నారాయణరావు. పురుషోత్తం స్నానంచేసి వచ్చాడు. రాగానే, "ఏమోయ్! బాగా చదువుకొంటు న్నావా?" అని పరామర్శించాడు.

నారాయణ క్షణకాలం గింజుకొన్నాడు.

"మామయ్య అడుగుతుంటే మాట్లాడవేమిరా?" అని హెచ్చరించింది సుందరమ్మ. ఈ వ్యక్తి మామయ్య అని చెప్పిన తరువాతగానీ, పురుషోత్తాన్ని గుర్తుపట్టలేకపోయాడు నారాయణరావు.

"ఆ చదువుతున్నాను."

"చదవరా నాయనా చదువు. నాకూ మీ నాన్నకూ పెద్ద చదువులు చదివే రాతలు లేనే లేవు. నువ్వైనా చదివి కాస్త ప్రయోజకు ణ్ణనిపించుకో."

నారాయణరావు మాట్లాడలేదు.

"నువ్వుగూడా అన్నానికి రారావన్రా! మామ య్యకూ, నీకూ ఒక్కసారే వడ్డిస్తాను."

"సరే"

నారాయణ కాళ్లు కడుక్కొచ్చి చొక్కా లాగులు విడువకుండా అలానే కూచున్నాడు. పురుషోత్తం చూచి గూడా ఏమీ అనలేదు. ఇద్దరికీ వెండి కంచాల్లో అన్నం బెట్టింది. సుందరమ్మ. వెండి గ్లాసులతో మంచినీళ్లిచ్చింది.

"నాకీ సొరకాయ కూరొద్దు తీసెయ్" అన్నాడు నారాయణరావు.

"పచ్చడేసేవట్రా." అన్నది తల్లి.

"రోజూ పచ్చడేనా. పాడు పచ్చడి" అని విసుక్కొన్నాడు.

"నీ కక్కర్లేకపోతే నాకిలా వెయ్యరా నారాయణా!" అన్నాడు పురుషోత్తం.

"ఎందుకులే అన్నాయ్యా! నేనింకా అన్నం తినలేదు. నే వడ్డించుకొంటాన్లే!"

"నేను తినగూడదని వాణ్ణా ఏమిటే సుందరం. ఎవరో పరాయివాడితో అన్నట్లంటావేం ... మరేం ఫరవాలేదు. ఇలా వడ్డించు.'

నారాయణరావు ఓరకంటితో మేనమామను చూచాడు. సుందరమ్మ కూర మొత్తం పట్టుకెళ్లి అన్నగారికి వడ్డించింది. ఆ తరువాత ఎక్కువ సంభాషణలేమీ జరక్కుండానే భోజనా లయిపోయాయి.

"నువ్వుగూడా భోంచెయ్యి రాజయ్యా! వడ్డించేదా?" అన్నది సుందరమ్మ.

"ఇప్పటికే కడుపులో ఎలుకలు జొరబడ్డాయి సుందరమ్మా! ఈయనగా రెవరు? ... మీ అన్నగారా" అని అడిగాడు రాజయ్య పురుషోత్తాన్ని చూసి.

"అవును రాజయ్యా!"

"అమ్మాయ్! ఈ వూళ్లో మంచి పొగాకు దొరుకుతుందటే! నేను తేవడం మరిచిపోయాను" అన్నాడు పురుషోత్తం.

"కొనటం ఎందుకులెండి? నా దగ్గరుంది కాల్చండి" అంటూ రాజయ్య గుప్పెడు పొగాకు తీసి పురుషోత్తంవేపు గిరవాటేశాడు.

పురుషోత్తం కుర్చీలో కూచుని చుట్ట చుట్టుకొంటున్నాడు. రాజయ్య తలుపు వారగా కూచొని అన్నం తింటున్నాడు. నారాయణరావు అప్పటికే చదువుకోటానికి వెళ్లిపోయాడు.

"మీకు పిల్ల లెంతమందండీ రాజయ్యగారూ" చుట్టకొస కొరికి, అగ్గిపెట్టె తీస్తూ అడిగాడు పురుషోత్తం.

"లేరండీ!" అన్నాడు రాజయ్య.

"భార్య పుట్టింటి కెళ్లిందలే వుంది" అన్నాడు ఏదో ఒకటి అనాలి గనుక.

ఈ మాట వినంగానే రాజయ్య ఒక క్షణం కలవరపడి తిరిగి సర్దుకొన్నాడు.

"లేదండీ! చచ్చి ఏ డెనిమిదే ళ్లవుతుంది" అన్నాడు అమాకలాగా.

"అయ్యో పాపం! లేత వయస్సులా ఉన్నారుగదా! మళ్లీ పెళ్లి చేసుకోక పొయ్యారా!

"నా కా ఉద్దేశమే లేదండీ! చాలామంది మీకు మల్లెనే అన్నారు. కానీ చేసుకో బుద్ధిగా లేదు. ఏమిటో ... ఇంకా పెళ్లి చేసుకోవటమంటే నాకు బొత్తిగా మనస్సు పోలేదు..."

"అదేమిటి రాజయ్యా! పెరుగు వడ్డించుకోకుండానే లేచిపొయ్యావేం? బలేవాడివే, అదేమిటి? రా. కూచో" సుందరమ్మ పాటికి పదిసార్లు అంటూనే ఉన్నది. అప్పటికే రాజయ్య చెయ్యి కడుక్కొని వెళ్లిపోయాడు.

# 7

ఆ రాత్రి అందరి భోజనాలూ అయిపోయినాయి. నాగులు అందరికీ పక్కలువేసి, తనింత తిని, చాపా గుడ్డలూ తీసుకొని రాజయ్యగారి ఇంటివేపు పోయింది. నారాయణ రావు అప్పటిదాకా చదువుకొని, అప్పుడే కన్నుమూశాడు. బైటంతా చీకటిగా ఉంది. బజారులో వుండి ఓ కుక్క అరుపు, దూరంనుంచి పిల్లలు బిగ్గరగా చదువుతున్న రొదా, అస్పష్టంగా వినిపిస్తున్నాయి. లాంతరు డ్రాయిరుమీద వెలుగుతున్నది. ఏవో పురుగులు దానిచుట్టూ తిరుగుతున్నాయి. కొన్ని గ్లాసుకుకొట్టుకుని పడిపోతున్నాయి. పురుషోత్తం చుట్ట పారేసి కాసిని నీళ్లు పుక్కిలించి ఊసి రెండు గుటకలు తాగి స్థిమితంగా కూచున్నాడు. రాజయ్య ఇంకా చుట్ట

కాలుస్తూనే ఉన్నాడు. సుందరమ్మ స్తంభాని కానుకొని కూచున్నది. చల్లటిగాలి తెరలు తెరలుగా వీస్తున్నది.

"ఊఁ బాగుంది." అంటూ ప్రారంభించాడు పురుషోత్తం. "అయితే నేను రేపు ప్రొద్దుటే పోతానే సుందరం!"

"తొందర పనులేమీ లేవుగా. వెళ్లుదువుగాని లే తొందరేం? అన్నది సుందరమ్మ.

"అప్పుడే నంటండీ?" అన్నాడు రాజయ్య.

"అవతలవాళ్లు నాకోసం కనిపెట్టుకొని ఉంటారు. నే వెళ్లి ఏదో ఒక కబురు చెప్పిందాకా వాళ్లు ఇంకొకరికి బేరమిచ్చేను కూడా ఇవ్వరు. నేనిక్కడే ఉంటే ఎట్లా?" అన్నాడు పురుషోత్తం.

"బేరమేమిటి?" అని సుందరమ్మ నడిగాడు రాజయ్య.

"కారుచవగ్గా ఎనిమిదెకరాల పొలం అమ్మకాని కొచ్చింది. సుక్షేత్రమైన భూమి. చెరువునిండా నీరొచ్చిం దంటే ఎకరం ఇరవై బస్తాల గింజ రాలుతుంది." అన్నాడు పురుషోత్తం.

"అంత మంచి భూమైతే, చవగ్గా ఎందుకు పోకడ పెడుతున్నారండీ!"

తను మహా తెలివిగా మాట్లాడాననుకొన్నాడు. రాజయ్య చుట్ట పారేశాడు.

"మంచి నీళ్లు కావాలా రాజయ్యా?" అన్నది సుందరమ్మ.

"కాసి నివ్వు."

రాజయ్య మంచినీళ్లు తాగాడు. పురుషోత్తం తిరిగి గొంతు విప్పాడు.

"మీరన్నది నిజమే! మామూలుగా అయితే ఎకరం ఏడొందలకు తక్కువరాదు. భాగాలు కుదరక అన్నాదమ్ములు పేచీపడ్డారు. ఊళ్లో పెద్దలు చెప్పినా వినలేదు. చివరికి దాన్ని అమ్మాలనుకొన్నారు. తగాదాల్లో పెద్ద పొలం—ఎటుగూడీ అలవ సులవలకు అమ్ముతారుగదా అని – ఎవ్వరూ పెద్ద ధర పెట్టటంలేదు. ఈ సందులో మనం లటిక్కన లంకించుకొన్నా మంటే తిరిపోతుంది."

"ఎకరం ఎంతలో వున్నదంటారు?"

"నాకని చెబితే, కిందబెట్టీ మీదబెట్టీ, ఎకరం ఐదొం దల కివ్వొచ్చు. అదీ కనాకష్టమే!"

సుందరమ్మ లెక్క వేసుకొంది. ఎనిమిదైదులు — ఎని మిదిమూళ్లిరవై నాలుగు, ఎనిమిది నాలుగులు ముప్పై రెండు, ఎనిమిదైదులు నలభై. నలభై వందలంటే—నాలుగు వేలు. అమ్మయ్యో, నాలుగు వేలే! అనుకొన్నది.

"ఎదిగే కుర్రవాడొకడున్నాడు. డబ్బుంటే దాని కిందా దీనికిందా హరించుకుపోతున్నది. ఆ ఎనిమిదెకరాల చెక్క కొనిపడేస్తే, వాడికి కాస్త ఆధరువుగా వుంటుందను కొంటున్నాను."

ఈ మాటలన్నీ ఎవర్ని నిర్దేశించి అంటున్నదీ రాజ య్యకు అర్థంగాలేదు. సుందరమ్మ దానికి అర్థం చెప్పింది.

"నిజమేగానీ నాలుగువేలు ఇప్పుడెక్కణ్ణించి వస్తా యన్నయ్యా! పదీ ఐదూ అయితే, ఎక్కడో తీసుకు రావచ్చు. నాలుగువే లెవరిస్తారు? ఏంచూచి ఇస్తారు? అన్నది సుందరమ్మ.

"ఉంటేనే నేననేది! లేకపోతే ఏ గుడ్డూ లేదు — నా ఏడుపల్లా బంగారమంటి పొలం చెయ్యి జారిపోతున్నదే — అని."

"పోనీ మీరు కొనుక్కోకపోయారా?" అన్నాడు రాజయ్య.

"నేనా?" అని నవ్వాడు పురుషోత్తం. "ఈ జన్మ పడిమారి, మరొక జన్మ ఎత్తితేనే, నేనా పొలం కొనేది — దినం గడపటానికే, నానాగడ్డి కరవాలిసొస్తుంటే — పొలం యేం కొనను రాజయ్యా!"

"మీరు కాకపోతే, మీ చెల్లెలు కొంటుందేమో అడగండి" అన్నాడు రాజయ్య నవ్వి.

సుందరమ్మ నవ్వింది.

"ఆ కొంటాను. నా కొడుకు పెద్దవాడై రెండు చేతులా ఆర్జించి పారేస్తుంటే కొనకేంజేస్తాను?" అన్నది సుందరమ్మ.

"ఆర్జిస్తాడు లేవమ్మా! వాడికే కాస్త ఊడు రానివ్వు. అప్పుడేనా ఆర్జనలూ, గీర్జనలూ లెక్కకట్టటం! కాస్త వాణ్ణి ఎదగనీ" అన్నాడు రాజయ్య.

ఎవ్వరూ ఒక్క నిమిషంసేపు మాట్లాడలేదు. రాజయ్యే నవ్వుతూ అన్నాడు :—

"నోటు రాస్తే ఎవరన్నా ఇవ్వకపోతారా ?"

"ఏం చూసి ఇస్తారు ?" అన్నది సుందరమ్మ.

"నాకు నోటు రాయి సుందరమ్మా ! రెండు వేలు నే నిస్తాను" అన్నాడు రాజయ్య.

"మహారాజుగా రాస్తాను" అని నవ్వింది.

"నవ్వులాటగాదు. నిజంగానే. ఇస్తాను. రెండేళ్ళలో తీర్చుకో. ఏమంటావ్ !"

"నిజమేనా ఏమిటి ?" అన్నది సుందరమ్మ ఆశ్చర్యంగా.

రాజయ్య రెండు వేలు ఇవ్వటానికీ, సుందరమ్మ నోటు రాయటానికీ నిర్ణయం అయిపోయింది. రాజయ్య అప్పుడే డబ్బు తెచ్చి పురుషోత్తానికిచ్చాడు. పురుషోత్తం లెక్క చూసుకొని, అన్నీ సరిపోయాక, వాటిని జాగ్రత్తగా సంచిలోకి సర్దాడు. సుందరమ్మ మధ్యాహ్నం వండిన అరిసెలు, చెక్కరాలు ఇన్ని మూటగట్టి అన్నగారి సంచివగ్గరే పెట్టింది. చార్జీలకు చిల్లరతీసి పొట్లంగట్టి, బొడ్లో దోపి కొన్నది. రాజయ్య కాసేపు కూచొని వెళ్ళిపోయాడు. ఆ తరువాత అన్నా చెల్లెళ్లు చాలా ప్రొద్దుపోయేదాకా ఏవో మాట్లాడుకొంటూనే వున్నారు. పురుషోత్తం ముసుగు పెట్టుకుని పడుకొన్నాడు. ఒక్క పావుగంటైనా గడవక

ముందే, ముసుగు తీసి, "నిద్రపోయావా సుందరం?" అన్నాడు.

"లేదన్నయ్యా!"

ఆమెకు నిద్రపట్టటం లేదు.

"నారాయణ్ణి నాతో పంపించరాదూ? పదిరోజులు వుండొస్తాడు."

"వాడికి రేపు నాలుగో తారీఖునుండీ పరీక్షలు జరుగుతాయట. అవి అయిపోతేగానీ, వా డెక్కడికీ కదలటానికి వీలుండదు."

"అప్పుడు మళ్ళీ నేను రావాలన్నమాట."

"ఎందుకూ? కారెక్కిస్తే సరాసరి వాడొక్కడే రాగలడు — అలాగే పంపుతాలే అన్నయ్యా!" ఇంకా ఏదో అనబోయింది.

మధ్యలోనే పురుషోత్తం అందుకొని "రాజయ్య బాగా వున్నవాడా ఏమిటీ సుందరం?" అన్నాడు.

"తినేవాళ్ళే లేరుగానీ, కట్టుకుపోయినంత వుంది.

"నాగులు అక్కడ పండుకొంటుందేం?" ఇందాకనుండీ మనస్సును మధన పెడుతున్న సందేహాన్ని కాస్త బైటకు కక్కాడు.

సుందరమ్మ మెత్తగా నవ్వింది.

"అదా సంగతీ!"

తనలో అనుకొంటున్నట్లు మెల్లగా అన్నాడు పురుషోత్తం. ఇంతలో నారాయణరావు అటూ ఇటూ మసిలి లేచాడు. సుందరమ్మ వాణ్ణి రెక్కపట్టుకొని దూరంగా తీసుకెళ్ళి, తిరిగి పడుకోబెట్టింది.

"ఇన్నేళ్ళొచ్చినా ఇంకా భయపడతాడు టే వీడు ?" అన్నాడు పురుషోత్తం.

సుందరమ్మ మాట్లాడలేదు. కాస్సేపుండి "శారద కిప్పుడు ఎనిమిదో ఏడు కాదా అన్నయ్యా ?" అన్నది చాలా దీర్ఘంగా ఆలోచించి.

ఆవిడ దేన్ని గురించి ఆలోచిస్తునదో పురుషోత్తం చప్పున గ్రహించాడు. "ఆ వచ్చినట్లే ఇంకో మూడు నాలు గేళ్ళలో దానికి పెళ్ళి చేసెయ్యాలి. అప్పటికి నారాయణరావు స్కూలు ఫైనలు కొస్తాడు. ఆ కాస్తా అయిందనిపిస్తే, నా గుండెమీద సగం భారం తీరిపోతుంది" అన్నాడు పురుషోత్తం.

సుందరమ్మ మనస్సు ఆనందంలో మునిగి తేలింది. ఒక్కసారి ఆమె శరీరమంతా రోమాంచితమైంది. అన్యాయంగా కొడుకును దగ్గరకు తీసుకొని నిద్రలోనే వాణ్ణి గట్టిగా ముద్దు బెట్టుకొంది. నారాయణరావు అటూఇటూ కదిలాడు.

అల్లంత దూరాన్నే భర్త రావటం చూసింది. రామమ్మ. అతని ముఖం విప్పారి వుండటంగూడా గ్రహించింది. లోపలికెళ్ళి నీళ్లు తెచ్చింది. పురుషోత్తం సరాసరి లోపలికొచ్చాడు. రామమ్మ చేతిలో వున్నసంచీ అందు

కొన్నది. దాన్నిండా రెండు మూడు రకాల కాయలు, మిఠా యిలూ వున్నాయి. పిల్లలు ముగ్గురూ ఈగలు ముసిరినట్లు ముసిరి, తలోకకాయా, తలాకాస్త మిఠాయి లాక్కొన్నారు. వీటి అడుగున చామంతిపూలు దవనమూ వున్నాయి. అరిసెలు, చక్కెరాలు వున్నాయి. అన్నిటికంటె అడుగున రెండు చీరె లున్నాయి. వాటిని చూడంగానే రామమ్మ ముఖం విప్పారింది. అడుగున ఎడ పిల్లకు పరికిణీలు, చొక్కాలు వున్నాయి. రెండోదానికి గౌన్లు, సూర్యానికి లాగులు, బూట్లు వున్నాయి. వీటిని చూస్తున్న కొద్దికీ, రామమ్మ ఆనందం ఒక్కొక్క మెట్టు పైకెక్కసాగింది. చీరె మడతలన్ని విప్పి, పురుషోత్తంగారు ఒక పెద్ద పొట్లం తీసారు. రామమ్మ పిల్లలకు తలోక చక్కిలమిచ్చి బైటికి తరిమింది. ఆ పొట్లంలో ఏముండేదీ ఆమెకు తెలుసు. అందుకే ఆవిడ ఆశ్చర్యాన్ని ప్రకటించలేదు. పురుషోత్తం లేచివెళ్లి, తలుపు దగ్గరగా వేసి వచ్చాడు. ఆత్రం ఆగక ఈలోపుగానే రామమ్మ పొట్లం విప్పింది. ఆమె ఏనాడూ అన్ని నోట్లు చూడలేదు. ఆ ఆశ్చర్యంలో ఆవిడ తెరచిన నోరు ముయ్యటమే మరిచిపో యింది. పురుషోత్తం జాగ్రత్తగా నోట్లు లెక్కించాడు. పందొమ్మిదివందల ఏభై ఆరురూపాయ లున్నాయి. అతని ముఖం మహా ప్రశాంతంగా వున్నది. ఏ భావమూ అందులో ప్రస్ఫుటించటం లేదు, రామమ్మ అవన్నీ గబగబా సర్దేసింది. పిల్లలు తలుపులు తోసుకొని లోపలికొచ్చారు.

"నాన్నా నాకు మిఠాయి పెట్టవూ!"

"అమ్మా! నాకు చక్కిలం."

"అక్కయ్య నా అలితికాయ లాక్కుంది నాన్నా! నా కిప్పియ్యవూ!"

"నాకు గాను. నాకు గాను."

"నాకు కొత్త పరికిణీ—"

శ్రీమతి రామమ్మగారు గుర్తురిమి ఒక్క ఘీంకారం చేసింది. పిల్లలు హడలిపోయారు. మళ్లీ కిక్కురు మనలేదు.

భోజనా లయినాయి. పిల్లలందరూ గాఢనిద్రలో వున్నారు. పురుషోత్తం గదిలో మంచంమీద అటూ ఇటూ పొర్లుతున్నాడు. అతని చూపులు మాటి మాటికీ, వాకిలి వైపు పరుగెత్తుతున్నాయి. జాగ్రత్తగా వెదుకుతున్నాయి. ఆ మసక చీకట్లో అతని కేదీ స్పష్టంగా కనుపించటం లేదు. చిరాకుతో అటూ ఇటూ కదిలాడు. తలుపు కిర్రుమని ధ్వని చేసింది. కంటి కొసలనించి అటువేపు చూశాడు పురుషోత్తం. రామమ్మ తమలపాకులు నములుతూ లోపలికొచ్చి తలుపు గడియవేసింది. పురుషోత్తం నిద్రపోతున్న వాడిలాగా నటించాడు.

"ఇంతమాత్రానికే నిద్రపోయ్యేవాడివేనా నువ్వు?" అన్నది రామమ్మ.

అప్పటికే పురుషోత్తంగారికి నవ్వు పుక్కిలింతలయింది. ఇక ఆపుకోలేక 'ఫక్కు' మన్నాడు.

"కొంచెం అవతలికి జరుగు. కాస్త—అబ్బ—కదల వేం—" అన్నది రామమ్మ.

ఆమె తల్లో చామంతిపూలు, అందంగా వూగాయి. దవనం వాసన గదినిండా వ్యాపించింది. రామమ్మ పోకచెక్క ఇచ్చి, ఆకులకు సున్నం రాసి చేతికివ్వబోయింది. పురుషోత్తం తీసుకోలేదు. నోరు తెరిచాడు.

"ఊఁ" అని చిన్నగా మూలిగి, "అన్ని పోకిళ్లు పోకిళ్ళయినాను" అన్నది, ఆకులు అతని నోటి కందించి. పురుషోత్తం మెల్లగా ఆమె తలను నిమిరాడు. ఆమె నవ్వుతూ అన్నది :-

"ఈ వేషాలన్నీ చాలించు. మళ్ళీ పిల్లడు లేచాడంటే-ఒకంతట వూరుకోడు."—

* * *

ఆ తెల్లవారినుండి రామమ్మ వూహాలు స్వైర విహారం చేశాయి. ఆమె నిర్మించిన ఊహాసౌధాలు చిత్రీకరించడమంటూ జరిగితే, ఎవ్వరయినా ఆశ్చర్యపోక తప్పదు. బట్టల వ్యాపారం లగాయతు, నైజాం వెళ్లి చౌకగా పొలాలుకొనడం వరకూ ఆవిడ ఊహించింది. ఎంతకాల మీ దిక్కుమాలిన మేష్టరు గిరీతో బాధపడటమని తర్కించుకొన్నది. పిల్లలకు - ముఖ్యంగా ఆడపిల్లలకు వంటినిండా సొమ్ములు దిగవేయాలనుకొన్నది. సూర్యానికి అధమపక్షం బి. ఏ. దాకనా చదువు చెప్పించాలనుకొన్నది. తనకు ఎంతకాలంనుంచో

చంద్రహారంమీద, అరవంకెమీద మనసున్నది. వీరాచారిని పిలిపించి ముందు వాటికి పనిబెట్టాలనుకొన్నది. డబ్బు ఇంట్లో ఉండటం ఏవిధంగానూ మంచిదిగాదు. రోజులు బాగాలేవు. తరువాత ఏమనుకుంటే ఏమున్నదీ?

ఆరోజుల్లా రామమ్మ రామమ్మలాగా లేదు. ఒక్క రాత్రిలో ఆవిడలో వచ్చిన పరిణామం చూచినవారిని ఆశ్చర్య పరిచింది. ఇంకా ఉదారం ఉండబట్టని వాళ్లు, ఏదో వంకపెట్టు కొని ఆమె ఇంటికొచ్చి ఆరా తియ్యటానికి ప్రయత్నించారు. రామమ్మ దేవాంతకురాలు. ఇటువంటి డబికీలు ఆవిడ ముందు దమ్మిడీకి కొరగావు. ఆకుకు అందకుండా, పోకకు పొంద కుండా, సమాధానం చెప్పింది. మరొకరిద్దరు పిల్లలను దగ్గరకు తీసి, తాయం ఆశచూపెట్టి కూపీ లాగాలని ప్రయత్నించారు. "పురుషోత్తం ఎక్కడనుండో వస్తూ గుడ్డలు, మిఠాయిలు తెచ్చా"డని మాత్రమే పిల్లలన్నారు. డబ్బుపొట్లం వారు చూడలేదు. చూచినట్లైతే చెప్పి ఉండేవారే! ఈ అపా యాన్ని ముందే పసికట్టడంవల్ల పురుషోత్తానికి దాని ప్రమాదం తప్పిపోయింది.

పురుషోత్తం ఆ డబ్బును ఏమి చేయవలసిందీ చెప్పాడు. రామమ్మ గుండెలు దిగజారిపొయ్యాయి. ఒకటి రెండు నిముషాలకుగానీ ఆమె మామూలు మనిషికాలేదు. యథా స్థితికి వచ్చిన తరువాత భర్తమీద ఆగ్రహం వచ్చిం దామెకు,

"అయితే ఇప్పుడా బాకీలన్నీ తీర్చాలిసిందేనా?" అన్నది రామమ్మ, తీర్చకపోతే కొంప మునిగిపోయేదే మున్నదిలెద్దూ అనే భావాన్ని వ్యక్తంచేస్తూ.

'తీర్చకపోతే వాళ్లూరుకొంటారటే? బాకీలవాళ్లు నన్నెట్లా పీక్కుతింటున్నారో నీకేంతెలుసు? ముందు ఇల్లు తాకట్టు వదిలించుకోవాలి. ఇప్పటికే అది తడిసి ముప్పంచు మైంది. ఇంకొంతకాల మాగితే, మొత్తం తుడిచిపెట్టుకు పోతుంది. బసవయ్య ఎక్కడబడితే అక్కడ నిలవేస్తున్నాడు. ఇంకా చిల్లరకొట్లోది అట్లాగే తగలబడ్డది. నేను మట్టుకు దాచుకొంటున్నదేముందీ?"

అప్పటికీ రామమ్మ ముఖంలో ప్రశాంతి కనపడక పోయేసరికి తిరిగి పురుషోత్తం చెప్పసాగాడు.

"ఇల్లు తాకట్టుబెట్టి తెచ్చిన వెయ్యిరూపాయలు కనిపిస్తూనేవుండె. రెండేళ్లకు వడ్డీగూడా దానికి కలుపుమరి — బసవయ్య నోటు (అతనుగూడా ఇల్లు చూచుకునే బాకీ యిచ్చాడు) అయిదువందలూ తీర్చక తప్పేదేమున్నది?" అన్నాడు.

ఇల్లు తాకట్టుపెట్టి తెచ్చిన వేయి రూపాయల్లోను, నాలుగువందలు సుందరమ్మకిస్తే, మిగిలినవి ఇంటి ఖర్చుల క్రింద చెల్లిపోయాయి. కాకపోతే, ఈ దిక్కుమాలిన పంతులు పని చేస్తూ, ఇంతకద్దు సంసారం గడపటం ఎవరికైనా అసాధ్య మేననీ, ఇందులో తను మోసం చెయ్యటానికి పరాయివా

ళ్లెవరూ లేరని, భార్యనూ, కన్నబిడ్డలనూ మోసం చేసేటంత నీచుణ్ణి తను కాదనీ భార్యకు సంజాయిషీ చెప్పుకొన్నాడు. ఈ వాదనంతా నిజమే అయినప్పటికీ, రామమ్మ మొగుణ్ణి క్షమించ లేకపోయింది.

పురుషోత్తం వూళ్లో బాకీలన్నీ తీర్చివేశాడు. ఒక్కసారి ఇంతడబ్బు పురుషోత్తం ఎలా సంపాదించాడన్న ప్రశ్న, ప్రత్యుత్తరాన్నపేక్షించింది. ఒకటి రెండు వారాలపాటు పురుషోత్తం వాళ్లకు సమస్యయి కూచున్నాడు. చివరకు చెల్లెలు ఇచ్చివుంటుందనే జవాబును వూహించుకొని, ఆ సమస్యను తాత్కాలికంగా ప్రక్కకు నెట్టటం జరిగింది. దాని మీద అనేక వ్యాఖ్యానాలు, ఖండనలు జరిగాయి. లోకంలో తోబుట్టువులు (ముఖ్యం అక్క చెల్లెళ్లు) పరస్పర సహాయ సానుభూతు లెలా పంచుకొంటారో చర్చించుకొన్నారు.

♦ ♦ ♦

పరీక్ష లయిపోగానే నారాయణరావు మేనమామగారింటికి వచ్చాడు. వా డిక్కడకు రావటానికి ముందు కొంత గొడవ జరిగినమాట నిజం. సుందరమ్మ ఎన్నిసార్లు చెప్పినా వాడు వెళ్ళననే మొరాయించాడు. అదీగాక, వాడికి అత్తయ్యంటే సదభిప్రాయం లేదు. ఇందుకు కారణం గూడా సుందరమ్మే! తను అన్నగారింట్లో ఉన్నప్పుడు రామమ్మ ఎటువంటి మాటలన్నదో, పురుగును చూసినట్లు ఎట్లా చూసేదో, అప్పుడు తన హృదయ మెంత కుమిలిపోయేదో, వర్ణించి చెప్పింది. ఈ చెప్పడంలో ఆమె బుద్ధి

పూర్వకంగా, తన అన్న ఉదాసీనతను కప్పిపెట్టింది. అప్పటికీ ఇప్పటికీ గూడా సుందరమ్మకు అన్నగారు ఉత్తముడు లాగానే కనుపిస్తున్నాడు. అత నొట్టి అమాయకుడనే ఆవిడ నమ్మకం. అతన్ని చేజిక్కించుకొని వదిన నాటక మాడుతున్నదని సుందరమ్మ హృదయపూర్వకంగా విశ్వసించింది. ఈ విశ్వాసాన్ని పురుషోత్తంగారుగూడా యథాశక్తి బలపరుస్తూ వచ్చాడు. అందుకు ఉదహరణంగా, అతను గొలుసు దొంగతనాన్ని భార్యకు అంటగట్టిన ఉదంతాన్ని పేర్కొనవచ్చు. అన్నగారి ప్రోద్బలం లేకుండా, వదిన ఇటువంటి పాడుపనులు చెయ్యగలదా అన్న ప్రశ్న సుందరమ్మకు తట్టలేదు. ఒకవేళ చేసినా అన్నగారు సత్యా సత్యాలు గ్రహించవచ్చు నన్న స్పృహగూడా ఆమెకు రాలేదు. ఎందుకంటే అన్నగారు అమాయకుడన్న నమ్మకం ఆమెకు ప్రబలంగా ఉన్నది. ఆ నమ్మకం చెక్కుచెదరకుండా ఉన్నంత కాలమూ, సుందరమ్మ అన్నను తప్పు పట్టలేదు. వదెనను ద్వేషించకుండానూ ఉండలేదు. చివరకు—ఆ ఇంట్లోనుండి తనెలా బైటకు రావలసి వచ్చిందో గూడా చెప్పుకొన్నది. నారాయణరావు ఆశ్చర్యంగా వింటున్నాడు. ఈ ఘట్టం దగ్గరకొచ్చేసరికి, ఆమె మాట తడబడ్డది. కళ్ళు నీటితోనిండి పోయాయి.

సుందరమ్మ తనకు వదినెమీద, నారాయణరావుకు అసహ్యాపూరితమైన అభిప్రాయాన్ని కలిగించాలని ఇదంతా చెప్పలేదు. నిజానికి ఆవిడ ఉద్దేశ్యం గూడా అది కాదు

ఆ రోజు మధ్యాహ్నమే ప్రక్కింటి కుర్రవాడొకడు (కుర్రవాడంటే ముప్పయ్యేళ్ళుంటాయి) తల్లిని నానా దుర్భాషలాడి, మీదపడి కొట్టాడు. ఆ తల్లికి ఏభై అరవై ఏళ్ళుంటాయి. కళ్ళు సరిగ్గా కనుపించవు, చెవులు వినిపించవు. కోడలు చాటుగా గింజ లమ్ముకొంటుంటే చూచి, సహించలేక కొడుకుతో చెబుతానన్నది. బుద్ధిమంతురాలైన కోడలు ముందుగానే యోచించి, భర్త రాగానే చిలవలకు పలవలు కల్పించి చక్కగా నూరిపోసింది. చెల్లెలన్నా, చెల్లెలు బిడ్డలన్నా ఆ భర్తగారికి కోపం. కాపరానికి పోతూపోతూ కట్నం అధికంగా పుచ్చుకెళ్ళడం ఆ కోపానికి ప్రధాన కారణం. భార్య ఈ కిటుకు తెలుసుకొని, అదే మొగుడుమీద ప్రయోగించింది. ఇంకేమున్నది. అతగాడు ఆగ్రహోదగ్రుడయినాడు. తల్లి ఏమి చెబుతున్నా వినిపించుకోలేదు. ఒకవేళ వింటాడేమోనని భార్య తగు జాగ్రత్త పడుతూనే వుంది. చుట్టుప్రక్కల చాలమంది పోగయ్యారు. ఏదోవిధంగా సర్దారు. ఆ తల్లి ఏడుపు చూస్తుంటే సుందరమ్మకు గూడా కళ్ళు చెమ్మగిల్లాయి. ఈ దృశ్యాన్ని నారాయణరావు గూడా చూశాడు.

బిడ్డలను పెంచటానికి తల్లులు ఎటువంటి బాధలు పడతారో, ఆ బాధల విలువ ఏమిటో, కొసకు కొడుకులు ఏలా తయారవుతారో, కొడుకు అర్థం చేసుకోవటం కొరకై సుందరమ్మ తన గత జీవితాన్నంతా నారాయణరావుకి చెప్పింది. ఆవిడ అభిప్రాయం బిడ్డలకోసం తల్లులు చేసే

త్యాగపరంపర కొడుకు అవగతం చేసుకోవాలని మాత్రమే! ఈ పని నారాయణరావు చేసినా చేయకపోయినా, రామమ్మ మీద ఏహ్యాన్ని మాత్రం కుదుర్చుకొన్నాడు. తన ప్రయత్నం ఈ విధంగా పర్యవసించిందని సుందరమ్మ గూడా గ్రహించలేదు.

తీరా ఇంతటి ఏహ్యాభావాన్నీ, అత్తగారిమీద కుదుర్చుకొన్న తరువాత, ఆవిడముఖం చూడటానికి అతనికి మనస్కరించలేదు. తనకే గనుక శక్తి ఉంటే ఆమెను చంపి పారేయా లనుకొన్నాడు. అటువంటి పాపుముండ ముఖం (ముండ అని నారాయణరావు అన్నప్పుడు, అలా అనకూడదని తల్లి వారించింది) తనిక చూడనన్నాడు. అయినా మామయ్య కోసమన్నా వెళ్లకపోతే బాగుండదన్నది సుందరమ్మ. అదీగాక శారద, సూర్యం...సూర్యాన్ని నారాయణరావు అసలు చూడనేలేదు. చూసి రమ్మన్నది. అత్తయ్య మీది కోపంతో, వీళ్లందరినీ చూడ నిరాకరించటం మంచిది కాదన్నది. ఆవిడ సరిగ్గా ఇలానే అనకపోవచ్చు. ఆవిడ అన్న దానిని, నారాయణరావు అర్థం చేసుకొన్నదీ, దాదాపు దీనికి దగ్గరగా వుంటుంది.

అతను బెరుకు బెరుకుగ్గానే వూళ్లో అడుగు పెట్టాడు. ఒక రిద్దరి నడిగి ఇల్లు తెలుసుకొన్నాడు. ఆ యిల్లు చూడంగానే, తనలో ఏదో 'గమ్మత్తు' జరుగుతుం దనుకొన్నాడు నారాయణరావు. కాని అలాంటి దేమీ జరగలేదు. పిల్లలిద్దరూ, నెరబాలో వా(మ)న గుంటలు ఆడుతున్నారు.

మరొక పిల్లాడు ఇల్లెగిరి పోయేటట్లు ఏడుస్తున్నాడు. నారాయణరావు సంచి తీసుకొని వాకిట్లో నిలబడ్డాడు. పిల్లలతన్ని ఒక క్షణం చూసి తిరిగి ఆటలో నిమగ్నులయ్యారు. కుర్రవాడు కొత్త ముఖాన్ని చూచి, అర నిముషం ఏడు పాపి, తిరిగి ప్రారంభించాడు.

"వాడట్లా ఏడుస్తుంటే, ఏం చేస్తున్నారే మీ యమ్మ కడుపులు కాల. మరీ ఈ పెద్దదాని కొచ్చిందమ్మా ఎక్కడలేని వాయువా! ... ఒసేవ్ శారదా! వాణ్ణి కాస్తా చంక వేసుకోవే నిన్ను మారి మింగ" అన్న కటోర స్వరమూ, ఆ వెంటనే, ఒక్క పలచగా, నీరసంగా ఉన్న ఒకావిడ నారాయణరావుకు గోచరించాయి.

ఆవిడ నారాయణరావును చూడలేదు. సరాసరి వచ్చి చంటివాణ్ణెత్తుకొని, చెయ్యెత్తి ఆడపిల్లలు అదృష్టవంతులు, వాళ్ళకా పూట దెబ్బలు లేవు. రామమ్మయినా వెంటనే అతన్ని పోల్చుకోలేదు. కాస్త పరకాయించి చూసి, ముఖం చేటంత చేసుకొంటూ "ఏంరోయ్ నారాయణా! బాగున్నావా? ఇదేనా రావటం?" అని మాత్ర మన్నది.

ఇతగా డెవరా అని ఆడపిల్ల లిద్దరూ కళ్ళు విప్పుకొని చూస్తున్నారు. అంతలోనే పురుషోత్తం బైటనుండి వచ్చాడు. అతన్ని చూడగానే నారాయణరావుకు కాస్త రిలీఫ్ దొరికింది. దోవకోసం తడుముకొంటున్న వాడికి, దోవ దొరికి నట్లయింది. లోపలికి తీసికెళ్లి తనతో బాటే మంచంమీద కూచోబెట్టుకొన్నాడు. పెద్ద పిల్లను పిలిచి సంచీ ఇంట్లోకి

తీసుకెళ్లమన్నాడు ఆ పిల్ల తీసుకెళ్లి వస్తూవస్తూ అరిటికాయలు రెండు చేతుల్తో పట్టుకొచ్చింది.

ఆ బక్కపలచ నావిడ తన అత్తగారని నారాయణ రావు వూహించుకొన్నాడు. వాడికి అత్తగారి మీద అసహ్యానికి బదులు ఆశ్చర్యమేసింది. కారులో వస్తున్నంతసేపూ, వాడు అత్తగారిని గురించి వూహిస్తూనే ఉన్నాడు. వాడి వూహలప్రకారమైతే, రామమ్మ ద్వారబంధం తగిలేటంత ఎత్తు ఉండాలి చాలా లావుగా, నల్లగా, మిడిగుడ్లతో, నడవలేక, నడవలేక నడుస్తూ, బుసలు కొడుతూ ఉండాలి. అలాంటి రూప మున్నవారే తల్లి చెప్పిన దారుణ కార్యాలు చేస్తారనీ, చేయగలరనీ, వాడికొక నమ్మకముంది. అత్తయ్యను వాడు అలాగే భావిస్తూవచ్చాడు. అయితే ఇక్కడ రామమ్మ ఉన్న పద్ధతి అందుకు భిన్నంగా ఉంది. ప్రప్రథమంగా వాడు నిరుత్సాహాన్ని పొందిం దిక్కడనే!

రామమ్మను చూస్తూంటే నారాయణరావుకు అసహ్యం కలగలేదు. ఈవిడ—తల్లి చెప్పిన ఘోరాలన్నీ చేసివుంటుందా—అన్న అనుమానం వాడిని వేధించ సాగింది. చూస్తుంటే, ఎంతో సౌమ్యంగా ఉన్నదనుకొన్నాడు. అయితే తల్లి తనతో అబద్ధం చెబుతుందా? ఒకవేళ చెబుతుం దనుకొన్నా మాటవరసకు — అందువల్ల ఆమెకేమి ఒరుగుతుందీ! నారాయణరావు వూహించలేకపోయినాడు.

ఆడపిల్ల లిద్దరూ ఒక వూటల్లా అతని దగ్గరకు రాలేదు. ముందుగా అతని దగ్గరకు వచ్చింది శకుంతల.

ఆ పిల్లకు సరిగ్గా మాట్లాడటం గూడా రాదు. 'నీ పేరేమిటమ్మా?' అంటే — 'లకుంతల' అంటుంది. చిన్న పిల్లలంటే, ఆపేక్ష భగవంతుడు అపారంగా నారాయణరావు కిచ్చాడు. ఆ పిల్లచేత చాలసార్లు, దానిపేరు చెప్పించాడు. తన పేరు గూడా చెప్పించుకొన్నాడు. అది విన్న తరువాత నారాయణరావు విరగబడి నవ్వాడు. మొట్టమొదట దానికి నారాయణరావు అన్న అక్షరాలే రాలేదు. పట్టుబట్టి అతగాడనిపిస్తే 'నాలాయలలావు' అన్నది. తల్లి: అలా పేరుతో పిలవగూడదనీ, 'బావ' అని పిలవాలనీ చెప్పింది. పురుషోత్తంగారు గూడా దీన్ని బలపరచాడు. శకుంతల 'బావ' అని ప్రయత్నపూర్వకంగానూ, 'పావ' అని అప్రయత్నంగానూ అనసాగింది. శారదకు నారాయణరావు పేరు తెలుసు. అయినా అది ఆ పేరుతో అతన్నెప్పుడూ పిలువలేను. 'బావ' అనే పిలిచింది. అట్లా పిలవడానికూడా శారద అనేక అవస్థాలు ఎదుర్కొనవలసి వచ్చింది. తీరిగ్గా ఒకచోట చేరిన ఆడంగులు శారదను నారాయణరావు కిచ్చి పెళ్లిచేసేశారు. శారదకు పెళ్లంటే సరిగ్గా అప్పటికి తెలియదు. కానీ ఇంతమంది ఆడాళ్లు దాన్ని గురించి నవ్వుతూ అనడంచేత, అందులో సిగ్గుపడవలసిందేదో ఉండకపోదన్న అనుమానంతో సిగ్గుపడ్డది. ఆ సిగ్గుతో కృత్రిమత్వం లేదు. నటన అంతకన్నా లేదు.

# 8

నారాయణరావును రాజయ్య కారెక్కించి వచ్చాడు. తిరిగి వచ్చేటప్పుడు ఎవరినన్నా తోడు తెచ్చుకోమన్నాడు. లేకపోయినా - మైలు దూరమే గనుక సరాసరి డొంకనబడి వచ్చినా భయం ఉండదన్నాడు.

కొడుకు వెళ్ళిపోయిన తర్వాత సుందరమ్మ పని పిచ్చిని పడినట్లయింది. ఆమె కేమీ తోచలేదు. ఏపనీ మనస్ఫూర్తిగా చెయ్యలేదు. ఇక తప్పదు గనుక కుర్రాళ్ళకు భోజనాలు పెట్టక తప్పలేదు. "ఒక్క కూరా బాగుండలే"దని కుర్రాళ్ళు ఫిర్యాదు చేశారు. ఆవిడ అన్నం తినడానికి కంచం ముందు కూచున్నది. నాలుగు ముద్దలు తినంగానే కొడుకు జ్ఞాపక మొచ్చాడు. ఇక తినలేకపోయింది. అన్నంలో అలానే చెయ్యి కడిగేసుకొని లేచింది.

"అదేంటమ్మగారూ?" అన్నది నాగులు.

సుందరమ్మ బదులు చెప్పలేదు. నాగులు కంచం, ఎంగిళ్ళు ఎత్తివేసింది. సుందరమ్మ మనస్సును కుదుటబరచుకోవటానికై ప్రయత్నించింది. ఆవిడ కొడుకును విడిచి ఉండటం ఇదే ప్రథమం. వాడికేదో అపాయం కలుగుతుందని కాదుగానీ, ఎందుకో దిగులు గుండెల్లో బుసకొడుతున్నది. వంటింటి తలుపుకు గొళ్ళెంబెట్టి, నులక మంచంమీద దిండైనా లేకుండా, తన చేతిక్రింద బెట్టుకొని, కళ్ళు మూసుకొంది. నిద్ర పట్టటంలేదు. ఏవో తలపులు నీరసంగా వస్తున్నాయి.

పోతున్నాయి. మధ్యాహ్నం ఒంటిగంట దాటి ఉంటుంది. ఎండ చండ్ర నిప్పులు చెరుగుతున్నది. గాలి ఈచెవులోంచి, ఆ చెవులోకి ఈడ్చి కొడుతున్నది. అంతటా భయంకరమైన నిశ్శబ్దం. దూరాన తిరగలి తిరుగుతున్న 'గరగర' శబ్దము, ఎద్దుమీద వాలిన కాకి అరుపూ ఉండుండి వినబడు తున్నాయి.

"మిమ్మల్ని రాజయ్యగారు రమ్మంటుండారండీ!" అంటూ నాగులు వచ్చి కేకేసింది.

సుందరమ్మ ఆలోచనలు కట్టుబడిపోయినవి. చప్పున లేచి కూర్చున్నది. చుట్టూ చూసింది. ఎవ్వరూ లేరు. తిరగలి చప్పుడు వినపడటం లేదు. కాకి లేచిపోయింది. సుందరమ్మ కెందుకో గుండెలు గతుక్కుమన్నాయి. తలెత్తి ముందుకు చూసింది. రాజయ్య గది కనిపించింది. ఆ ఒంటరి తనం, ఆ వేళప్పుడు తను రాజయ్య ఇంట్లోకి వెళ్ళటం — చెప్పరాని వ్యాకులపాటు ఆమెను సంక్షుభిత పరిచింది. అవ యవాలు, దుర్బలములైనట్లు తోచింది. ఏదో అదృశ్యశక్తి ఆమెను భయపెడుతున్నది.

"ఎందుకు?" అని తనను తాను ప్రశ్నించుకొంది.

ఏమో?

"ఇప్పుడు రానని చెప్పవే" అన్నది సుందరమ్మ కానీ నాగులు వెళ్ళిపోయి చాలాసేపైందని ఆవిడకు తెలియదు. దాసకేదో అతి ముఖ్యమైన పని వుండివుంటుంది మరి!

వెళ్లడమా? మానడమా? అని చాలా వితర్కించుకున్నది సుందరమ్మ, కానీ ఎటూ తేల్చుకోలేకపోయింది. వెళ్ళడానికెన్నో అవరోధాలున్నాయి సుందరమ్మకు. పాపం! అటువంటి పాపపు బుద్ధులు రాజయ్యకు లేకపోవచ్చు. అయితే ఇటీవల అతని ప్రవర్తనలో ఏదో "తమాషా అయిన మార్పు" కనిపిస్తున్నది. మొన్నొకసారి కావాలని తలకు తల వేసి కొట్టాడు. వడ్డించేటప్పుడు పొరబాటున తగిలి ఉంటుందని సుందరమ్మ సరిపెట్టుకుంది. ఇంకొకసారి చీకట్లో వుంటే, రాచుకొంటూ వెళ్లాడు. చీకటి గనుక మనిషి కనపడక గావచ్చు ననుకుంది. నిష్కారణంగా నవ్వటము, ఏదో సున్నితమైన బూతుసామెతలు, ఎవ్వరూ లేనప్పుడు వేయటమూ – సరిపెట్టుకోవటానికి వీలులేనివైనాయి. ఒకసారి తను స్నానం చేస్తున్నది. రాజయ్య తన వేపే చూస్తున్న అనుమానం వేసింది. ఆనాడే ఆమె మనస్సు దీన్ని గురించి ఆలోచించింది. పొరబాటు మానవ సహజమనుకొంది. అదీ గాక అతను తన వేపు చూడటం లేదేమో? ఎటు కేసి చూస్తుం టేనో, తన వేపని తను భ్రమపడి ఉండగూడదా? అయినా ఇటువంటి భ్రమలు సుందరమ్మ – ఈ మధ్యకాలంలో చాలా పడవలసివచ్చింది. బేరీజు వేసి చూస్తే, ఇదివరకు రాజయ్యకు, ఇప్పటి రాజయ్యకు మధ్య చాలా భేదమున్నది. 'ఆ భేదం ఇది' అని తాను స్పష్టంగా చెప్పుకోలేక పోవచ్చు. అంత మాత్రాన భేదం, భేదం గాకుండా పోదే!

సుందరమ్మ తిరిగీ మంచంమీాద పడుకొన్నది. ప్రక్క కుదరలేదు. అటూ ఇటూ మసిలింది. తన గది కిటికీలో ముఖంపెట్టి రాజయ్య నవ్వుతున్నాడు. రక్తం హోరెత్తినట్ల యింది సుందరమ్మకు. ప్రయత్నపూర్వకంగా లేచి వాకిట్లోకి వచ్చింది, ఎవ్వరూ లేరు. నిష్కారణంగా భయపడినందుకు, తనను తనే తిట్టుకొన్నది. "ఇటువంటి పాడుపని ఎందుకు చేస్తాళ్ళే" అని మనసులో అనుకొన్నది. నవ్వుకొన్నది. కానీ ఆ నవ్వులో ఆత్మవిశ్వాసం లేదు. ఆరోగ్యం లేదు. ఏమీా చెయ్యలేక నవ్వినట్లు నవ్వింది. తిరిగి మంచం మీాద కూర్చున్నది. ఒక ప్రక్కగా ఉన్న గ్లాసందుకొని కాసిని మంచినీళ్లు త్రాగింది. మరి కాసిని ముఖంమీాద చల్లుకొంది.

వంటరిగా పోవటానికి తనెందుకు భయపడ్డదో సుంద రమ్మ కిప్పుడు జ్ఞాపకంలేదు. 'ఇటువంటి పాడుపని ఎందుకు చేస్తాళ్ళే' అని తను ఇందాక అనుకొన్నది. ఎటువంటి పాడు పనిని గూర్చి తను అనుకొన్నది? అసలు తనకీ దిక్కుమాలిన అనుమాన మెందుకు కలగాలి? నలభై ఏళ్ళ పై చిలుకు రాజయ్య ఇంకా ఇరవై ఎనిమిదన్నా దాటని తనూ! తన మనసేమీా బాగులేదనుకొన్నది. అందుకే ఇటువంటి ముదనష్ట పాలోచన లొస్తున్నాయి. కాకపోతే ఎన్నడైనా ఎరుగునా తను? ఇంకా నయం! తను చాలా మంచిపని చేసింది. ఈ పాపిష్టి మనస్సుకు తోచిన సంధేహాలన్నీ మనస్సులోనే ఉంచుకొన్నది. ఎవ్వరితోటీ అనలేదు. అన్నట్లయితే తను

ఎంత నగుబాట్లు పాలు కావలసి వచ్చేది? విన్నవారైనా ఇది నమ్ముతారా? రాజయ్య కెంత అప్రతిష్ట వచ్చేది? దిక్కు మొక్కు లేనిదానికి ఇంత ఆధరువు చూపించినందుకు కల కాలం పేరు చెప్పుకొని బ్రతకవలసింది పోయి, అతన్ని నలుగురు నోళ్ళల్లో నానవేయటమా? ఇది ధర్మమౌతుందా? భగవంతుడు ఈ మహాపాపాన్ని క్షమిస్తాడా?

ఈ ఆలోచనలన్నీ రావటానికి గల మూలకారణ మేమిటా అని ఆలోచించింది సుందరమ్మ. "రాజయ్య పిలుస్తున్నాడని" నాగులు చెప్పటం సరిగ్గా ఈ క్షణాన మరొక చిత్రమైన సందేహం సుందరమ్మకు తట్టింది. నిజంగా రాజయ్య పిలిచాడా? పిలిచినట్లు నాగులు చెప్పిందా. కాక నాగులు చెప్పినట్లు తను భ్రమపడ్డదా? తను ఇటువంటి పొరబాటులు-ఇటీవల తరుచుగా పడుతున్నది. మొన్న ఒకసారి ఉప్పు వేసిన పులుసులో తిరిగి వేసి, పులుసంతా ధ్వంసం చేసింది. కాకర కాయ వేపుడు మాడి బొగ్గయిందాక వేపుతూనే ఉన్నది. అంతదాకా ఎందుకూ? ఇందాక రాజయ్య కిటికీలో ముఖం పెట్టినట్లు తను అనుకోలేదూ? తను బైటికి వచ్చిచూస్తే ఎవ్వరూ లేనిదే ఎలా? ఈ నాగులు చెప్పిన మాటగూడా, తను పరధ్యానంగా విని ఉండవచ్చు. అది చెప్పిన దేమిటో, తను విన్న దేమిటోనూ ఇది తన పొరబాటయి ఉంటుం దని మాఫీ చేసుకొన్నది సుందరమ్మ. ఒక చిన్న పొరబాటును నిజమని నమ్మి, ఇంతగా బిడియపడినందుకు ఆమె సిగ్గుపడ్డది ...

ప్రొద్దు వాటాలింది. నాగులు వచ్చి అంట్లన్నీ తోమింది. సుందరమ్మ పొయిలో నిప్పువేసి వచ్చింది రాత్రి వంటకు. ఇప్పటినుండి పూనుకోవాలి. లేకపోతే ఆరు గంటల కల్లా వంట కావడం కష్టం. అంట్లు తోమడం అయిన తరువాత నాగులు కూరలు తరిగింది. తరువాత పాచి వూడ్చింది. నీళ్లు చల్లింది. ముగ్గు వేసింది. దీపాల్లో నూనెపోసింది వెలిగించింది. అప్పటికి ఒక్క చారు తప్ప వంటంతా పూర్తి అయినట్లే! పిల్లలు ఒక్కొక్కరే వస్తున్నారు. భోంచేసి వెడుతున్నారు. ఒకరిద్దరు మట్టుకు 'నారాయణరా' వేడని అడిగారు. రాజయ్య వచ్చాడు. స్నానం చేశాడు. భోంచేసి వెళ్ళాడు. అతను అన్నం తింటున్నంతసేపూ సుందరమ్మ అతనివంకే చూసింది. నెరిసీ నెరియని వెంట్రుకలు కొద్దిగా ముడతలు పడుతున్న ముఖం. ఇతన్ని గురించా మధ్యాహ్నం తను అలా అనుకొన్నది! ఎంత అవివేకం!!

రాజయ్య నిశ్శబ్దంగా భోజనంచేసి వెళ్లిన తరువాత, సుందరమ్మకు మిగిలిపోయిన కాస్త సందేహం రహితమైంది. నిజంగా మధ్యాహ్నం తనను రాజయ్య రమ్మనేడంటే, "ఎందుకు రాలే"దని ఇప్పు డడగడా? ఈ అడగక పోవడం కంటే, తనది 'భ్రమ' అని అనుకోడానికి ఎక్కువ నిదర్శన మేమి కావాలి? అంతా మామూలుప్రకారం జరిగిపోయింది. నాగులు అన్నంతిని రాజయ్యగా రింటివేపు వెళ్లింది. రాజయ్య గదిలో దీపంవెలుగుతున్నదిఅతనేదో కాయితాలు చూసుకోవటం సుందరమ్మకు స్పష్టంగా కనిపిస్తున్నది. తలుపు లన్నిటికి

జాగ్రత్తగా తాళాలు వేసుకొంది. మంచం వాకిలికి లోతట్టుగా వేసుకొంది. తాళాచేతులు భద్రంగా దిండుక్రింద దాచుకొంది. విసనకర్రమీద కాసిని నీళ్లు చల్లుకొని విసురుకొంది. పగలల్లా ఎముకలు విరిగే చాకిరీ చెయ్యటం మూలాన వెంటనే నిద్రపోయింది.

♦ ♦ ♦

ఏదో కల. సుందరమ్మ మెల్లగా అటూ ఇటూ కదిలింది. ఆవిడ కేదో బరువుగా తోచింది. బలవంతాన కళ్లు తెరిచింది సుందరమ్మ. బెడ్ లైట్ ఆరిపోయింది. గాఢాంధకారం, కాటుక పొగలా ఆవరించుకొని ఉన్నది. చల్లనిగాలి వీస్తున్నా ఆమెకు చెమటపోస్తున్నది. చాలా కాలం క్రిందట... ఎప్పుడో...ఏనాడో...తను విడిచిన ... మధురాతి మధురమైన అనుభవం, ప్రచండ శక్తితో తన నిప్పుడు చేరుతున్నది. ఒక మహత్తరమైన స్మృతి నదృశ్యమైన దిప్పుడు. తనకు ఉపలక్షిత మవుతున్నట్లు, తనలో చోటు చేసుకొంటూన్నట్లు తలపోసింది. శరీరం కల్లోలిత సాగరంలాగా అయిపోయింది. మెదడులో విద్యుత్కాంతులు విరిసినట్లయింది. భరింపరాని మాధుర్యమేదో ఆమెను వివశం చేసింది. ఇంద్రచాపపు సప్తవర్ణపు లాలసులామె నయనాలలో కేంద్రీకృతమైనాయి. ఏవో అనూహ్యాలోకాలలో, అనూహ్య సుఖ పారవశ్యములలో, అనూహ్యానంద వీచికా డోలికలలో ఆమె తూగి, జోగి, సోలిపోయింది. సుగంధ సంభరితములైన దేవవాయువులు, జాజ్వల్యమానంగా భాసించే, ప్రచండ

దీధితి పుంజాలు, ఆమె శరీరమంతటా నిండిపోయాయి. అయిష్టంగానే అవుగాక — వాటి నామె అనుభవింపక తప్ప లేదు ...

... మెలకువ, ప్రయత్న పూర్వకంగా కళ్లు దెరిచింది సుందరమ్మ. బెడ్ లైట్ మినుకు మినుకుమంటూనే ఉన్నది. చల్లగాలి వీస్తూనే ఉన్నది. చుక్కలు రెప్ప లార్చుకొంటూనే ఉన్నాయి. ఆమెలో చెప్పరాని అనుభూతావశేషం చురుక్కుమనిపించింది. చివాలున లేవా లనుకొన్నది. సర్వాంగాలు ఆమె స్వాధీనంలో లేనట్లు తోచింది. ఇప్పుడే అదృశ్యమైన ఆ లౌకికానందాన్నింకా అవి వాంఛిస్తున్నట్లున్నాయి. 'ఏదో జరిగింది' అనుకొన్నది సుందరమ్మ. ఏం జరిగింది? ఎప్పుడు? ఎలా?

భయంతో చుట్టూ చూసింది. అంతా యథాతథంగా ఉన్నది. చంద్రుడు తూర్పున మేలుకొంటున్నాడు. వెన్నెల రేకలు విచ్చుకొంటున్నాయి. బూడిదరంగు మబ్బొకటి బరువుగా దక్షిణానికి కదిలి పోతున్నది. గాలి విసురుగా వీచింది. చెట్టుకొమ్మలు కదిలాయి. ఏదో పక్షి వికారంగా అరచి మానేసింది. పశువులు మేత మేస్తున్న చప్పుడు. చిన్ని బుజ్జాయి, వెన్నెలనుచూసి 'అమ్మా' అని అరచింది. ఆ ప్రశాంత వాతావరణాన్ని సుందరమ్మ భరించలేకపోయింది. తత్తరపాటుతో లేచి తలుపుకు గడియవేసుకొని, మంచం మీద జారగిలబడ్డది.

* * *

తెల తెలవారుతుండగా లేచే సుందరమ్మ ఆనాడు జాము ప్రొద్దెక్కిందాకా లేవలేదు. నాగులు వచ్చి పాచి పనంతా పూర్తిచేసింది. తలుపు తట్టి సుందరమ్మను లేపింది. నాగులు తొలి పిలుపుతోనే సుందరమ్మకు మెలకువ వచ్చింది. కానీ ఆమెకు లేవ బుద్ధిగాలేదు. మగతతో అలానే కనులు మూసుకొని పడుకొన్నది. ఏవో ఆలోచనలు చీకిరి బీకిరిగా, అల్లిబిల్లిగా ఆమె మనస్సులో రేగుతున్నాయి. వాటి నన్నింటినీ ఒక క్రమంలోకి సర్దుదామని ఆమె చేస్తున్న ప్రయత్నం ఫలించటం లేదు.

"అమ్మగారూ! అమ్మగారూ!!" అని బిగ్గరగా తలుపు తట్టింది నాగులు.

సుందరమ్మ ఆలోచనలు తాత్కాలికంగా మరుగున పడ్డాయి. బద్ధకంగా లేచింది. ఒళ్లంతా నొప్పులుగా ఉన్నది. కండలు ఎవరో మెలిపెట్టినట్లు బాధతో 'జివ్వు' మంటు న్నాయి. ఒక్కసారి ఆవలించి వళ్లు విరుచుకొంది. నరాలు చిటచిటమని విరిగాయి. గోళ్లతో జుట్టు గీరుకొని ముడివేసు కొంది. జారిపోతున్న కుచ్చెళ్లు తిరిగి పోసుకొని, చెంగు విదిలించి, గడియ తీసింది. ఎదుట అరుగుమీద రాజయ్య కూచుని ముఖం కడుక్కొంటున్నాడు. అతన్ని చూడటానికి సుందరమ్మ బిడియపడ్డది. ఆ బిడియంలో గౌరవంలేదు. తను రాత్రి అనుభవించిన 'కల' అతనికి తెలిసిపోతుందేమో నని త్వర త్వరగా దొడ్లోకి వెళ్లింది, కానీ అది 'కల' గదా! రాజయ్య కెలా తెలుస్తుంది?

సుందరమ్మను చూడంగానే రాజయ్య గూడా అలానే కలవరపడ్డాడు. అతని ముఖాన ఏ భావమూ ప్రస్ఫుటించ లేదు. మామూలుగా, యథాప్రకారం ఉన్నాడు. వండుతున్నా, వార్చుతున్నా సుందరమ్మకు గత రాత్రి అనుభవం స్మృతిపథంలో మెరసి, ఆమెను పులకాంకితను చేసివేస్తున్నది. ఆ వెంటనే ఆమె కా అనుభవంపట్ల అలసతతో కూడిన ఏహ్యత గూడా కలగజొచ్చింది. ఎలానో వంట పూర్తి చేసింది. సెలవులకు పిల్లలందరూ ఇళ్లకు వెళ్లడంచేత ఎక్కువ మందిలేరు. ఉన్న అయిదారుగురకూ త్వర త్వరగా వడ్డించేసింది. తను గూడా భోజనం ముగించింది. మెల్లగా నడుం వాల్చింది.

ఆమెకు రాజయ్య భోజనానికి రాలేదన్న విషయం జ్ఞాపకం రాగానే తత్తరపడుతూ లేచి కూర్చున్నది. అలవాటుగా వచ్చే మనిషి గనుక అతను వచ్చిందీ లేనిదీ గుర్తుంచుకోవలసిన అవసరం లేకపోయింది. ఇలా నడుం వాల్చగానే రాజయ్య అన్నం తినలేదని జ్ఞప్తికొచ్చింది. ఎందుకు రాలేదు? వూళ్లో లేడా? ఉంటే ఉదయంనుండి తనకు కనిపించలేదే! తప్పకుండా వూరికివెళ్లే ఉంటాడు. మామూలుగా అతను ఏదైనా పని ఉండి పొరుగూరు వెళ్లుతున్నప్పుడు సుందరమ్మతో 'ఇల్లు కాస్త చూస్తుండ'మని చెప్పటం రివాజు. అది ఈనాడు పాటించబడలేదు. ఈ విషయము నిర్ధారణ చేసుకునేందుకుగ్గాను సుందరమ్మ నాగుల్నను కేకేసింది. నాగులు పలకలేదు.

"ఓసీ! నిన్నేనే నాగులూ!" అని బిగ్గరగా పిలిచింది సుందరమ్మ.

"ఏంటండీ అమ్మగారూ?" అని కేక వేసిం దది.

"ఏం చేస్తున్నావే? ఇలా రా!"

ఏం చేస్తున్నావనే ప్రశ్నకు నాగులు బదులు చెప్ప లేదు.

"వస్తున్నానండీ!"

"ఏమే! రాజయ్య వూళ్లో లేడా?"

నాగులు గతుక్కుమన్నది. తడబడ్డది.

"నిన్నే నే! రాజయ్య వూళ్లో లేడా అంట"

"ఏమోనండీ!" అన్నది నాగులు. కానీ తను చెబుతున్న దసత్యమని దానికే తోచి తల వంచుకొన్నది.

"దొంగముండ దీనికి తెలియకుండా ఉంటుందా?" అనుకొన్నది సుందరమ్మ. పైకి ఈ భావాన్ని రాకుండా జాగ్రత్తపడుతూ, "ఉన్నాడేమో చూసిరా" అన్నది.

"ఎందుకండీ!" అన్నది నాగులు.

సుందరమ్మ చిరాకును వెలిగ్రక్కుతూ "చూసి రమ్మంటే చూసి రారాదటే! మధ్యలో నీ అడ్డుసవాళ్ళెందుకూ" అని కసిరింది.

నాగులు చూచివచ్చి 'లే'డని చెప్పింది. ఇంకేమన్నా పని చెబుతుందేమో నని అక్కడే నిలబడ్డది.

"సరే వెళ్లు. అన్నానికి రాకపోతేనూ ... "

నాగులు ఒక్క నిట్టూర్పు విడిచి ఉల్లాసంగా అడుగులు వేసుకుంటూ వెళ్లిపోయింది.

ఆ రాత్రిగూడా రాజయ్య భోజనానికి రాలేదు. నాగులు అన్నం తిని వెళ్లిపోయింది. 'పండుకొందువుగాని వుండవే' అని సుందరమ్మ బలవంతపెట్టిందిగానీ అది వుండ లేదు. ఊళ్లో దానికి బంధువులెవరో ఉన్నారట. ఆ ఇంటావిడ ప్రసవిస్తున్నదట. ఏ పరిస్థితుల్లోనూ తనిక్కడ ఉండటానికి వీలుపడదని ఖచ్చితంగా చెప్పివేసింది. దాన్ని ఆపటానికి సుందరమ్మకు మనస్కరించలేదు.

విశాలమైన ఆ ఇంట్లో ఇప్పుడున్నదల్లా ఇద్దరే! పశువులు నెమరువేస్తూ, ఒకదానికంటే మరొకటి బుసలు కొడుతూ పడుకొన్నాయి. రెండు వూరకుక్కలు ఎంగిలాకుల కోసం కొట్లాడుకొంటున్నాయి. బడిపిల్ల లొకరిద్దర్ని 'సాయం పడుకోమని' సుందరమ్మ అడిగింది. ప్రక్క పాలెంలో 'చింతామణి' నాటకం వేస్తున్నారట. వెళ్లాలన్నారు. చీకటిపడుతున్న కొందికీ, ప్రొద్దు పోతున్న కొందికీ అజ్ఞాతభయమేదో ఆవరించి ఆమెను భీతచిత్తను చేస్తున్నాయి. ప్రక్క పరుచుకొని పడుకొందా మనుకొన్నది. గతి రాత్రిలాగా నొక తలుపుకు గడియ జాగ్రత్తగా వేసుకొని పడుకొన్నది. గాలి బంధించింది. ఉక్క వేస్తుండటం మూలాన నిద్ర పట్టటంలేదు. తలుపులన్నీ వేసుకొంటే నిద్రపట్టటం అసంభవమనుకొని కిటికీలు తెరిచింది. ఆకాశం చినిగిన పీలికలా అవుపిస్తున్నది.

చుక్కలు జాలిగా చూస్తున్నాయి. చిక్కని కాటుకలాంటి ఆ చీకటిలోకి చూస్తుంటే, తిరిగి ఆ అజ్ఞాతభీతి ఆమెను ఆవహించసాగింది. అదీగాక, రాజయ్యా ఉదయము, ఈ పూట గూడా భోజనానికి రాలేదన్న ఆలోచన ఆమె మనస్సును పట్టి పల్లార్చుతున్నది. రాజయ్యా తనకెంతో మేలుచేశాడు. సహాయంకోసం అల్లల్లాడిపోతున్న సమయంలో ఆప్తబంధువు లాగా ఆదుకొన్నాడు. అతనా విపత్కర పరిస్థితిలో చేయూత నివ్వకపోతే, తనేమయి ఉండేది ? తన బిడ్డడేమయ్యేవాడు ? ఏమయ్యేవాడో సుందరమ్మ వూహించుకొనే సరికి, ఆమె హృదయం దద్దరిల్లిపోయింది. మరుగుపడివున్న దుఃఖం వెలికురికింది. కొంగుతో కన్నులొత్తుకొన్నది. ఇంతటి సహాయం – ఏ బంధువూ చెయ్యనిదీ, తన వినాశనాన్ని నిరోధించినదీ – రాజయ్యా తనకు చేశాడు. ప్రతిఫలా న్నాశించి చేశాడనుకోవడానికైనా వీలులేదు. తననుండి ఏమాసించి అతను చేశాడు? ఇంకా చేస్తున్నాడు? ఇది కేవలం అతని కారుణ్య హృదయాన్ని తెలియచేయుటం లేదా ? ఇటువంటి ఉత్తమవ్యక్తి దాపులోకి వెళ్లటానికి తనెందుకు భయపడాలి ?

సుందరమ్మ మెల్లిగా లేచింది. హరికేన్ లాంతరు వెలిగించింది. ఒక్కసారి తన వంటివేపు చూసుకొన్నది. తలుపు దగ్గరగా లాగి, గొళ్లెంబెట్టి, లాంతరు తీసుకొని రెండడుగులు వేసింది. ఇంతలో మరొక ఆలోచనేదో ఆమెను గతుక్కు మనునట్లు చేసింది. లాంతరు 'ధగధగ'

మని వెలుగుతున్నది — వూరు అప్పటికే మాటు మణిగింది. పొరుగూరులో నాటకం హాలువద్ద కొడుతున్న డప్పుల చప్పుడు, గాలిలో తేలిపోతూ వినిపిస్తున్నది. అయినా — తను ఇలా లాంతరు తీసుకొని — అపరాత్రివేళ, రాజయ్య ఇంట్లోకి వెళ్ళడం ఎవరన్నా చూస్తే భావ్యంగా ఉంటుందా? నలుగురూ ఏమనుకొంటారు? నిజంగా తమ మధ్య ఏమీలేక పోవచ్చు. కానీ లోకమూ విధంగా అనుకొంటుందా? ఆమె నిత్యమూ ఇతరుల లోపాలను వేలెత్తి చూపించే సంఘం, ఈ సంఘటన నాధారం చేసుకొని, ఏ ప్రచారం చేసినా చేయవచ్చు. తనుకాదని వాదించటానికి గూడా ఆస్కారం లేదు.

ఎందుకయినా మంచిదని సుందరమ్మ వెనక్కు మళ్లింది. తలుపుతీసి, లాంతరు తగ్గించి, గోడచాటుగా పెట్టింది. తలుపులు యథాప్రకారం మూసింది. చుట్టూ జీబురు మంటున్న చీకటి-సుడులు. పశువుల మురుగుడు వాసనతో సహా చల్లనిగాలి ఆమె ముఖాన్ని తాకి, వెనక్కు దూసుకు వెళ్ళింది. రాజయ్య గదిలోని దీపం గాలికి కొట్టుకులాడు తున్నది. ఒక్కొక్క అడుగు ముందుకు వేస్తున్నకొందికీ, క్షుద్రోద్రేకాలు వికారంగా బుసలు కొట్టజొచ్చాయి. తన నెవరన్నా కనిపెడుతున్నారేమో నన్న భయం. అజ్ఞాతంగా ఆమెను పీడిస్తున్నది. కాళ్లు తడబడుతున్నాయి. గుండెలు వేగంగా కొట్టుకొంటున్నాయి. 'ఈ భయానికి అర్థంలేదు' అని తనను తాను సమాధానపరచుకొన

ప్రయత్నించింది. లేనిమాట నిజమే! అని భయపడటం మానలేక పోతున్న దేం?

సుందరమ్మ నిశ్శబ్దాగా రాజయ్య గది గుమ్మంముందు నిలబడ్డది. ప్రయత్నపూర్వకంగా తన్ను తాను సంబాళించుకొంది. ఆవు ఆమెవైపు చూసి (చీకటైనా) 'అంభా' అని అరిచింది. సుందరమ్మ ఆ అరుపుకు ఉలిక్కిపడ్డది. లోప లేదో చప్పుడయింది. సుందరమ్మ మెల్లిగా తలుపు సందులో నుండి లోపలకు చూసింది. బల్లమీద దీపం 'జేగంట' లాగా వెలుగుతున్నది. రాజయ్య వెల్లకితలా పడుకొని, ముఖం మీదుగా చెయ్యి వ్రేలాడవేశాడు. అతను నిద్రపోతున్నదీ లేనిదీ తెలియదు. తలుపు తట్టటం కోసరం చెయ్యి ఎత్తింది సుందరమ్మ. ఏదో జంకు, భయం, వ్యాకులపాటు. తను ఇక్కడి కెందుకొచ్చింది? రాజయ్య భోజనాని కెందుకు రాలేదో తెలుసుకోవటానికిగదా? అది అత్యవసరమని గూడా తను అనుకొన్నదిగదా? అయినప్పుడు అతని దాపులో కెళ్ళడంలో, అనుచితమేమీ లేదే!

ఒకటి రెండుసార్లు తలుపు తట్టినా లోపలనుండి జవాబు రాకపోయేసరికి, సుందరమ్మ తిరిగి తలుపుసందులో నుంచి చూసింది. అతను ఇదివరకు లాగానే పడుకొని ఉన్నాడు. అలాగే చూస్తూ, "రాజయ్యా! తలుపు తియ్యి" అన్నది సుందరమ్మ. ఎంత నిగ్రహించుకొన్నా ఆమె కంఠం కంపించక తప్పలేదు. రాజయ్య కదిలాడు. ముఖంమీద నుండి చెయ్యితీశాడు. ఒక్క క్షణం కళ్లు చికిలించి తలుపువేపు

చూశాడు. బద్ధకంగా లేచాడు. సుందరమ్మ కొంచెం ఎడంగా వచ్చి నిలబడ్డది. 'కిర్రు' మంటూ తలుపు తెరుచుకొన్నది. లాంతరువెలుగు చప్పున వసారాలోకి ప్రసరించింది. ఆమె కుచ్చిళ్లు పాదాలు ఆ వెలుగులో మెరిశాయి. రాజయ్య బైటి కొచ్చాడు. అతనిలో లేచినప్పుడున్న బద్ధకం ఇప్పుడు లేదు.

సుందరమ్మ మాట్లాడలేదు. ఆమెను మరొక భయ మావేశించింది. ఇక్కడ తా మిద్దరూ మాట్లాడుతున్నట్లు ఎవరికయినా తెలిస్తే? ఆమె కంపించి పోయింది.

"ఇలా లోపలకు రా రాజయ్యా!" అన్న దామె, తనూ లోనికి వెడుతూ. రాజయ్య ఆమె ననుసరించాడు. సుందరమ్మ తలుపుకు గడియబెట్టింది. వీధివైపు కిటికీరెక్కలు మూసింది.

"ఇప్పుడు లోప లెవరున్నదీ బైటివారికి కనుపించరు" అనుకొన్న దామె.

రాజయ్య ముఖంలోనికి చూసింది. కళ్లు ఎర్రగా ఉన్నాయి. పెల్లుబుకుతున్న తత్తరపాటును సాధ్యమైనంతగా తొక్కిపడుతో, "ఉదయం అన్నానికి రాలేదేం రాజయ్యా?" అన్నది సుందరమ్మ.

ఇంతసేపూ, ఆమె ఏమీ అడుగుతుందో నన్న భయంతో, తత్తరలాడుతున్న రాజయ్య కాస్త స్థిమితపడ్డాడు. అదీగాక ఆమె ప్రశ్న, ఆ ప్రశ్నిస్తున్న పద్ధతీ అతనికీ మరింత ప్రోత్సాహకరంగా ఉన్నాయి. ఉదయంనుండీ అతన్ని పిరికి

తనం చల్లార్చుతున్నది. వీధిలోకిగూడా వెళ్ళలేదు. ఎంతటి అవమానాన్ని ఎదుర్కొనవలసి వస్తుందోనని అతను హడలిపోయాడు. కానీ అవన్నీ అనవసరమేనని ఇప్పుడతను అర్థం చేసుకొన్నాడు. నిజంగా సుందరమ్మ తననా ప్రశ్న అడగటానికే వచ్చిందా? లేదని ఎవరో అతనికి గట్టిగా చెబుతున్నారు. ఈ అడగడమనేది కేవలం వంకమాత్రమే కాదని అతననుకొన్నాడు. ఇందుకోసమే అయితే, సుందరమ్మ ఇంతదూరం రావలసిన పనిలేదు. నాగులుతో కబురు చేయవచ్చు. కాక బైటనే ఉండి కేకవేసి అడగనూవచ్చు. అలాగాక, లోపలికొచ్చి, తలుపులు మూసి, లాంతరు తగ్గించి మూలగా పెట్టి అడుగుతున్నదంటే, దీనికి వేరే అర్థం వుండాలి. ఆ అర్థమేమిటో గ్రహించటానికి రాజయ్యకు ఎంతోసేపు పట్టలేదు. ఉత్సాహం శరీరమంతటా వెల్లివిరిసింది. సుందరమ్మ నిర్విణ్ణురాలయింది. ఇంతకాలంనుండీ, తను అనవసరంగా భయపడుతున్నా ననుకొంటున్నది కాదని ఇప్పుడు తేలిపోయింది. ఈ 'అపాయం' గురించే అయి ఉంటుంది తను భయపడటం. ఆకస్మికంగా ఈ సంఘటన నెదుర్కొనవలసి రావడంచేత, ఆమె కర్తవ్యతా విమూఢురాలైంది. ఏదో భూతమావేశించినట్లు వణికిపోసాగింది. మైకమేదో ఆమెను చైతన్య విహీనురాలినిగా చేసివేస్తున్నది; రాజయ్య ఒక్క-క్షణం ఆశ్చర్యపోయాడు. సుందరమ్మ తనకోసం వచ్చి ఉంటుందని ప్రథమంగా అనుకొన్నాడు. అయితే తను భ్రమపడ్డా డన్నమాట, చేతులు వణికాయి. కానీ, ఏదో

పాశవికశక్తి అతనిలో అనివార్యంగా విజృంభించింది. దాని ప్రచండశక్తి ముందు అతని వివేకము, మానవత్వము విరాజితమైనాయి. దయాదాక్షిణ్యాలు విలుప్తమైనాయి. నిరుత్సాహపూరితమైన అలసత, పిరికితనం సుందరమ్మను క్రుంగదీశాయి. కోపము, అసహ్యత పెల్లుబికాయి. కానీ వాటిని ఆమెను ప్రదర్శించలేకపోయింది. ప్రచండ వాతూలానికి, ఛిద్రమైన పొదరిల్లులాగైంది. సర్వ విఘ్నలను భగవంతునికి వదిలి ఆమె కళ్ళు మూసుకొన్నది.

సుందరమ్మ విద్యుద్ఘాతం తగిలినట్లు ఉలిక్కిపడ్డది. ఏదో స్మృతి, అలజడిలోంచి త్రోవచేసుకొని ఆమెను చేరవలెనని ప్రయత్నిస్తున్నది. "ఏమిటది? ఏమిటది?" ఆమె కెవ్వన కేక వేసింది. సరిగ్గా గతరాత్రి, తను ఇటువంటి కలనే కన్నది. అందులోనూ, ఇలాగే, ఎవరో ... ఇవే సంఘటనలు, ఇవే అనుభూతులు - అన్నీ ఇలాగే ఉన్నాయి. ఏదో వూహ మెరుపులా ఒక క్షణం మెరసిపోయింది. ఆ స్వప్నంగూడా.... అంతే! పైన ఆమె ఆలోచించలేక పోయింది. సముద్రపు హోరులాంటి ధ్వని, శరీరమంతటినుండీ, వెలువడుతున్నట్లున్నది. మెదడులో దీపం వెలుగుతున్నట్లున్నది.

ఆమె పెదవులు స్పష్టంగా ఏమిటో గొణిగాయి. రాజయ్యకవి వినపడలేదు.

## 9

రోజులు గడుస్తున్నకొద్దీ అత్తయ్యమీద సద్భావం కలగసాగింది నారాయణరావుకు. ఒకటి రెండు పూటలు అతనికి బెరుకు బెరుగ్గా ఉన్నమాట నిజమే! అందరికంటే ముఖ్యుడైన పురుషోత్తంగారితో వాడికి పరిచయమయి ఎక్కువకాలం కాలేదు. అదీగాక రామమ్మంటే ఒక విధమైన కోపంతోను, అసహ్యంతోను వాడిక్కడికొచ్చాడు. ఏమవుతుందోనని వాడిగుండె బిక్కుబిక్కు మన్నది. అయితే ఇవన్నీ కేవలం అపోహలేనని వాడు త్రోసిపుచ్చాడు. పురుషోత్తంగారు వాణ్ణి అమితంగా ఆదరించారు. వాడు వింటుండగా నలుగు రైదుగురతో పొలం కొనే విషయాన్ని గురించి సుదీర్ఘంగా సంభాషించాడు. ఒకటి రెండుసార్లు ప్రొద్దెక్కి వచ్చి, పొలం రిజిస్టరు కెళ్ళాలని చెప్పాడు. మామయ్య తమను గురించి పడుతున్న బాధను చూస్తుంటే ''ఎంత మంచి వాడూ!'' అనిపించిం దతనికి. ఈ అభిప్రాయాన్ని రామమ్మ యథోచితంగా బలపరుస్తూనే ఉన్నది. నారాయణరావును తలంటి పోసింది. కొత్త లాగు, చొక్కా కుట్టించింది. పిండి వంటలు వండి పెట్టింది. ఇవన్నీ తనకోసమే నని నారాయణరావు గ్రహించాక, రామమ్మ మీద ఏ మూలనో మిగిలి వున్న ఆ కాసిని అపోహలు టప్పున ఎగిరిపోయాయి. ఒక్కొక్కసారి ఆమె 'నాయనా' అనీ, 'అబ్బాయ్' అనీ, 'అల్లుడా' అనీ పిలుస్తుంటే నారాయణరావుకు ఏమిటోగా ఉండేది.

అతన్ని చూడటానికి మొగవాళ్ళేగాక, ఆడవాళ్ళు గూడా చాలామంది వచ్చారు. వారందరికీ వైన వైనాలుగా పరిచయం చేసేది రామమ్మ. ఇంతమంది తనను చూడటానికి రావటం చాలా ఇబ్బంది పెట్టేది అతనికి.

వాడు శారదతోనో, శకుంతలతోనో ఏదో ఆడుకొంటుంటాడు. ఆట మాంచి 'రంజు'లో ఉండగా, 'నాయనా! ఒక్క సారి ఇలా రా' అని రామమ్మ పిలుస్తుంది. పోక తప్పదు. ఏదో గదా అని వెడితే, అక్కడ వాణ్ణి చూడటానికొక మనిషి కనిపెట్టుకొని ఉండేవాడు. అక్కడున్న కాసేపూ, వాడికి తన స్వాతంత్ర్యమంతా నమ్మయినట్లు బాధవేసేది. ఎంతో ఒబ్బిడి, మర్యాదగా, అణకువగా కాసేపూ ఉండాలి. ఎంతకష్టం! ఒకసారి ఈమాట అత్తతో చెబుదామని నోటిదాకా వచ్చి, ఆగిపోయింది.

"ఏంవోయ్ రామమ్మా! మీ అల్లుడొచ్చాడట. ఏడీ? ఇలా చూపించు" అని ఎవరో అనటమూ,

"వచ్చాడోయ్ సుబ్బులూ! ఇప్పుడేం వారమయిందిగా వచ్చి. లోపల ఆడుకొంటున్నాడల్లే ఉంది. పిలుస్తానుండు. 'బాబూ! ఒక్కసారి ఇలా రా'' అని అత్త అనటమూ, తను వెళ్ళి నాటకంలో లాగ అక్కడ నిలబడటమూ వాళ్ళడుగుతున్న అర్థంలేని ప్రశ్న లన్నింటికీ జవాబు చెప్పటమూ — ఆలోచిస్తుంటే విసుగెత్తిపోయింది నారాయణరావుకు. కొందరు ఇంతటితో వదిలి పెడతారు. మరి కొందరు ఇంకా సాగదీస్తారు.

"అల్లుడల్లు డనడమేనా — కూతురు నిచ్చేదేమన్నా ఉందా?" అని అడిగేవా రెవరైనా.

"ఇవ్వకపోతే వూరుకొంటారా తల్లీ! ఆడబిడ్డ కొడుకును అట్టిపెట్టుకొని పరాయి సంబంధాలు వెతికితేమట్టుకు దొరుకుతాయీ! ఒకవేళ మే మిచ్చినా, వాళ్ళమ్మ ఒప్పుకో వద్దూ!" అనేది రామమ్మ.

"ఈ కాలంలో అమ్మల మాటలు వినేదెవరమ్మోయ్! పిల్లవాడికీ, పిల్లదానికీ నచ్చితే, వాళ్ళే ముడెట్టుకొంటున్నారుగా!" అనేది అవతలావిడ.

"ఏం నాయనా! మా శారదను చేసుకోవట్రా?" అనేది రామమ్మ అతన్ని దగ్గరకు తీసుకొని తల నిమురుతూ.

వాళ్ళ ధర్మమా అని, చేసుకొనేది లేనిదీ అప్పుడే తెగవేసి చెప్పమనరు. అది కొంత నయమనిపించింది వాడికి. కించిద్భేదంతో ఈ రంగం ఇలానే రోజుకు మూడు మొదలు ఆరుసార్లవరకూ జరిగేది.

వీలు చిక్కితే, అక్కడనుండి బయటపడదా మని చూస్తున్న నారాయణరావును, ఒక్కొక్కసారి రామమ్మే పొమ్మనేది. కొన్నిసార్లు వాడే వచ్చేవాడు. శారద తనకు కానున్న భార్య అని జ్ఞప్తికొచ్చినప్పుడల్లా సిగ్గుతో గిలగిల లాడేవాడు నారాయణరావు. భార్యాభర్తలు ఎట్లా ఉండవలసిందీ, భర్త ఏమి చేయవలసిందీ ... తను చూసిన కుటుంబాలతో సరిపోల్చి చూసుకొంటుండేవాడు. శారదగూడా

ఈ మాటలు విని కొన్ని క్షణాలు సిగ్గుపడేది. తరువాత నిర్మల హృదయంతో ఆటపాటల్లో లీనమయ్యేది. తన వూరు కంటె ఈ వూరు నారాయణరావుకు బాగా నచ్చింది. అక్కడ ఎంతసేపు చూసినా పాతవాళ్ళే పాతముఖాలే! ఇక్కడలా కాదు. అంతా కొత్తకొత్తలుగా ఉంది. ఆ వూరు విడిచి, 'అమ్మ ఇక్కడే ఉంటే బాగుండు' ననుకొన్నాడు నారాయణరావు. ఇంటికి వెళ్ళిన తరువాత మరిచిపోకుండా, అమ్మకు ఈసంగతి చెప్పాలనుకొన్నాడు.

శకుంతల దేమిటిగాని, శారద చాలా తెలివైనదని వాడు విశ్వసించాడు. ఆ పిల్ల దగ్గర అద్భుతమైన బొమ్మల గుడ్డ లున్నాయి. బోలెడన్ని తళుకు లున్నాయి. పూలు ముక్కలు, గాజు ముక్కలు, చిన్న అద్దము, చెడిపోయిన బూర, బలపపుపిక్కలు, చిన్ని వయిలెట్ పెన్సిలూ బొమ్మ లకు చీరలు గట్టి చక్కగా పెళ్ళిళ్లు చేస్తుంది. పాటలు పాడు తుంది. ఇదే దీని దుంపదెగ శకుంతల — ఆట సొంతం కాక ముందే, శనగపప్పో, బెల్లం ముక్కో పెట్టమంటుంది. పెట్టక పోతే ఏడ్చి గోల చేస్తుంది. ఆటంతా పాడుచేస్తుంది. సూర్యంగాడు ఉత్త కూభిరికం. ఎప్పుడూ మట్టి దింటూం టాడు. చీమిడి కారుతుంటుంది. శకుంతల నన్నా భరించ గలడు గానీ, సూర్యాన్ని బొత్తిగా భరించలేడు నారాయణ రావు. అయినదానికీ కానిదానికీ వా డేడుస్తుంటే, అతనికి మండిపోయేది. రామమ్మ విసుక్కొంటూ వచ్చి ఎత్తు కొంటుంది. చీవర నేదే లేకుండా, సమిటతో వాడి మట్టి, చీమిడి

శుభ్రంగా తుడిచేది. ఆవిడ కనీసం ఎందు కసహ్యించుకోదా అనుకొనేవా డతను. తల్లి అంటే ఇదేగావు ననుకొనేవాడు. ఇలా అప్పుడప్పుడు చిరాకెత్తుతున్నా, మామయ్యగా రిల్లు వాడికి ఎంతో సంతృప్తి నిచ్చింది. శాశ్వతంగా ఇక్కడే వుండిపోతే బాగుండు ననుకొన్నాడు.

ఒకరోజున ఉత్తర మొక టొచ్చింది. పురుషోత్తం తెచ్చాడది. బల్లమీద పడేసి లోపలి కెళ్ళాడు. నారాయణ రావు గుణించుకొంటూ చదివాడు. కొంతమేరవరకూ వాడి కేమీ బోధపడలేదు. ఒక లైనులో తన పేరు కనిపించింది. ఆసక్తితో పూర్తిగా చదివాడు. క్రింద తల్లి సంతకముంది. ఉత్తరమంతా ఆమె దస్తూరీ అయితే, అత నెప్పుడో గుర్తు పట్టేవాడు.. ఎవరిచేతనో రాయించింది. చదవట మయితే చదివాడుగానీ, విషయ మేమిటో బోధపడలేదు. అందుకోసం మరొకసారి చదవవలసి వచ్చింది. మ రేంలేదు — సెలవులు అయిపోవచ్చాయి గనుక, నారాయణరావును వెంటనే పంపించవలసిందని ఉన్నది. అందరి క్షేమాలు అడిగింది. ఏమో రాశానని అశ్రద్ధ వద్దన్నది. అతనది చూస్తుండగానే పురుషోత్తం వచ్చాడు.

"ఏమిరా! ఒక్కడివీ పోలేవ్రూ?"

మామయ్య ఇంత పిచ్చివాడని నారాయణరావు ఎన్నడూ వూహించలేదు. తనెందుకు వెళ్ళలేదూ? ఒంటరిగా వెళ్ళలేనని ఎవరన్నారూ? తనిక్కడికి ఒంటరిగా రాగా

లేనిది—ఇక్కడనుండి పోలేడా? కనీసం ఇదన్నా మామయ్య యోచించ డెందుకా—అనుకొన్నాడు.

నిజానికి వాడికి వెళ్లాలని లేనేలేదు. ఈ దిక్కుమాలిన సెలవలు మరొక పదిరోజులన్నా లేనందుకు వాడు మనస్ఫూర్తిగా విచారించాడు. ఆ పది రోజుల తరువాత గూడా, తను వెళ్ళడానికి బాధపడతానని వాడికి తోచలేదు, కొన్ని నిమిషాలపాటు వాడికి బడిమీదా, సెలవులమీదా, ఆగ్రహమొచ్చింది. ఆ ఆగ్రహంలో వాడు శారదనుగూడా కసురుకొన్నాడు.

ఊరికి బయలుదేరే రోజున వాడికి చిత్రమైన దిగులు వేసింది. అందుకు కారణాలు అనేకమున్నాయి. వాటి నన్నింటినీ వాడు విడమరచి చెప్పలేడు. చెప్పినా అవి సకారణాలంటూ ఎవ్వరూ ఆమోదించజాలరు. శకుంతల నత్తిమాటలు ఇంకా వినాలె ననిపించింది. ఇంతకాలమూ, ఎబ్బెడిగా చూసిన సూర్యం మీద ఆపేక్ష కలిగింది. ఎన్నడూ ఎత్తుకోని వాడు, ఆనాడు సూర్యాన్ని చాలాసేపుఎత్తుకొన్నాడు. శారద వాడికి, రంగు తళుకులు, నెమలికన్నూ ఇచ్చింది. పూలు, నెమలికన్ను, కర్పూరమూ ఒకచోట ఉంచి, పుస్తకం మూసి, తెల్లవారి చూస్తే నెమలికన్ను పిల్లలుపెట్టి ఉంటుందట. ఈ మాట తన స్నేహితులుగూడా చెప్పారు. వాడికి నమ్మకం కుదరలేదు. కానీ శారద చెప్పేసరికి హృదయం నిండుగా నమ్మాడు. అందులో శారద ఈపరీక్ష చాలాసార్లు చేసిందట. ఎన్నో నెమ్మలీక పిల్లలను, తన సావాసగత్తెలకు ఇచ్చిందట.

ఈ ఋజువు లివ్వకపోయినా ఫరవాలేదు. తనేమి చెప్పినా 'బావ' నమ్మేస్థితిలో ఉన్నాడని శారదకూడా అనుకోలేదు. ఏదనుకోవటానికైనా దానికెంత ఈడున్నది గనుక!

రామమ్మ ఆ పూట చాలా హడావుడి చేసింది. క్షణం సేపు (నిజంగా కాదు) ఒక్కచోట నిలవడానికి ఆమెకు వీలే చిక్కలేదు. సంచిలో ఏమేమి పెట్టిందో గానీ, గట్టిగా, బరువుగా ఉంది. సుందరమ్మ అడిగినట్లు, కరణంగారి కరేపాకు గూడా ఇంత మూటగట్టింది. పురుషోత్తం వీధిలోకొచ్చి, ఇంటివైపు చూశాడు. నారాయణరావు సంచిని స్తంభానికి ఆనించి నిలుచున్నాడు. 'రావోయ్' అన్న పురుషోత్తం కేక వినిపించిందాక అతను కదల్లేదు. బరువుగా అడుగు వేస్తూ వీధిలో కొచ్చాడు. పిల్లలు, రామమ్మ వీధిదాకా వచ్చారు.

"బస్సొచ్చే వేళయింది. త్వరగా బయలుదేరండి ... బాబూ! మీ అమ్మనడిగానని చెప్పు. తీరిక చూసుకొని ఒకసారి రమ్మను" అన్నది రామమ్మ. ఆమె ఇంకేదో అనబోయింది. సూర్యం ఏడుపు లంకించుకొన్నాడు. ఒక్క కసరు కసిరి, రొమ్మందించి, వాడినిండా పమిటె కప్పింది. శకుంతల 'పావ — పావ' అంటున్నది చప్పట్లు కొడుతూ. శారదేమీ మాట్లాడలేదు. చెల్లెలి రెండు భుజాలమీద చేతులేసి మెదలకుండా నించున్నది. వీధి చివరికెళ్ళి మరొక సారి వెనుదిరిగి చూశాడు నారాయణరావు. శారదమటుకు కనుపించింది.

## 10

నారాయణరావు స్కూలుఫైనల్ ప్యాసయినాడు. ప్యాసయినానన్న సంతోషం, పొందతగినంతగా పొందలేదు. అతను క్రిందటి సంవత్సరం తప్పాడు. ఇంగ్లీషులో నాలుగు మార్కులు తక్కువైనాయి. ఆ మార్కులు వేయించనందుకు, ఆమె రాజయ్యమీద యాష్టపడ్డది గూడాను. ఇదివరకు, రెండు మూడు సార్లు, వేటిల్లోనో, మార్కులు తక్కువయి, ప్యాసుకాకపోతే, రాజయ్య స్వయంగా హెడ్‌మాష్టరు దగ్గరకెళ్లి వేయించాడు. స్కూలు కమిటీ మెంబరు గనుక హెడ్‌మాష్టరు వేయక తప్పలేదు. స్కూలుఫైనలు గూడా అంతే ననుకొన్నది సుందరమ్మ. కాదని ఒప్పించటానికి నారాయణరావు ఎంతో చెప్పవలసి వచ్చింది. వీలైతే రెండు వందలు 'ఖర్చు' పెట్టటానికి గూడా ఆవిడ సిద్ధపడ్డది. నారాయణరావు ఈ పరీక్ష ఎంత త్వరగా ప్యాసవుతాడా అని ఆమె వేగిరపడ జొచ్చింది. నారాయణరావుకు త్వరలోనే పెళ్లి చేయాలని ఆమె అభిప్రాయం. 'ఔ'ననిగానీ, 'కా'దని గానీ నారాయణరావు అనలేదు. అన్నా ఆవిడ లక్ష్యపెట్టి ఉండేదిగాదు. చిన్నపిల్లలు తెలియక లక్ష అంటుంటారు. అవన్నీ మన్నిస్తూ కూర్చుంటే — పనులు జరగవని ఆమె నమ్మకం.

అదీగాక అవతల శాదర రెపరెప ఎదుగుతున్నది. ఈ సంవత్సరం అది ఎటుగూడీ రజస్వల అవుతుంది. రజస్వలానంతర వివాహం తనకొడుక్కు చేయవలసిన అవసరం లేదు.

పురుషోత్తం ఏనాడో ఇస్తానన్నాడు. రామమ్మ మనస్ఫూర్తిగా అంగీకరించింది. ఈ మధ్యకాలంలో రామమ్మ అద్భుతంగా మారిపోయినట్లు సుందరమ్మ గ్రహించింది. ఆవిడ అనాలోచితంగా ఈనిర్ణయానికి రాలేదు. ఇటీవల తను వెళ్లినప్పుడు జాగ్రత్తగా పరిశీలించింది. అయినా నారాయణరావు తప్పాడు. ఈ ఆలోచనలన్నీ ఆవిడ మరొక సంవత్సరానికి వాయిదా వేసింది.

ఈ సంవత్సర కాలంలో ఆమె అనుకోని సంఘటనలెన్నో జరిగాయి. రాజయ్యకు, తనకు ఉన్న సంబంధం ఎట్లాగో వెల్లడయింది. అప్పటికీ ఆమె, అతనుగూడా ఎంతో జాగ్రత్తపడ్డారు. కానీ లాభంలేకపోయింది. అంతమాత్రాన సుందరమ్మ తన సంబంధాన్ని వదులుకోలేదు సరిగదా, ఆ సంబంధాన్ని మరెంత పటిష్టంగూడా చేసింది. ఒకప్పుడు ఆవిడ ఈ రకమైన ఆలోచనలనే, ఏవగించుకొనేది. ఇటువంటి రహస్య సంబంధా లున్నవాళ్ళను, రాల్చి తిట్టేది. ఈ బ్రతుకు బ్రతకడంకన్నా, ఎందులోనన్నా దూకి చస్తే మునిగిపోయిం దేమిటని ఎదురు ప్రశ్న వేసేది. అంతకాలం రాజయ్య ఇంట్లో ఉన్నా, ఆమెలో ఏవిధమైన మార్పూ లేదు. ఆమె శీలాన్ని గురించి, సంశయించటానికి గూడా ఎవ్వరూ సాహసించలేకపోయారు. కానీ ఆ రాత్రి సంఘటనతో, ఆమెలోని పాశవికుద్రేకాలు, తాళ్లు త్రెంపుకొని విచ్చలవిడిగా సంచరించసాగాయి. ప్రతి ఉదయమూ, ఆమె పశ్చాత్తాప హృదయంతో నిద్రమంచంనుండి లేచేది. చాటుగా కుమిలి కుమిలి ఏడ్చేది.

ఎంతో పట్టుదలతో మంచంమీదపడి నిద్రపోయేది. భయంకరంగా తనలో గాండ్రించే ప్రతీప శక్తుల నామె తీవ్రంగా అడచివేసేది. ఏపాపమూ ఎరుగని తన కుమారునకు ద్రోహం చేస్తున్నానని విలపించేది. రాజయ్యగూడా ఇదే పద్ధతి నవలంబించినట్లయితే, ఆ ఘట్టం అంతటితో ముగిసేది. కానీ అతనికి అవసరం లేదు. సుందరమ్మకు సహాయం చేసింది ధర్మ బుద్ధితో కాదని, ఆతను తనకు సమాధానం చెప్పుకొన్నాడు. ఆమె సౌందర్యం తన్నాకర్షించింది. అందుకోసం చేరదీశాడు. ఇందులో పాపపుణ్యాల ప్రసక్తి లేదు. దయాదాక్షిణ్యాల ప్రసక్తి లేదు. ప్రతిఫలాపేక్ష లేకుండా సహాయపడటానికి తను మహర్షి కాదు. అలా పడవలసిన ఆవశ్యకత తనకు లేదు. లోకంలో సుందరమ్మను మించిన అనాథలున్నారు. వారందరికీ తను సాయపడ్డాడా? లేదే! వారివల్ల తనకే ప్రయోజనమూ లేదని తనకు తెలుసు. అందుకే కిమిన్నాస్తిగా పూరుకొన్నాడు. ఇలా గని సుందరమ్మ అనుకోకపోవచ్చు. ఆ దోషం తనది కాదు. తనది కాని తప్పుకు తనెలా బాధ్యత వహిస్తాడు? ఎందుకు వహిస్తాడు?

తన దయా దాక్షిణ్యాలపై సుందరమ్మ జీవితం ఆధారపడ్డదని గ్రహించినప్పటినుండీ, రాజయ్యకు ఆమెపై సర్వాధికారాలూ సంక్రమించినట్లయింది. తను సహాయం చేయకపోతే, ఆమె ఈపాటికి సర్వనాశనమయి ఉండేది. కాగా, తను ఎంతో ఉన్నతస్థితికి తెచ్చాడు. డబ్బు ధారాళంగా ఇచ్చాడు. అవసరమయితే ఇంకా ఇవ్వగలడు గూడానూ,

తనకు 'నా' అన్నవాళ్లెవరూ లేరు. బోలెడంత ఆస్తిఉన్నది. ఏమో! తనకు బుద్ధి పుడితే, అదంతా ఆమెకే ఇవ్వవచ్చు. తనవంటి బంగారు పిచ్చుక వలలో పడ్డందుకు సుందరమ్మ ఎంతో సంతోషించవచ్చునే! కాకపోగా, తనను వ్యతిరేకిస్తున్నది. ఈ చర్యకు బొత్తిగా అర్థం లేదనుకొన్నాడు రాజయ్య. ఆనాటి రాత్రి అతని పట్టునుండి విడిపించుకొని సుందరమ్మ ఇంటికొచ్చి పడ్డది. హృదయం వ్రయ్యలయ్యేలా ఏడ్చివేసింది. తనను తాను తిట్టుకొంది. తల గోడకేసి బాదుకొంది. జుట్టు పీక్కుంది. రెండు చేతులతోనూ గొంతు నులుముకొంది. బావిలో దూకాలని బావివద్దకు వెళ్లింది. లీలగా నారాయణరావు కనుపించాడు. "అమ్మా" అని పిలిచినట్లయింది. తను చస్తే తన కొడుకు గతేమిటి? ఆదరించేదెవరు? అన్నపానాదు లిచ్చేదెవరు? తన అన్న ఉత్తముడైతే — తనకీ దౌర్భాగ్యగతి పట్టేదికాదు. అతని పంచనే పడివుండేది. తన ఈ పతనావస్థ కంతకూ కారణం తన అన్న. అతన్నా స్థితికి తెచ్చినది వదిన. భగవంతు డనేవాడుంటే తన వదినెకు ఘోర శిక్ష విధించక తప్పదు ... లేచి ఇంట్లోకి వచ్చింది. తలుపులు వేసుకొంది. తలుపు ప్రక్కనే రాజయ్య. 'ఓయి భగవంతుడా' అనుకొన్న దామె. అతనితో పోరాడేశక్తి నశించిపోయింది. నీరసంగా కుప్పలాగా కూలిపోయింది.

పొరబాట్లు మానవ సహజం. బుద్ధిపూర్వకంగానో, తద్భిన్నంగానో మానవులెన్నో పొరపాటుపనులు చేస్తుం

టారు. వివేకవంతులు పశ్చాత్తాపడి, దోసగులను సవరించు కొంటారు. అవివేకులు తద్వ్యతిరేకంగా ప్రవర్తిస్తారు. కొన్ని పొరబాట్లు సవరించుకొని వీలుపడనంతటి దుష్ఫలితాల నిస్తాయి. ఆజన్మాంతమూ ఆ పాప ఫలితాల ననుభవించక తీరదు.

సుందరమ్మ ప్రస్తుత మీ స్థితిలోనే ఉన్నది. అయి ష్టంగానే అవుగాక — ఆమె ఈ పొరబాటు చేయక తప్పలేదు. పశ్చాత్తాపంతో క్షాళితమయి, తిరిగి నూతన జీవితం ప్రారంభించాలని ప్రయత్నించింది. అది ఆమెకూ సాధ్యముకాలేదు; రాజయ్య సాధ్యపడేట్లు ప్రవర్తించనూ లేదు. తీవ్రమైన పోరాటాల తరువాత ఆమె బలహీనంగా ప్రతిసారీ లొంగిపోక తప్పటంలేదు. ప్రతిసారీ, ఆమెకు భయంకరమైన గత జీవితాన్ని జ్ఞాపకంచేసి, తన కార్యక్రమం కొనసాగించుకొనేవాడు. ఒక్కొక్కసారి తన కొడుకుకోసం ప్రక్కను తిరిగి నప్పుడు, రాజయ్య తనపక్కలో ఉండేవాడు. కొడుకు దూరంగా మంచంలో పడుకొని ఉండేవాడు. ఆమె హృదయం ప్రయ్యలై పోయేది. భయంతో శరీరమంతా కుంచుకుపోయేది. కొడుకు లేస్తే? ఈ స్థితిలో ఉన్న తనను చూస్తే?...ఎంత బ్రతిమాలినా రాజయ్య వెళ్లేవాడు కాదు. విధిలేక ఆమె చాటుకు వచ్చేది.

ఆమెకోసం రాజయ్య ధనాన్ని విచ్చలవిడిగా వెచ్చించాడు. రాను రాను సుందరమ్మ గూడా అత న్నెదుర్కొనటం మానివేసింది. ఎదుర్కొన్నా, లేకున్నా, ఫలితంలో

మార్పు లేనప్పుడు ప్రయత్నించడం అనవసర మనుకొన్నది. కావాలంటే, తను పదిమందితోను చెప్పుకొని, అతనికి బుద్ధి చెప్పగలదు. అందువల్ల వరిగేదేమిటి? ఆ ఇంటనుండి బైటికి రావాలి వచ్చి మరొకచోట స్థిరపడాలి. అక్కడా ఇటు వంటిదే ఎదురైతే తను చేయగలిగిందేమీ లేదు. ఎదురవదనే నమ్మకం లేదుగదా! అదీగాక రాజయ్యా మొగవాడు. తప్పులు చేయగలడు, చేసి సమర్థించుకోనూ గలడు. అతని గౌరవ ప్రతిష్ఠలకు; ఈ కారణం ఒక విఘాతం కాజాలదు. కానీ సుందరమ్మ పరిస్థితి వేరు. ఇటువంటి చరిత్రగల స్త్రీల జీవితాలు ఎంత దుర్భరంగా అంతమవుతాయో ఎవరికి తెలియదు? పనిగట్టుకొని, తన దోషాన్ని తనెందుకు బహిరంగ పరచుకోవాలి? చెడటమో ఎప్పుడో జరిగిపోయింది. ఇక దాన్ని 'బాగు' చేయటం అసంభవం, అవివేకం. చేయవలసిం దల్లా, ఈ చెడును సాధ్యమైనంత తక్కువ పరిధుల్లో ఉండే లాగా చూడటం.

♦ ♦ ♦

ఈ గొడవతో బాటు నారాయణరావు ఒక సంవత్సరం పరీక్ష తప్పటం. తప్పకుండా ఉన్నట్లయితే సుందరమ్మ ఆ యేడే అతనికి పెళ్ళి చేసేది. అందుకు కావలసిన ఏర్పాట్లు కూడా చేసింది. ఇటీవల రాజయ్యావద్ద తీసుకొన్న రొఖ్ఖ మంతా అలానే ఉన్నది. అతను తప్పాడు. మళ్ళీ చదివాడు. నారాయణరావుకు అర్ధసంవత్సరపు పరీక్షలు జరుగు తుండగా శారద రజస్వల అయినట్లు శుభలేఖ వచ్చింది.

సుందరమ్మకు సంతోషంతోబాటు విచారంగూడా కలిగింది. తన కొడుకుకు రజస్వలానంతరం వివాహం చెయ్యటమా? నలుగురూ ఏమనుకొంటారు?

మానవునకు తన ముఖం తను చూచుకొనే శక్తి లేదు. ఉన్నట్లయితే, తన తప్పులను తనే ముందుగా గ్రహించి, ఆవల ఎదుటివారి స్ఖాలిత్యాల నెత్తిచూప సాహసించి ఉండేవాడు. తన దోష చరిత్ర ఎవ్వరికీ తెలియదని సుందరమ్మ అభిప్రాయపడ్డది. తను శీలవతి ననే నమ్మక మామెకు లేకపోయినా, నలుగురూ అలానే చెప్పుకొంటుంటారని ఆమె నమ్మకం. రహస్యంగా, దారుణమైన దోషాలను మానవులు భరిస్తారు, సహిస్తారు. కానీ ఆ దోషాలు బహిరంగమైతే (ఇంతకాలమూ, రహస్యంగా సహించినప్పటికీ) అందరికన్న మిన్నగా దుయ్యబడతారు. తమ లోపాలు ఇతరులకు తెలియవన్న నమ్మక మున్నంతవరకూ, ఇతరుల లోపాలను ఎత్తి చూపేందుకు జంకరు. అత్యంత సహజమైన ఈ ప్రవృత్తివల్లనే శారద వివాహంపట్ల సుందరమ్మ సందేహాలను వెలిబుచ్చ గలిగింది.

శుభలేఖ వచ్చిన మూడవ రోజున సుందరమ్మ తన పుట్టింటికి వెళ్ళింది. నాలుగు రోజులుండి శారదను తనవెంట తీసుకొచ్చింది, (ద్వితీయ రజస్వల కానిదే పొలిమేర దాటరాదన్న ఆచారాన్ని ఆమె ఖాతరు చెయ్యలేదు) తన ఐశ్వర్యాన్ని, కానున్న కోడలు చూచి, దిగ్భ్రమ చెందాలన్న ఆమె అంతర్గత వాంఛే, ఆమెచేత ఈ పనిని చేయించింది.

తన తల్లి మహాసామ్రాజ్యమిస్తే సంతోషించలేక పోయే వాడేమోగానీ, శారదను తెచ్చినందుకు మట్టుకు అమితంగా సంతోషించాడు నారాయణరావు. ఆ సంతోషం వెనుక ఏ ఉద్రేకాలూ లేవు; ఆవేశాలూ లేవు - శారదను చూడంగానే మొట్టమొదట నారాయణరావుకు కలిగింది ఆశ్చర్యం. అతనింతకాలమూ, అలనాటి పాత శారదనే భావిస్తూ వచ్చాడు. అలా భావిస్తున్నప్పుడు అలౌకిక మైన ఆనందమేదో కలుగుతున్నట్టు అనుభూతి పొందేవాడు. ఇది కేవలం భ్రమకావచ్చు. ఎందుకంటే, ఆ వయస్సులో ఏ స్త్రీని భావించినా, అతని కలాంటి అలౌకికానందమే లభించి ఉండేది. అదృష్టవశాత్తు, అందుకోసమని నారాయణరావు అనేకమంది స్త్రీలను భావిస్తూ, తద్వారా అలౌకికానందాలను, లౌకికానందాలను పొందుతూ కూర్చో లేదు. ఇందుకనేక కారణాలున్నవి. ముఖ్యంగా శారదంటే వాడికి వల్లమాలిన అపేక్ష ఉన్నది. అంతే! ఇది కేవలం అపేక్షయే అవుతుంది. శృంగారానికా అపేక్షతో నిమిత్తం లేదు. సుందరమ్మగూడా కొడుకు మనస్తత్వాన్ని గ్రహించింది. అవసరమయినపుడు, శారద గుణగణాలను, రూపు రేఖలను పొగడటం మానలేదు. (అప్పటికామె శారదను చూచి చాలా సంవత్సరాలైంది) అదీగాక అతనికి పురుషోత్తంగా రింట్లోకల్లా సన్నిహితంగా వచ్చిన జీవి శారద ఒక్కతే! ఆనాడు తనేమి భావించాడో నారాయణరావు ఇప్పుడు చెప్పలేడు. అయినా చెడ్డగా మట్టుకు భావించలేదు.

ఒకనాడు తను చూచిన శారదతో, ఈనాటి శారదను సరిపోల్చుకొన్నాడు నారాయణరావు. ఎక్కడా సంబంధం లేదు. ఆమెకు, ఈమెకు మధ్య ఎంతో భేదమున్నట్లు తోచింది. ఈ భేదం ఉచ్చ నీచాల క్రమంలో కాదు. అప్పటి శారద కేవలం పూవమొగ్గ; ఈవిడ వికసిత కుసుమం. ఎంత ప్రయత్నించినా రెండు బొమ్మలూ అతకటం లేదు. శారద, ఇతని వైపు చూడలేదు. (కంటి తుదినుండి చూసిం దని నారాయణరావు అనుమానం) తల వంచుకొని ఇంట్లోకి వెళ్ళిపోయింది నారాయణరావు తల్లివేపు చూశాడు. సుందరమ్మ అతనివేపే చూస్తూ నవ్వుతున్నది.

ఆ రోజల్లా నారాయణరావు, శారదతో మాట్లాడ లేదు. మాట్లాడించాలని ప్రయత్నించాడు. గొంతెత్తి ఏదో అనవలెనని—చప్పున ఆమె ముగ్ధ రూపం కనిపించేది. మాట గొంతులోనే అణగిపోయేది. బహుశః సుందరమ్మకీ విషయం తెలియకపోవచ్చును. తెలిసికూడా మౌన మవలంబించి ఉండవచ్చు నాగులు ఏవో చిల్లర సరుకులుకోసం బజారు కెళ్ళింది. సుందరమ్మ దొడ్లో వంటచేస్తున్నది. నారాయణ రావు కుర్చీలో కూచుని, డ్రాయరుమీద కాళ్లుబెట్టి ఏదో చదువుకొంటున్నాడు. గప్పున పరిమళవాయువు వీచింది. పుస్తకంనుండి తలెత్తి చూచాడు. ప్రక్క గోడకున్న అద్దం ముందు నుంచొని, రెండు చేతులకూ రాసుకొన్న తల నూనెను వెంట్రుకలకు పట్టిస్తున్నది శారద. నారాయణరావు కనులప్పళించి చూచాడు. స్వేచ్ఛగా ఎదిగిన జుట్టు

మొక్కలా వుంది శారద. ఇదివరకు కంటె పచ్చగా వుంది. నేవళంగా పెరగడంవలన పొడగరిగా కనుపిస్తున్నా ఏమంత పొడగరి కాదు. పచ్చగా, ధగధగలాడుతున్న ముఖం, నున్నని చెక్కిలి, గాజుల చప్పుడు...నూనె రాసుకొని, వేలు ముడివేసుకొని, దువ్వెనకోసం ఇంట్లోకి వెడుతూ నారాయణ రావుని చూసింది. అతనింతసేపూ తనను చూస్తున్నాడని భావం కలగగానే, తల వంచుకొని (సిగ్గుతో) పమిట సరిచేసుకొని, ఒక్కదూకుతో లోపలి కెళ్లింది.

"ఇదివరకటి శారదలో ఈనాజెం లేదు. అది ఉత్త మొద్దు. ఇది తీర్చిన బొమ్మ!"

ఒకరోజు మధ్యాహ్నం నారాయణరావు అన్నం తింటున్నాడు. అతనికేదో కావలసి వచ్చింది. తల్లిని కేక వేశాడు. జవాబు లేదు. తలుపు వెనుక రెండు పచ్చని పాదాలు, తెల్లని పరికిణి కనుపించాయి.

"అమ్మా!" అన్నాడు నారాయణరావు.

"అత్తయ్య లేదు."

నారాయణరావు మాట్లాడ లేదు.

"ఏం కావాలి బావా?"

"పచ్చడి" అన్నాడు అప్రయత్నంగా.

శారద నిశ్శబ్దంగా వెళ్లి, గరిటెతో పచ్చడి తెచ్చింది. వంగి వేస్తున్నప్పుడు, ఇక ఉండలేక తలెత్తాడు నారాయణ రావు. శారద కళ్లు క్షణకాలం విచిత్రంగా మెరిశాయి. నారాయణరావు తలొంచుకొని, ఘోరమైన ఆ పచ్చడితోనే

ఆప్యాయంగా భోంచేశాడు. ఇంకేమన్నా అడుగుతాడేమో నని శారద తలుపుదగ్గరే నిలబడ్డది. అతనేమీ అడుగలేదు. కంటినిండుగా చూడాలనుకొని గూడా, ఆమెవైపు చూడ నన్నా చూడలేదు.

వాళ్లిద్దరి మధ్యా గల అంతరాన్ని భేదించేసరికి, సుందరమ్మ తాతలు దిగొచ్చారు. ఇద్దరూ కలిసి చేయవలసిన పనులు, అనేకం పురమాయించిందామె. "నిండు కాగు ఇంట్లోకి తెండర్రా" అని ఆజ్ఞ నిచ్చిందొకసారి. ఈ ఆజ్ఞ నెందుకు జారీ చేసిందీ శారద యిట్టే గ్రహించింది. నారా యణరావే గ్రహించ లేకపోయాడు. తను ఒక్కడే తీసుకు రావాలని చూశాడతను.

"అలా మూర్ఖపు పట్టు పట్టకు బావా నడుములు బెణుకుతాయి. ఉండు నేను సాయంపడతాను."

'ఒ' ద్దందా మనుకొని గూడా, శారద వచ్చి, ఒక చేతితో కాగును, మరొక చేయి నారాయణరావు భుజం మీద వేసి, 'వూ' మెల్లిగా 'పట్టు' అంటుంటే కాదనలేక పోయాడు. సుందరమ్మ ఫకాలుమని నవ్వింది.

"నీకు సిగ్గెయ్యలేదటే శారదా!" అన్నది సుందరమ్మ.

"నాకు బదులు మా బావే సిగ్గుపడుతున్నాడు. ఇంకా నేనుగూడా ఎందుకత్తయ్యా."

ఈ మాటకు నారాయణరావు గూడా నవ్వాడు. వారం పది రోజులైన తర్వాత శారదను పంపమంటూ

పురుషోత్తం ఉత్తరం వ్రాశాడు. అదృష్టవశాత్తూ అది నారాయణరావు చేతిలోపడ్డది. వాడాఉత్తరాన్ని ఎవ్వరికీ చూపలేదు. బుద్ధిపూర్వకంగా దాచేశాడు. అన్నగారుగూడా శారద విషయం ప్రస్తావించక పోవడమనేది సుందరమ్మకు అట్టే ఆశ్చర్యం కలిగించలేదు. శారద ఒక్కసారిమట్టుకు అనుకొంది. ఆమెకు ఇక్కడ రోజులు హాయిగా గడిచిపోతున్నాయి. ఈ 'హాయి' ఎందువల్ల అనుభవిస్తున్నదో, దానికి కారణమేమిటో శారద చెప్పలేదు. ఒక రకముగా ఆవిడకిక్కడ చాలా బాధ్యతలున్నాయి. కొన్ని సుందరమ్మ కల్పించింది. మరికొన్ని తనకుతనే పైనవేసుకొంది. నారాయణరావు స్నానము, భోజనము, చదువు వగైరాలు ఇప్పుడు శారద ఆధ్వర్యం క్రింద సాగిపోతున్నాయి. ఇటువంటి డైరెక్షన్‌కు లోపడి ఉండటం నారాయణరావుకు ఎంతో ఆనందాన్నిచ్చింది. శారద ఇక్కడే ఇంకొంత కాలముంటే బాగుంటుం దనుకొన్నాడు నారాయణరావు. అదీగాక ఆవిడ ఇంటిపనుల్లో తల్లికి, ఏమాత్రమో సాయపడుతున్నది కూడాను. ఇక ఎటుగూడీ, కొద్దిరోజుల్లో శారద ఇక్కడకే శాశ్వతంగా రానున్నది. ఆరాకకు, ఇది 'తొలిపలుకు' లాగా ఉపయోగపడుతుం దనుకొన్నాడు నారాయణరావు.

ఈవేళ రామమ్మ రామమ్మలాగా లేదు. అగ్గికొండలా భగ్గుమంటున్నది. తనకోపాన్ని కనపడిన ప్రతివస్తువుమీదా చూపించింది. నిష్కారణంగా శకుంతలను పట్టుకు కొట్టింది. సూర్యానికి ఉదయంనుండి ఇంత కాఫీగా గుడ్డా పెట్టలేదు.

పురుషో త్తం తెల్లవారుజాము ననగా వెళ్లాడు. మధ్యాహ్న మైనా లేదు. తల్లికి కోపమొస్తే లంకిణి అవుతుందని శకుంతల ఏనాడో గ్రహించింది. ఉదయంనుండి, అది పొరుగిళ్లలో గడుపుతున్నది. అర్భకుడు — సూర్యం గాడే, తల్లి స్వభావాన్నర్థం చేసుకోలేక, మాటిమాటికీ దెబ్బలు తింటున్నాడు. తమ్ముణ్ణి బైటికి రమ్మని శకుంతల రెండు మూడుసార్లు కేక వేసింది. బహుశః వాడికా కేకలో విశ్వాసం కనిపించలేదేమో మరి, అక్క వెంట వెడితే, తన ఆకలి తీరుతుందనే నమ్మకం వాడికి కలగలేదు. తమ్ముడు రానందుకు శకుంతల కోపగించుకొంది. నిజంగా అది కోపం కాదు. ఆ కోపంలో కోపంకంటే జాలి ఎక్కువ పాలు ఉన్నది. వాడికోసం విచారించటం మినహా మరేమీ చెయ్యలేని స్థితిలో ఉంది శకుంతల.

"నా గొంతులో ఊపిరుండగా నా కూతుర్ని వాడి కివ్వను."

ఈ మాటలు పదే పదే అనుకొన్నది రామమ్మ. భర్తతో గూడా ఆ మాటే చెప్పింది. పురుషోత్తం ఆశ్చర్య పడలేదు. భార్యనుండి ఇంతకంటే మించి మాట వస్తుందని అతను గూడా ఆశించలేదు. ఆ మూడుముళ్లు పడిన తరు వాత ఏమైన, అతనికి అభ్యంతరం ఉండకపోను. దురదృష్ట వశాత్తూ, ఆ రహస్యం కాస్తా ముందే రామమ్మకు తెలిసి పోయింది.

"అటువంటి గుడిసేటిదాని కొడుక్కు నా బిడ్డనివ్వను. చూస్తూ చూస్తూ దానిగొంతు కొయ్యటానికి నేనొప్పుకోను. అవతల నీకేమైనా కోపమొచ్చేది" అని ఖండితంగా చెప్పివేసింది రామమ్మ.

"నేనప్పుడే అనుకొన్నాను. ఇన్నిన్ని వేలు ఎట్లా సంపాయిస్తున్నదా — అని, నీచెల్లెలు హోటలుబెట్టి రెండు చేతులా ఆర్జిస్తున్నదని — నీవంటి తలమాసినవాడు తప్ప ఎవ్వడూ నమ్మడు. సంపాదించిన ఆ డబ్బు నా కూతురుకు వద్దు; నాకూ వద్దు. ఇక వాళ్లు నా యింటికి రావటానికే వీలులేదు. వస్తే పేడకళ్ళాపి ముఖాన కొడతాను. నేనన్నంత పని చేస్తాను" అన్నదామె.

పురుషోత్తం ఏదో సర్దబోయాడు. కానీ ఆ పని అతని వల్ల కాలేదు. చెల్లెలి ప్రవర్తనపట్ల అతనికేనాడో అనుమానమున్నది. చూచాయగా తానూ విన్నాడు. ఒకప్పుడామాటలతను విశ్వసించలేదు. పనిగట్టుకొని ఒకసారి వెళ్ళాడు. నారాయణరావు సైప్రివేటు చదవటానికి పోయాడు. తనకు గదిలో వేసింది మంచం, సుందరమ్మ నడవలో వేసుకొన్నది. అతను బాగా నిద్రపోయిన నమ్మకం కలగగానే సుందరమ్మ లేచింది. తను ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నాడు. రాజయ్య సొరబాలో షికార్లు తిరుగుతున్నాడు. ఆ తిరగడం సుందరమ్మకోసమేనని తనకు తెలుసు. ఇద్దరూ కలిసి లోపలకు పోయారు. తెల్లవారుజామునగానీ సుందరమ్మ తిరిగి రాలేదు. తనకానాడు కలిగిన కోపం తలుచుకొంటే, ఇప్పటికీ వణి

పోతాడు. జన్మలో ఎప్పుడూ ఎవ్వరిమీద తన కంత కోపం రాలేదు. దొంగముండ! తనకు అనుమానం కలగకుండా ఉండాలని గావును — నాగులును తన మంచంమీద పడుకోబెట్టింది. అప్పుడే దాన్ని నరికిపారేద్దామనుకొన్నాడు. తరువాత పోలీసులు పట్టుకోవటం, కేసు, కోర్టులో — అది వేరే సంగతి.

బావుంది!

కానీ, ఆ పని చేసే హక్కు తన కెక్కడున్నది? ఎవరిచ్చారు?

"నావల్ల నీకు అంతగా తలవంపులు ఉంటే—నా ఇంటికి రావద్దు. నన్నుగానీ, నా బిడ్డను గానీ నీ ఇంటికిగూడా రానివ్వకు."

అని సుందరమ్మ ఖరాకండిగా చెబుతే, తనేమౌతాడు? తల ఎక్కడ పెట్టుకోవలసి వచ్చేది? అవమానం దానికేనా? తనకు కాదూ? ఫలానా పురుషోత్తంగారి చెల్లెలు పోరంబోకుదని పదిమంది చెప్పుకోటం తనకు మట్టుకు నష్టమా? దాన్ని తనెంత ఘోరంగా అసహ్యించుకొంటున్నదీ. ఈవిడ కేం తెలుసు? ఇంతా తెలిసికూడా నారాయణరావుకు తన కూతురు నివ్వటానికి సిద్ధపడుతున్నా డంటే — ఎందుకో నని కాస్తంత విచారించనన్నా విచారించదేం? మంచిగానీ చెడ్డగానీ సుందరమ్మ ఇంత సంపాదించింది; ఇంకా సంపాదిస్తున్నది. ఈ రోజున దానికీ వూళ్లో ఉన్న పలుకుబడి, తనకు లేదు. దాని కన్న పుట్టుబడి గూడా తనకు లేదు.

నోటూ పత్రం లేకుండా పదివేలు తీసుకురాగలడు; ఇవ్వనూ గలడు. అదే ఆడుక్కోకపోతే ఈసరికి తను ఎక్కడుండేవాడో, ఏం చేస్తుండేవాడో భగవంతుడికి గూడా తెలియదు. గౌరవ గౌరవాల సంగతి ఎవడికాక్కావా లీ రోజుల్లో? గౌరవంగా ఉన్న పలుకుబడి తనకు లేదు. దానికున్న పెట్టుబడి గూడా తనకు లేదు. గౌరవంగా నిలుక్కు చస్తున్న తనేం బావుకుంటున్నాడు! అన్నిటికీ నానా గడ్డి కరస్తున్నాడు. సుందరమ్మ తలచుకొంటే ఈనాడు తన కుటుంబంలాంటివాటిని చులాగ్గా పదింటిని పోషిస్తుంది...

ఈ సంగతులన్నీ భార్యకు చెప్పాడు పురుషోత్తం. అయినా రామమ్మ వినలేదు.

"డబ్బున్నది గదా అని—నా బిడ్డను ఆ గూడెంలో పడెయ్యలేను. నీ కది ఇష్టమయితే అయిందేమో నాకు కాదు" అన్నదామె పై పెచ్చు.

"ఇప్పుడు పిల్ల పెళ్ళి చెయ్యటం సాధ్యంకాదు, బోలెడంత కట్నమిచ్చుకోవాలి. పెళ్ళిఖర్చులుగూడా ఇదెట్లా చేయగలం?"

"దోవనబొయ్యే ముష్టివాడి కివ్వండి. నేను సంతోషిస్తాను."

"పిల్ల నివ్వలేదన్న కచ్చతో, తనడబ్బు రెండు వేలూ ఇమ్మని సుందరమ్మ యాగీపడితే మనంచేయగలిగిం దేమిటి? ఇల్లు అమ్మవలసిందే గదా?... ఎందుకొచ్చిన బవవతే ఇవన్నీ! ఆ గాకీ గొడవా వుండదు. కట్నాలు, కానుకల

గొడవా వుండదు. హాయిగా వాడికిచ్చి ముడిబెడదాం. తల్లిలాగానే బిడ్డలుగూడా వుంటారని రుజువేమిటి? మీా అమ్మ మహాశాంతంగా వుండేమనిషి. నివ్వింత గయ్యాళి వైనావేం? నా మాటవిని..."

జై మంటూ మధ్యలోనే అందుకొన్నది రామమ్మ. అంతగా డబ్బడిగితే, ఇల్లమ్మిపారేయమం టన్నది. నువ్వింత అసమర్థుడివి గాకపోతే—అసలు బాకీ ఎందుకవుతుం దన్నది. ఏడుపుడబ్బు కాసించి కూతుర్ని గూడేల్లోకి తోలడానికి సిగ్గయినా లేదా అన్నది. సాసించి చదును చేసింది. దుమ్ము రాల్చిపోసింది,

తథాస్తు.

"ఇక లాభంలేదు" అనుకొన్నాడు పురుషోత్తం' శారదను రహస్యంగా చాటుకుపిలిచి మంతనా లాడదామనుకున్నాడు. తనకు మట్టుకు, సుందరమ్మమీాద, నారాయణ రావుమీాద — ప్రాణం పీకి కాకుగదా ఇవ్వటం! ఇంత 'లగ్గు' ఉంది. అంటే! ఏ గౌరవమూా ఇవ్వలేనిది డబ్బ ఇస్తుంది. అది చెయ్యలేని పనంటూా లేదు. దానికసాధ్యమైన దేదీ లేదు. కొండమీాది కోతి నదిక్రిందికి దింపుతుంది. అంతేగాదు ఆ కోతి మనిషని పదిమందిచేతా అనిపిస్తుంది. ఎక్కడలేని తెలివితేటలనూా పుట్టిస్తుంది. ప్రపంచమంతటి చేతా జోహారు చేయిస్తుంది. ఆ సంగతి తనకు బాగా తెలుసు. డబ్బులేనివాడు చావటానికి గూడా అనర్హుడే. వాడికెన్ని తెలివితేటలున్నా, ఉత్త మొద్దువెధవే! ఎందుకూ

పనికిరానివాడే! విజ్ఞానం, సంప్రదాయం, ప్రవర్తన, గుణ గణాలనుబట్టి, ఈ రోజుల్లో ఎవరు గౌరవిస్తున్నారు? మన దగ్గరున్న డబ్బునుబట్టే, మనకు గౌరవాగౌరవాలు లభిస్తుంటాయి. మనమెట్లా సంపాదించామన్న ప్రశ్న లేనే లేదు. ఉన్నదాని నడిగేందుకు ఎవ్వరూ సాహసించరు. కావలసిందల్లా మన దగ్గర ఎంత డబ్బున్నదనేనూ, ఇవన్నీ—ఇంట్లో ముడిగి చచ్చే ఆడముండలకేం తెలుస్తాయి? తెలియవయ్యాపోనీ తెలిసినవాడు తను చెబుతున్నాడు వినిపించుకోగూడదూ?

డబ్బు ఏపనైనా చేయించగలదని గట్టిగా నమ్మేవాడు పురుషోత్తం. అందుకే డబ్బుకోసం ఏ పని చేయటానికైనా సిద్ధపడ్డాడు. డబ్బు విషయంలో అంత గుడ్డి విశ్వాసములున్న ప్రతివాడూ, దానికోసం అంత గుడ్డితనంగానూ ప్రవర్తిస్తాడు. అంత మాత్రంచేత పురుషోత్తం —— ఉత్త డబ్బు పీనుగని ఎవ్వరూ అనరు. భయంకరమైన దారిద్ర్యంలో సంవత్సరాల కొండికీ అతను కుతకుతలాడిపోయాడు. తత్కారణాన అతనికి డబ్బంటే మహత్తరంగా కనిపించి ఉండవచ్చు. కాబట్టే చెల్లెలి ప్రవర్తనను మనస్ఫూర్తిగా సమర్థించాడు. అథవా సమర్థించకపోయినా — ఆటంకపరచలేదు. పుషోత్తం ఉత్త వాజెమ్మగా నిర్ణయించుకోబోయే ముందు (ఎవరైనా సరే) అతననుభవించిన దారిద్ర్యాన్ని గూడా జ్ఞప్తికి తెచ్చుకోవలసి ఉంటుంది అతను గూడా పౌరుషానికి, అభిమానానికి తక్కువ పడ్డవాడు కాదు.

అయితే, అతని పౌరుషాభిమానాలను దరిద్రం క్రూరంగా అణచివేసింది. ఈ విషయం విస్మరించి, పురుషోత్తాన్ని దుయ్యబట్టటానికి సిద్ధపడటమంటే — అంతకన్నా అర్థ రహిత కార్యం మరొకటుండజాలదు.

ఈ గొడవంతా సుందరమ్మతో చెప్పటం ఎంతమాత్రం భావ్యం గాదని పురుషోత్తానికి తెలుసు. శారదను ఇవ్వక పోవటానికి బలమైన కారణం — అందులోనూ సుందరమ్మ నమ్మగల కారణం — ఒకటి కావాలి. సుందరమ్మను ఏదో విధంగా సంతృప్తి పరిస్తే — తన పబ్బం మరికొన్నాళ్లు గడుపుకోవచ్చు. నిజమే! కానీ తనేం చెబుతాడు? ఏం చెబితే సుందరమ్మ విశ్వసిస్తుంది?

# 11

ఆ పూట నారాయణరావు భోంచెయ్యలేదు. తిందామనే అన్నంముందు కూర్చున్నాడు. రెండు మూడు ముద్దలు తిన్నాడు. ఇంతలో ఇందాక ఎవరో అనుకొంటున్న మాటలు జ్ఞప్తికొచ్చాయి. గుండెలు గతుక్కుమన్నాయి. చప్పున రెండుగుటకల నీరుతాగి చెయ్యి కడుక్కున్నాడు. సుందరమ్మ 'ఎందుకురా?' అంటూనే ఉంది. ఎందుకో నారాయణరావు చెప్పలేదు. కొద్దిరోజులనుండీ అతను తల్లితో సరిగ్గా మాట్లాడటంలేదు. విధిగా మాట్లాడవలసినప్పుడు, ముక్తసరిగా మూడుముక్కల్లో తేల్చాలంచూసేవాడు. ఆమె ఎదురొస్తే అతనిముఖంలో అసహ్యం అగ్రాడుతుండేది. పెదవులదిరేవి.

కళ్లు ఎఱ్ఱబడేవి. తలచుకొని విసవిసా నడిచిపోయేవాడు. సుందరమ్మ 'ఎందుకా' అని మొదట కొంతవిచారించింది. ఆమెకేమీం తోచలేదు. తోచిన సమాధానం బలంగా, వికృతంగా, ఘోరంగా ఉన్నది. దురదృష్టవశాత్తూ అదే సమాధానమైతే, తనిక ఏముఖంతో కొడుకును చూడగలదు?

ఒకసారి జరిగిన కర్మకాండంతా కొడుకుతో చెబుదామనుకొన్నది. కానీ సాధ్యమా అది? ఆపని చేయగలదా? కొడుకుతో—అంటే—తన ప్రతిబింబముముందు, తన ఘోర గత చరిత్రను ప్రదర్శించగలదా? లేదు. ఏదో ఆవేశంలో ఆమె అలా నిర్ణయించుకొన్నది. ఆలోచిస్తే ఆ నిర్ణయం చాలా అనుచితంగా గోచరించింది. ఒకవేళ—తను అనుకొంటున్నదే సరైన కారణం కాకపోవచ్చు. ఆనాడు తనేమవుతుంది? నీచకార్యం చేయుటమే కాక, అలా చేశానని కొడుకుతో గూడా చెప్పుకోవటం—ఒహ్హో! ఎంత భయంకారం!!

ఈ రహస్యం ఇలా ఎంతో కాలం కొనసాగక పోవచ్చు. ఎప్పటికో అప్పటికి నారాయణరావు దీన్ని తెలుసుకోవచ్చు. ఆనాడు తనను...కాబట్టి ఇప్పటినుండీ తనెందుకు దాన్ని కలిగించాలి?

పురుషోత్తం వచ్చాడు. చెల్లెలితో చెప్పవలసిన వేవో చెప్పి, "నీ అభిప్రాయ మేమిటి?" అన్నాడు.

"నాదేముందన్నయ్యా! అబ్బాయి నడుగు. మరి వాడిష్ట మేమిటో గూడా కనుక్కో—" అన్నదామె.

"అఁహ, అదిసరే" అన్నాడు పురుషోత్తం.

వాణ్ణి అడుగుతాను. ముందు నీ సంగతి తేల్చు. శారదను ఏడి కివ్వటానికి నా కే అభ్యంతరమూ లేదు. నువ్వు కావాలంటే—నే నిక్కడే ఉండి దాన్ని పిలిపిస్తాను. ముడెట్టించు. నేను కాదనను, నే ననేదేమిటంటే, నారిగాణ్ణి మనం చేతులారా పాడుచెయ్యట మెందుకా అని వాడేమో ఇంకా చిన్నవాడు— అంటే—శారద తగని వాడని కాదు. ఆ మాటకొస్తే ఆ ఇద్దరి జోడూ బ్రహ్మాండంగా ఉంటుందనుకో, దానివల్ల అయిందేమిటి? నారిగాడి చదువు కడట్టిపోతుంది. అందులో శారద ఈడేరిన పిల్లాయె, కాపోసంచేయక తప్పదాయె. ఏదో చెబుతారు వినలా— "వివాహే విద్యానాశాయ, శోభనే సర్వనాశనం" అని, అబ్బిగాడి చదువు గిడసబారిపోతుంది. నువ్వున్నంతవరకూ వాడికి ఢోకాలేదు. నీ తరువాత వాడిగతేమిటి? నువ్వయినా కోట్లు గడించటం లేదుగదా? ఈ దిక్కుమాలిన హోటలుకు — అప్పుడే పోటీలు గూడా తయారయ్యె. ఆ ఉన్న నాలుగు రాళ్లు చెల్లిపోయిన తరువాత నీ కొడు కేం చేస్తాడు? ఎలా బతుకుతాడు."

మధ్యలోనే సుందరమ్మ అందుకొని, "నాలుగెకరాల పొలం కొంటాను" అన్నది తనలో తను అనుకొంటున్నట్లు.

"ఓసి పిచ్చిదానా, పిచ్చిదాన" అన్నాడు పురుషోత్తం ఓ నవ్వు నవ్వి. "నువ్వాపని చెయ్యావనిగాదే నే నంటున్నది! చేస్తావు. కానీ అది మొగతన మనిపించుకోదు. మరి వూరికే అన్నారా మన పెద్దలు "ఉద్యోగం పురుష

లక్షణం'' అని. ఈ దిక్కుమాలిన స్కూల్‌ఫైనల్ చూసి ఏ ఉద్యోగమిస్తారు? నామాట విను. పదిమంది కట్టిన ఇంట్లో ఉండి చెబుతున్నాను. శారదను నారిగాడి కివ్వగూడదని నా కేకోశానా లేదు. నువ్వు కాదు కూడదంటే అలాగే చేసుకో. అయితే నేను చెప్పిందిగూడా బాగా ఆలోచించు. వాణ్ణి బాగా చదివించు. ఇంత ప్రయోజకుణ్ణి చెయ్యి. శకుంతల ఉండనే ఉంది. మనవాడు బి. ఏ. చదివేనాటికి శకు అక్కర కొస్తుంది. ఇది అన్నివిధాలా నీ మేలు. ముఖ్యం నారాయణరావు మేలుకోరి చెబుతున్నాను. మనవాళ్ళందరి చదువులూ గొర్రెతోకలే! కాస్త పీడన్నా ప్రయోజకుడవుతా డనుకొంటుంటే, వాడి మెడకిప్పుడే పెళ్ళాన్ని కట్టాలంటున్నావు నువ్వు. సంసారాలు తెలగబెట్టి మనం బావుకొంటున్నది చాలదూ? ఈ నూతిలో కిప్పుడే వాణ్ణి దించాలంటే?''

ఈ వాదన సుందరమ్మ కంతగా నచ్చలేదు. అయినా సబబుగానే ఉంది. ఆవిడే నిర్ణయమూ చెయ్యలేదు. కొడుకు చదువుకొంటానంటే చెప్పిస్తుంది. కాదంటే పెళ్ళి చేస్తుంది.

నారాయణరావు చాలాసేపు ఆలోచించాడు. కొద్దికాలం క్రిందటయితే, పెళ్ళికే ఒప్పుకొనేవాడు. కానీ ఇప్పుడలా అనిపించలేదు. గమ్మత్తుగా అతని మనస్తత్వం మారిపోయింది. ఒక్కసారిగా ఆడవాళ్లంతా దుర్మార్గులు, దుశ్చరితలు, అన్న నిర్ణయానికొచ్చాడు. ఈ క్షణాన వాడికి ఆడదంటే అందరాని వస్తువైంది. ఎవరో మతబోధకు డన్నట్టు

"ఈ లోకంలో ఉన్న దుర్మార్గానికి, దుష్టత్వానికి, సకలానర్థకాలకు మూలకారణం స్త్రీ. సైతాను, మానవులను పతితులను, చేయటానికై సృష్టించిన జీవం స్త్రీ" అన్న నిశ్చయాని కొచ్చాడు. ఈ నిశ్చయంలో, లోకంలో ఉన్న అందరి స్త్రీలతో బాటు శారదకూడా ఉన్నది. కొన్ని నిముషాలపాటు, శారద రూపం, మాటలు, ఇద్దరి మధ్యనా గల అనురాగాలు అతన్ని కలవరపెట్టాయి. కానీ, పై ఏహ్యాభావంవల్ల వాటి నన్నిటినీ బలవంతంగా అణిచివేశాడు. అసలు తనకు వివాహమే అక్కర లేదన్నాడు. అవసరమని తన్నెప్పుడన్నా భావిస్తే, అప్పటి సంగతి ఆలోచించుకో వచ్చు లెమ్మన్నాడు. పురుషోత్తంగారు హర్షం ప్రకటించారు. సుందరమ్మ ఏమీ అనలేదు అనుకోనూలేదు. శకుంతలను తప్పకుండా ఇస్తానని చెల్లెలికి వాగ్దానంచేసి, పురుషోత్తం వెళ్లిపోయాడు.

## 12

నారాయణరావు ఎక్కడ చదవాలన్న సమస్య వచ్చినప్పుడు ముగ్గురు, మూడు రకాల అభిప్రాయాలు ఇచ్చారు. సుందరమ్మ గుంటూరులో చదవ మంటుంది. రాజయ్య బెజవాడ అన్నిటికీ బాగుంటుం దన్నాడు. ఇందులో అతని స్వార్థ మేమీ లేదు. బెజవాడలో అతనికి తెలిసినవాళ్లున్నారు. అదీ కథ. మూడో అభిప్రాయం అంత గణించదగింది కాదు. ముగ్గురూ కాసేపు వాదులాడుకొన్నారు. తుది నిర్ణయం నారాయణరావు కొదిలేశారు.

"నేనిక్కడ చదవను" అన్నాడు నారాయణరావు. ఒకరి నొకరు చూచుకొని "ఎందుకని?" అన్న దొక కంఠం.

"ఎందుకనైనా! నే నిక్కడ చదవను."

"అదిగాదురా" అన్నది సుందరమ్మ.

"ఇక్కడైతే దగ్గర. అంది పుచ్చుకొంటున్నట్టుంటుంది. ఎప్పుడు రావాలన్నా రావచ్చు. అప్పు డప్పుడు నేనూ వచ్చి పోతుంటాను."

"అందుకనే ఇక్కడ వొద్దంటున్నాను. పట్నంలో చదవాలని నా కుంది."

సుందరమ్మ గతుక్కుమన్నది. నారాయణరావు తన నుండి రోజు రోజుకూ దూరమై పోతున్నాడు. పోవటంలేదని తను భ్రమపడ్డది. ఆ భ్రమ ఈనాడు విచ్చిపోయింది తనను తన ఉనికిని నారాయణరావు ఏవగించుకొంటున్నాడని స్పష్ట మవుతూనే ఉన్నది. కాకపోతే, దగ్గరలో ఇన్ని కాలేజీలుంటే పట్నం పోతా ననట మెందుకు?

సుందరమ్మ కాదనలేదు. అన్నా ఫలిత ముండదని ఆవిడ కెవరో గట్టిగా చెబుతున్నారు. మనస్ఫూర్తిగా కాక పోయినా—పట్నం వెళ్ళటాని కంగీకరించింది. నారాయణ రావు వైఖరి చూస్తే అలా ఒప్పుకోకపోనటం అన్యాయమని ఆవిడకు తోచింది. ఇక్కడున్నందువల్ల కొడుకు నేవో బాధలు బాధించగల వన్నట్టు— తను అర్థం చేసుకున్నది. ఆ బాధలు 'ఇవి' అని ఆమె స్పష్టంగా చెప్పలేనిమాట నిజమే!

కాబట్టి కొడుకు అనవసరంగా అలా కోరాడని తను సరిపెట్టుకోగలదా ?

ఆ రాత్రల్లా సుందరమ్మ ఏదో సర్దుతూనేవుంది. రెండు మూడు పుస్తకాలు తప్ప ఇకేవీ (గుడ్డలుకాక) వద్దన్నాడు నారాయణరావు. సుందరమ్మ రెండు ట్రంకులు సామాను సర్దింది. పదిరోజులపాటు నిలవుండే పిండివంటలకే ఒక పెట్టె సరిపోయింది. నారాయణ చెప్పినా ఆమె వినిపించుకోలేదు. 'ఆమె ధోరణే అంత' అనుకున్నాడు నారాయణరావు.

"డబ్బు తీసుకున్నావట్రా ?"

అతను మాట్లాడలేదు. సమాధానంకోసం కొన్ని క్షణాలు చూచి, ఆమె లేచివెళ్లి ఇనప్పెట్టె తెరిచింది. ఎక్కడి నోట్లక్కడ భద్రంగా ఉన్నాయి. ఇందాక తను అడిగినప్పుడు 'తీశా' నన్నాడు. మరి తియ్యలేదన్నమాట. "ఎందుకనో ?" అనుకొన్నది సుందరమ్మ. ఒక్క నిట్టూర్పు విడిచి గబగబా నోట్లు లెక్కించి, తలుపులు వేసి ఇవతలికొచ్చింది. నారాయణ రావు సిగరెట్టు కాలుస్తున్నాడు. "ఏ డీమధ్య ఇదొకటి నేర్చాడు. ఏ మలవాటు—వెధ వలపాటు" అనుకొన్నది సుందరమ్మ. ఖర్చులకోసం ఇరవై రూపాయలు పైనుంచి, మిగతా డబ్బు పట్టుగుడ్డలో పెట్టి, ట్రంకులో దాచింది. నారాయణరావు ఇదంతా చూస్తూనే ఉన్నాడు. ఏమీ అన లేదు, ఆవిడా మాట్లాడలేదు.

తెల్లవారుజామున రెండు ట్రంకులు, ఎడ్లబండిలో పెట్టి, 'ఎక్కండి' అంటూ రాజయ్య జీతగాడు హెచ్చరించి

నప్పుడు, సుందరమ్మకు పాతసంఘటన ఒకటి జ్ఞప్తికొచ్చింది. ఒకనాడు తన అన్న కూడా వారుపోయిన తరువాత – ఇలానే బండిలో సామానుబెట్టి 'ఎక్కు' మన్నాడు. ఒక్క నిమిషం ఆమె కలవరపడ్డది. శుభమా అంటూ కొడుకు చదువుకొన బోతుంటే, తన కిలాంటి దరిద్రపు అలోచన వొచ్చిందేం ?

"వెడుతున్నానమ్మా!"

సుందరమ్మ మాట్లాడలేకపోయింది అదృశ్యశక్తి ఏదో తమ నిద్దరినీ వేరు చేస్తున్నదని భయపడ్డది. అయినా ఇవన్నీ ఆమె బైటపెట్టలేదు. బలవంతాన "ఊ" అని మాత్ర మన గలిగింది.

బండి చిన్నవూపుతో కదిలింది. చక్రాలు కిరకిర లాడినై. ఎడ్ల బుసల్లో గంటల చప్పుడు కలిసిపోయింది. జీతగాడి కిర్రుచెప్పులు దూరంగా వెళ్లిపోయాయి. బండిలో కూచున్న కొడుకును చూడాలని, సుందరమ్మ కళ్లు విప్పుకొని చూసింది ఆ మసగ వెలుతురులో. బండిగూడులో కూచున్న నారాయణరావు ఆమెకు కనిపించలేదు. అతను కాలుస్తున్న సిగరెట్టుమాత్రం, ఉండుండి ఎర్రగా మండుతూ కనుపిస్తున్నది. బండి మూలతిరిగింది. సుందరమ్మ బరువెక్కిన గుండెతో, గాలిలో తేలిపోతున్నట్లు ఇంటిముఖం బట్టింది. ఆమె కళ్లు అప్రయత్నంగా అశ్రుపూరితాలైనాయి. చెంగుతో తుడుచు కొని మంచంమీద కూలబడ్డది.

రామమ్మ ఒక్కసారి తన బంధుకోటినంతా తిరిగే సింది. నిజాని కావిడ ఏ బంధువు ఇంటికీ వెళ్లదు; ఎవ్వరూ

తన ఇంటికీ రారు. ఆవిడ బంధువుల ఇంటి కెళ్ళిగూడా దాదాపు పది పదిహేను సంవత్సరాలు కావస్తున్నది. తిరిగీ ఈనాటికి ఆవిడ బయలుదేరింది. పురుషోత్తం పెద్దదాని పెళ్లి విషయంలో తన కేమీ పట్టనట్టు కూచున్నాడు. చెల్లెలికి ఏదోవిధంగా నచ్చ చెప్పినా, అతని మనస్సుకు మాత్రం నచ్చ చెప్పుకోలేక పోతున్నాడు. బంగారంవంటి సంబంధాన్ని చేజేతులా వదులుకొన్నందుకు అతను పరిపరివిధాల విచారించాడు.

ఎక్కడెక్కడో తిరిగి రామమ్మ ఒక సంబంధాన్ని పట్టుకొచ్చింది. రాకపోకలు లేకపోబట్టిగానీ, ఆ సంబంధం అయినవాళ్లదేనూ, రామమ్మ తల్లివేపు—కసింత దూరపు బంధుత్వమిది. నారాయణరావుమీద — అంటే సుందరమ్మ మీద—అసహ్యంకొద్దీ, ఆవిడ ఏ అడ్డాల సంబంధానికైనా అంగీకరించే స్థితిలో ఉన్నది. కన్ను కాలు బాగున్న ఎవరికైనా శారద నివ్వటాని కావిడ కేవిధమైన అభ్యంతరమూ లేదు. ఇదే ఉద్దేశ్యంలో ఆవిడ బయలుదేరింది. లాగితన్నితే, గారెలబుట్టలో పడ్డట్టు, ఆవిడ ఈ సంబంధం దగ్గరకు కొట్టుకొచ్చింది.

కుర్రవాడికి ఇరవై పెళ్లి, మొన్న పున్నమికి ఇరవైయొకటి వస్తాయి. చామనచాయగా, కొంచెం బొద్దుగా ఉంటాడు. ఇంటర్ చదువుతున్నాడు. ఆస్తి పాస్తులేమీ లేవు. ఇద్దరు ఆడపిల్లల మధ్య ఒక్కడే మొగవాడు కావటం

చేత గారాబంగా పెరిగాడు. తండ్రి గుడ్డలకొట్లో గుమాస్తా భాగం ఉన్నదని అంటుంటాడుగానీ, అది నమ్మతగింది కాదు.

"ఇంతకంటే మంచి సంబంధం మనకు దొరకదు. మీరుగూడా వెళ్ళి చూసి రారాదూ!" అన్నది రామమ్మ భర్తతో.

"నేను వెళ్ళడమెందుకే!" అన్నాడాయన.

"నేనొక్కదాన్ని చూస్తే తీరిపోయిందా ఏమిటి? మీకు నచ్చొద్దూ!"

"నాకు నచ్చటమన్న ప్రశ్నలేదు. నీకు నచ్చితే అదేచాలు. శారదవిషయం నీకూ నాకూ ఎటుగూడీ పట్టలేదు" అన్నాడు పురుషోత్తం విరసంగా. రామమ్మకే మాత్రం జ్ఞానమున్నా భర్త మనస్సు ఎంత గాయపడ్డదో గ్రహించగలిగేది. ఇంత విరసంగా చెప్పిన ఆ సమాధానం ఆవిడకు సంపూర్ణంగా తృప్తినిచ్చింది. ఈ సంబంధం — ముఖ్యంగా తనకు నచ్చింది. ఆయనకూ నచ్చింది. ఇక శారద సంగతా? దానికి నచ్చడమేమిటీ? రాజాధిరాజయితేగానీ శారదకు నచ్చనప్పుడు తాము అటువంటి రాచసంబంధం తీసుకురాగలరా? అయినా నచ్చటమంటే ఏ విషయంలో? చదువు, సంప్రదాయము తా మెటుగూడీ చూస్తున్నారు. ఇక అందమా? ఏమీ! ఈ నరహరికేం తీపరమొచ్చింది? చామనచాయ చక్కని చాయ. ఇంత ఎర్రతోలు ఉండగానే సరా? కన్ను కాలు కుదురుగా ఉండనక్కర్లా? అయినా అందం కొరుక్కు తింటారా ఏమిటి? మేమంతా ఏ అందాలు

చూసి చేసుకొన్నామూ? సుఖంగా కాపురాలు చేసుకోవటం లేదూ? మానేశామా? అందానికి అంత మొక్కడ? ఇంత డబ్బున్నవాడు, పెళ్లాన్ని సుఖపెడతాడు గానీ అందం మట్టుకే ఉన్నవాడు సుఖపెట్టగలడా? ఏమిటో పిచ్చి భ్రమలు..." అంతటితో రామమ్మగారి ఆత్మ శాంతించింది. ఆదమరచి నిద్రపోయింది.

శారదగూడా ఇలాగే అనుకొన్నట్లయితే ఏ పేచీ ఉండేదిగాదు. కానీ ఆపిల్ల ఆత్మ పూరికే గోలచెయ్యసాగింది ఇంతకాలం నుండీ, నారాయణరావును చేస్తారనుకొన్నది. ఆ మాట విన్నప్పుడల్లా సిగ్గుతో విలవిలలాడేది. నారాయణ రావును, తనను పల్లకిలో పూరేగించడమూ, గడపలదగ్గర పేరు చెప్పమనటం, బంతులాట,– ఆ బొమ్మలన్నీ గిర్రున తిరిగిపోయాయి. అసలు పెళ్ళంటేనే శారదకు చిత్రమైన భావాలు ఉన్నాయి. ఒక ఆడది మొగాడు, తన అమ్మ నాన్నలాగ కలిసి ఉండటము; మొగాడు సంపాదిస్తాడు. ఆడది అమ్మలాగా వండిపెడుతుంది. బావ తనకు తెలిసినవాడేగనుక, కలిసి ఉండొచ్చు. చాకిరి జెయ్యొచ్చు. కానీ కొత్తమనిషితో ఎలా? నాన్నలాగా, అతనుగూడా వీపు తోమమంటే, తనకు తోమక తప్పదే! ఆ కొత్తవాడి వీపు తను తోమగలదా? పరాయి మొగవాణ్ణి చూస్తేనే తనకు పిరికి పిరిగ్గా ఉంటుంది. అట్లాంటిది ఆ కొత్తవాడితో... అమ్మయ్యో! ఎంతకష్టం!! ముక్కు ముఖం ఎరగనివాళ్లకు పెళ్ళిళ్ళు చేయటం కన్నా పాతకం లేదనుకొన్నది శారద,

నిజమేగానీ, లోకంలో జరిగే వివాహాలన్నీ, ముక్కు మొగం ఎరగనివాళ్ల మధ్యే జరుగుతున్నాయని శారదకు తెలీదు. అదిగూడా తెలుసుకొన్న నాడు ఆ పిల్లకు వివాహంపట్ల ఏ విధమైన ఆలోచన లుంటాయో మరి !

నారాయణరావు ఇప్పుడు మద్రాసులో ఉన్నాడని జ్ఞప్తి కొచ్చినప్పుడల్లా శారదకు ఒక్కసారి మద్రాసు వెళ్లాలనిపించేంది. పరాయివాడితో తనకు పెళ్లవుతున్నదని బావకు తెలుసా? తెలిసిగూడా వూరుకొన్నాడా? ఊరుకోక ఏమిచేయాలని? ఎవరయినా అడిగినట్లయితే శారద ఏ సమాధానమూ చెప్పి ఉండేది గాదు.

# 13

నారాయణరావు పట్నంలో అడుగుపెట్టాడు. అతనికంతా అయోమయంగా ఉన్నది. తెలుగు మాట్లాడేవాళ్లు తక్కువగా ఉంటారని విన్నాడుగానీ, అంత తక్కువగా ఉంటారని మాత్రం అనుకోలేదు. అసలు ఆ స్టేషనుచూస్తూనే వాడు చిత్తయిపోయాడు. మద్రాసంటే వాడొక రకంగా వూహించుకొన్నాడు. తీరా చూస్తే వాడివూహకీ నగరం ఎక్కడా అందలేదు. ఒకరితో ఒకరికి సంబంధం లేకుండా, ఎవరో తరుముతున్నట్లు గబగబా పోతున్న ఈ మహాజనం, ఎడతెరిపి లేకుండా 'రయ్'న దూసుకు వెళ్లే ఈ కార్లు, రైలుపెట్టెల్లాగా పట్టాలమీది పరుగెత్తే ఈ గమ్మత్తయినవీ, మనుష్యులు లాగే రిక్షాలు, మోటారు సైకిళ్లు... నున్నని

రోడ్లు, పోలీసులు, మేడలు, షాపులు, కిలకిలా నవ్వే అమ్మా యిలు...ఇరుకు కొంపలో చాలాకాలం ఉండి, ఒక్కసారి విశాలమైన భవనంలో కొచ్చినట్టుగా ఉంది నారాయణ రావుకు.

జేబులోనుండి చిన్న కాగితం తీశాడు. తను ఏ హోటల్లో దిగితే బావుండేది. ఆ హోటల్లో కెళ్లాలంటే ఏనో్ని నెంబరు బస్సు ఎక్కవలసింది. నరసింహం మేష్టారు రాశారు. తను చదవవలసిన కాలేజీ, దానికెళ్ళే దోవ, ఎక్కడకు వెళ్ళవలసిందీ, ఏమి చేయవలసిందీ, వివరంగా రాసుకున్నాడు నారాయణరావు. ఈ చీటీ వాడికెంతైనా ఉపకరించింది.

"ఇదే లేకపోతే, నానా బాధలూ పడేవాణ్ణి" అనుకొన్నాడు నారాయణరావు.

బస్సు ఎక్కేముందు, వాడికి భయమేసింది. తను పొరపాటున ఇంకో బస్సు ఎక్కితే? అందుకని జాగ్రత్తగా నెంబరు చూసుకొని మరీ ఎక్కాడు. వాడింకా, రెండో కాలు, పూర్తిగా లోపల పెట్టనే లేదు—

"రై—ట్" అన్నాడొకడు.

బస్సు వూగి, ముందుకు దూకింది. నారాయణరావు తూలి పడబోయి సర్దుకొన్నాడు. వాడికి కండక్టరుమీద కోపమొచ్చింది. కళ్లు చికిలించి చూశాడు.

"ఎన్నాసార్" అన్నాడు కండక్టరు.

"సార్" అన్నపదానికి వాడు అర్థం చెప్పుకొన్నాడు. 'ఎన్నా' అంటే ఏమిటో మరి!

"ఆ" అడివి మేళం అనుకొన్నాడు.

"టికెట్ ప్లీజు టికెట్, టికెట్"

అంటూ కండక్టరు వస్తున్నాడు. నారాయణరావు దగ్గరకొచ్చి, "టికెట్ ఇరికా?" అన్నాడు.

'టిక్కెట్టు ఉన్నదా అని గావును అర్థం. వెధవ లెక్క వీడూను. నా కివ్వందే నాదగ్గ రెలా ఉంటుందను కొన్నాడు.'

ఈసారి ఇంగ్లీషులో అడిగాడు కండక్టరు. నారాయణ రావు ఉలిక్కిపడ్డాడు. ఇంత ఇంగ్లీషు అనర్గళంగా మాట్లా డుతూ గూడా, ఈ దిక్కుమాలిన ఉద్యోగం ఎందుకు చేస్తు న్నాడా అనిపించింది వాడికి. జేబులోనుండి కాగితం తీసి. తను వెళ్ళవలసిన చోటు చెప్పాడు. అక్కడి కెళ్ళేందుకు ఎంత చార్జీ అవుతుందో అతనికి తెలియదు. మరొక సందర్భంలో అయితే ముందుగానే అడిగేవాడు. ఇంతమందిలో అలా అడగటానికి చిన్నతన మేసింది. అందుకని ఏకంగా అయిదు రూపాయల నోటిచ్చాడు. నాలుగు రూపాయనోట్లు, కొంత చిల్లరా కండక్టరు తిరిగిచ్చాడు. నారాయణరావు లెక్క చూచుకోబోతున్నాడు. అదే సమయంలో ఆ ప్రక్కను న్నతను, చిల్లర చూచుకోకుండానే జేబులో వేసుకొన్నాడు. నారాయణరావూ ఆపనే చేశాడు. కానీ వాడి మనస్సు పీకు తూనే ఉంది. కండక్టరు చిల్లర సరిగ్గా ఇచ్చాడా! ఇస్తాడా?

పట్టణంలో మొట్టమొదట అడుగు పెట్టి, మొట్ట మొదటగా వాడు నేర్చుకొన్నది; డబ్బుపట్ల చాలా అలక్ష్యంగా ప్రవర్తించాలని.

♦ ♦ ♦

"ఆఁ వస్తున్నాను" అంటూ తలుపు తీశాడు నారాయణరావు.

ప్రసాదరావు — సంక్షిప్తంగా ప్రసాద్ — అరచేయి రుద్దుకొంటూ "యూకిలిప్టస్ ఆయిల్ ఉందా బ్రదర్?" అంటూ లోపలికొచ్చాడు.

"లేదు. ఎందుకూ?"

"తలుపును బాదీ బాదీ నొప్పెత్తింది." అన్నాడు నవ్వుతూ "నీ వింకా నిద్రపోయూ వనుకున్నాను."

"లేదోయ్"

"మేలుకొని ఉండికూడా తలుపు లేల బంధించితివి? కారణం బెద్దియో నే నెరుంగవచ్చునా?"

"మొత్తానికి తెలుగు స్టూడెంటు ననిపిస్తావు...కాస్త తెలిసేటట్టు మాట్లాడరా నాయనా! నీకు పుణ్యముంటుంది. ఇందు సిగరెట్—"

"ధూమపానం బతిగా జేయుట పాడిగాదు. అద్దాన నారోగ్యం బెంతేని కుంటుపడు — సరేగాని మై డియర్ 'పాడి' లో అరసున్నా ఉంటుందా లేదురా? ఇప్పటికి

పదహారు వేల సార్లు చదివాను. ఈ అరసున్నలు, కార్ట్ రాలు— అంటే బండి రా లన్నమాట. ఎక్కడ ఉండాలో, ఎక్కడ ఉండగూడదో జ్ఞాపకముండి చావటంలేదు. ఛ ఛ ఈ తెలుగంత న్యూసెన్సు మరొకటి లేదనుకో...ఏమి టలా నోరెళ్ల పెడుతున్నావ్ ?''

"అయ్యో బాబోయ్ ! నీ దింత యమ మేధని నాకు తెలీదు. పదహారు వేల సార్లు చదివినా, నీకు జ్ఞాపక ముండడం లేదంటే, నీ బుర్రలో ఉన్నది ఏ పదార్థమో సైంటిస్టులకి గూడా అంతుబట్టదు.''

"బస్. ఆపు. ఈ జీవుడు కాఫీకోసం అలమటించి పోతున్నాడు. పోదాంపద. అయ్యర్ రవ్వట్టు వేస్తానన్నాడు."

"నేను రానోయ్'' అన్నాడు నా రా య ణ రా వు "కావలిస్తే నువ్వెళ్లు."

"డోన్ట్ ఫియర్ – అంటే భయపడవద్దు. బిల్ నేనే ఇస్తాను...రా. అదీగాక, క్రింది కొచ్చావంటే చిత్రాతి చిత్రంబైన విశేషం బొక్కండు నీకు వినిపింతు. కలదుగదా!''

"నేను చచ్చిపోతాను.''

"అయితే మామూలుగా మాట్లాడుతాను. నువ్వు చావటం ఎంతమాత్రం ఇష్టంలేని మనుషుల్లో నేనూ ఒకణ్ణిరా భాయీ !–ఏమిటంటే ఆ సరోజ లేదూ...''

"ఏ సరోజా ?'' అన్నాడు నారాయణరావు.

"కళ్ళజోడన్నా పెట్టుకోరా! ఇంతవరకూ నువ్వు సరోజనే చూడకపోతే, ఇహ ఆత్మహత్య చేసుకోందు క్కూడా అనర్హుడి వవుతావు."

"ఏమయింది?"

"నన్ను చూసి నవ్వింది. నేనూ నవ్వాను" అన్నాడు ప్రసాద్.

"ఇక జన్మ తరించింది...ఇడియట్ నోరు మూసుకు పద" అన్నాడు నారాయణరావు.

ఎంత కాదన్నా పావుగంట పట్టింది. అసలే మద్రాసు. అందులో స్టూడెంటు. మామూలు లుంగీతో క్రింది కెడితే అసహ్యంగా ఉంటుంది. పాంట్ వేయాలి. ఇన్‌షర్టు చేసుకోవాలి. బూట్లు వేసుకోవాలి. జుట్టు కాస్త ముఖంమీదకు పడేట్టు దువ్వాలి. అధమం తడిగుడ్డతో నన్నా ముఖం తుడుచుకోవాలి. ఇదేమీ లేకుండా వీధిలో కెళ్ళడమంటే నారాయణరావుకు చచ్చిన చావుగా ఉంటుంది.

నిజానికి నారాయణరావు మద్రాసొచ్చి ఎంతో కాలం కాలేదు. అయినా ఈకాస్త కాలంలోనే వాడు అద్భుతంగా మారిపోయాడు. పల్లెటూళ్లో ఆరేళ్ళలో రావలసిన పరిణామం, బస్తీలో ఆరువారాల్లో వస్తుంది. శాంతికాలంలో ఎనిమిది సంవత్సరాలు సాధించిన శాస్త్ర విజ్ఞానం, యుద్ధకాలంలో ఎనిమిది వారాలు సాధిస్తాయి.

ఒకప్పుడు నారాయణరావు చాలా బాధలు పడే ఉండొచ్చు. కానీ అతని కవేమీ తెలియవు. ఊహ వచ్చి

నప్పటినుంచి అతను, ఏనాడూ డబ్బుకు ఇబ్బందిపడలేదు. డబ్బు సంపాదించే మార్గాలు-- అవి సులభమైనవో, కష్టమైనవో నారాయణరావుకి తెలిసే అవకాశంలేదు. సుందరమ్మ కూడా ఆ అవసరం కలిగించలేదు. అందుచేత నారాయణ రావుకు డబ్బుమీద గురిఉండడం మానేసింది. సహజమే మరి. కష్టపడి సాధించిన కార్యంపట్ల ఉండే ఉత్సాహం దైవికంగా సంభవించిన కార్యంపట్ల ఉండదు. నారాయణరావు డబ్బును విరివిగా ఖర్చుపెట్ట సాగాడు. చిత్రమేమిటంటే, డబ్బుకు లొంగనిదీ, అందనిదీ అతనికీ ప్రపంచములో ఉండదన్న గుడ్డిభ్రమ ఒక టేర్పడింది. నిజానికిది భ్రమేకావచ్చు. కానీ నారాయణరావు ఈ భ్రమను మనస్ఫూర్తిగా విశ్వసించాడు. వాడి విశ్వాసాన్ని తప్పుపట్టటానికి వీల్లేదు.

అదీగాక అతనికి తరచుగా తల్లి జ్ఞాపక మొస్తుంటుంది. ఆ వెంటనే ఆవిడ చరిత్ర నీడలాగా స్ఫురిస్తుంది. నారాయణరావు గిలగిల లాడిపోయేవాడు. అతని మనస్సు లోలోపలకు కుంచుకుపోయేది. అవమానభారంతో కుంగిపోయేవాడు. కానీ ఇదంతా నిజమా? తన తల్లి తను విన్నంత నీచురాలా? లేకపోతే, అంతమంది తన తల్లిని గురించి అనుకొనవలసిన దేమున్నది? అయినా లోకాన్ని నమ్మరాదు. అది కాస్తంతను కొండంత చేస్తుంది. ఏమీ లేనిచోట ఏదో ఉన్నదంటుంది. పద్మ ఒకటి రెండు సార్లు తనతో మాట్లాడింది. ఒకసారి నోట్సుకోసం, పద్మ తన రూముకొచ్చింది. ఆ నోట్సు తెచ్చుకోవడంకోసం తను

వారింటికెళ్లాడు. అప్పుడు పద్మ తనకెంత మర్యాద చేసిందీ ఈనాటికీ తనకు జ్ఞాపకమున్నది. పద్మతండ్రి ఎంతో ఉత్తముడు. అప్పుడప్పుడు వచ్చి పోతుండమన్నాడు. తనను పద్మను గదిలో ఒంటరిగా విడిచిపెట్టి వెళ్లాడు. ఈ బస్తీల వాళ్లకు అటువంటి పట్టింపులు ఉండవు గావును. ఇదే పల్లెటూళ్లో అయితే ఇంకేమైనా ఉందా? భగవంతుడి సాక్షిగా ఇంతకంటే ఏమీ జరగలేదు. కానీ కాలేజీలో అప్పుడే చిచ్చు ముట్టుకొన్నది. తనకూ పద్మకూ మధ్య 'లవ్' నడుస్తున్నదట 'లవ్'. అయిదారుగురు అప్పటికప్పుడే తన నడిగారు. తను ఎంత లేదన్నా వినిపించుకోరు. ప్రమాణాలు చేసినా నమ్మరు. పైపెచ్చు 'ఇలాంటి విషయాల్లో ఒకరు మాత్రం నిజం చెబుతారుట్రా మీ పిచ్చగానీ' అంటారు. ఏమో, ఇలాంటి విషయాల్లో వాళ్లు నిజం చెప్పరు గావును. అందుకే అందరూ అలాంటివారే అనుకొంటారు. కళ్లకు ఏ రంగు అద్దాలు పెట్టుకుంటే, ప్రపంచం ఆ రంగులో కనిపిస్తుంది. అప్పటినుండీ తను పద్మతో మాట్లాడ్డమే మానేశాడు. వారి ఇంటివేపుకు కూడా వెళ్ళటంలేదు.

నారాయణరావుకు పద్మ జ్ఞాపక మొచ్చింది. ఆమె తీరైన రూపం కళ్లముందు తారట్లాడింది. ఆ రూపంలో అతనికి శారద కనిపించింది. అయినా శారదకూ; పద్మకూ ఎక్కడా పోలిక లేదు. ఎవరి అందం వారిదీ..."అయితే ఈ ఆలోచనలన్నీ తన కెందుకొచ్చినట్లు?" నారాయణరావు ఆలోచించాడు. తీరిగ్గా వెనక్కు వెడితేగానీ, తన ఆలోచన

ప్రవాహానికి బీజస్థానం దొరకలేదు. ఆ జ్ఞాపక మొచ్చింది. తల్లిని గురించి తను అనుకొంటున్నాడు.—అవునా ? పరమాత్మ సాక్షిగా తనకు, పద్మకు మధ్య ఏమీచూ లేదుగదా ! లేకపోయినా ఏదో ఉన్నదని లోకం—లోకమంటే పదిమందే కావచ్చు — అనుమానించారుగదా ! అలాగే తన తల్లిని గురించి కూడా అయి ఉండకూడదా ? నాగరికతారోహణతో ఎంతో ఉన్నతదశ నందుకొన్న మదరాసువంటి మహా నగరాల్లోనే ఇలాంటి వాదులకు తావు ఉన్నప్పుడు ఆ పల్లె కొంపల్లో ఉండడం విడ్డూరమెంతమాత్రం కాదు. అదే నిజం ! తన తల్లి ఏ దోషమూ ఎరుగదు. ఏ పాపమూ చేయలేదు. రాజయ్యతో చనువుగా ఉండటాన్నిబట్టి అలాంటి 'అపవాదు' పుట్టింది. తన తల్లి అగ్నికణం. చెద దాన్ని సమీపిస్తే మాడి మసై పోతుంది.

నారాయణరావు హృదయం చల్లబడ్డది. ఆవేశం తగ్గింది. మెల్లిగా లేచి తలుపుకు తాళం వేశాడు. ఆలోచనా రహితంగా బస్సు నెక్కాడు.

"హల్లో"

నారాయణరావు తనను కాదనుకొన్నాడు.

"మిస్టర్ నారాయణ్" అన్న పిలుపూ, భుజంమీద చెయ్యీ, చిన్న కుదుపూ...

"ఎక్కడికి పోతున్నారండీ ?" అన్నాడు వాసుదేవరావు.

"సినిమాకు"

అనాలోచితంగా అనేశాడు నారాయణరావు.

"మనకోసం ఉదయం ఎనిమిది గంటలకే సినిమా వేస్తారంటారా ?" అన్నాడు వాసు నవ్వుతూనే.

"ఆదివారం గదూ ?"

"టుడే ఈజ్ ఫ్రైడే ప్లీజ్" అన్నాడు వాసు.

"అలాగా" అని క్షణ మాలోచించి, "అవునవును ఇవ్వాళ శుక్రవారమే గదూ ! నేమా మరిచిపోయాను."

ఈ మాట అన్న తరువాత నారాయణరావు నొచ్చుకున్నాడు. తను అనవసరంగా అబద్ధమాడాడు. ఆడకూడదని కాదు; అవసరమైతే అబద్ధమాడినా తప్పు లేదు. ఇప్పుడలాంటి అవసర మేమీ లేదు. తను ఏమీ తోచక వీధిలోకి వచ్చాడు. బస్సు రెడీగా ఉంది. ఎక్కేశాడు. ఇలాగని వాసుతో తనెందుకు చెప్పలేకపోయాడు? సినిమాకని ఎందుకు అబద్ధమాడాడు ? మానవుడు అర్థంలేని కొన్ని పిచ్చి పనులు ఇలా చేస్తూంటాడు గావును.

ఆలోచనలు ఆగిపోయ్యాయి.

"సినిమా ఎటుగూడీ లేదు. కాస్త కాఫీ తాగి పోవచ్చు."

తను వద్దనుకొంటూనే ఉన్నాడు. వాసు వెంట దిగేశాడు. వాస్తవంగా వాసుకూ అతనికీ అట్టే పరిచయం లేదు. ఇంతకద్దు పరిచయ మున్నవాడిని తన వూళ్ళో తను చూడనన్నా చూడడు; ఇక్కడ అతన్ని అనుసరించాడు.

వాసుకు, నారాయణరావుకు జానకి కాఫీ తెచ్చి ఇచ్చింది. నారాయణరావు ఆ పిల్లను చూశాడు. ముఖం ఎరిగినట్టే ఉంది. ఎక్కడ చూశాడో తను ?

"మా చెల్లెలు" అన్నాడు వాడు. "మన కాలేజీ లోనే ఇంటర్ చదువుతోంది జానకి."

"వీ రెవరో నాకు చెప్పక్కర్లే దన్నాయ్. నాకు తెలుసు. వీరి పేరు నారాయణరావు. మొన్న మన కాలేజీ మేగజైన్లో ఒక కథ రాశారు. అవునుగదండీ సార్?" అన్నది జానకి నవ్వుతూ.

"అలాగా ? మీరు కథలు రాస్తారని నాకు తెలీదు సుమా?" అన్నాడు వాసు ఆశ్చర్యం ప్రకటించి.

"ఆ ఏమిటో లెండి" అన్నాడు నారాయణరావు. "అచ్చులో చూసుకుంటే నా కథ మహా ఘోరంగా ఉంది. ఎందుకు రాశానా అని చాలాసేపు బాధపడ్డాను ?"

"ఈ రాసేవాళ్లంతా పుట్టంగానే నేర్చుకొన్నారా ?" అన్నాడు వాసు.

జానకి ఏదో అన్నది. వాసు మరేదో అన్నాడు.

ఈ రెండు "అనటాలూ" నచ్చక నారాయణరావు ఇంకేదో అన్నాడు. ఈలోపుగా మరొకసారి కాఫీలు తాగారు. నారాయణరావు సిగరెట్ ముట్టించి, వాసుకు కూడా ఆఫర్ చేశాడు.

"థాంక్స్. అక్కర్లేదు."

"మీరు తాగరా?"

"నిక్షేపంగా" అన్నది జానకి. "అమ్మ ఇప్పు డప్పుడే క్రిందికి రాదు లే అన్నాయ్. ఫరవా లేదు కాల్చు."

"కనీసం మా సిస్టర్ కోసం..." అంటూ సిగరెట్ ముట్టించాడు వాసు.

ఈసారి సంభాషణ సినిమాలమీదకు సాగింది. ఈ 'దాడి' లో జానకి సమధికోత్సాహంతో పాల్గొనడం చూ స్తే ఈ కుమారికి సినిమా లంటే వల్లమాలిన పిచ్చని అర్థ మవు తుంది.

"నాకు సినిమాలంటే చెడ్డ చిరాకు" అన్నాడు వాసు.

"నాకు చిరాకు లేదు; ఆసక్తిగూడా లేదు" అన్నాడు నారాయణరావు.

"బాబయ్యా! భోజనాలకు రండి" అన్నది వంట మనిషి వాకిట్లోకి వచ్చి.

"మరి నేను వెడతాను..." నారాయణరావు లేచాడు వాసు భుజంమీద చెయ్యివేసి నొక్కుతూ.

"అమ్మడూ మే మిద్దరం వస్తున్నాం. పద. నువ్వే వడ్డించు. అహ. వద్దులే! వంటావిణ్ణే వడ్డించమను. నువ్వు కూడా మాతో బాటే కూచుందువుగాని" అన్నాడు వాసు.

నారాయణరావు తప్పించుకోలేక పోయాడు. భోజ నానంతరం జానికి రేడియో ట్యూన్ చేసింది. ఈమధ్యాహ్న చర్చలో జానకి పాల్గొనలేదు. ఒక దాని వెంట మరొక స్టేషను

ఫిలిం సంగీతం బ్రాడ్ కాస్ట్ చేసే ఈ సమయంలో ప్రపంచం బదాబదలవుతున్నా జానకి సెట్టు ముందునుండి కదలదు.

ఇక పోదా మనుకొంటుండగా జానికి సినిమా ప్రపోజల్ పెట్టింది. అయిష్టంగానే అవుగాక — నారాయణరావు ఒప్పుకున్నాడు.

"అప్పుడే మేడ తయారైపోతుం దన్నాయ్ అన్నది జానకి రోడ్డు ప్రక్కనే క్రొత్తగా కడుతున్న భవనాన్ని చూస్తూ."

"ఎవరి దది ?" యాధాలాపంగా నారాయణరావన్నాడు.

"జానకి నవ్వింది. వాసుగూడా నవ్వాడు."

"మూశారూ !" వాసు అన్నాడు. "డబ్బు సంపాదించటం అరవాళ్ళకు తెలిసినట్లు మనకు తెలీదు. ఖచ్చితంగా నాలుగేళ్ల క్రిందట..."

"ఆఁ ఆఁ" అని గావుకేక పెట్టింది జానకి. "స్టీరింగ్ జాగ్రత్త బాబూ ! కారును బోల్తా కొట్టించకు నీకు పుణ్యముంటుంది"

"నెవర్ మైండ్" వాసు నవ్వాడు. "ఏమి అనుకొంటున్నాం జానకీ మనం ?"

"ఖచ్చితంగా నాలుగేళ్ల క్రిందట" అని అందించింది జానికి.

"యన్. యస్. నాలుగేళ్ళ క్రిందట తాయారమ్మనే అరవావిడ ఈ వూరొచ్చి, ఇక్కడనే-అంటే అప్పు డిక్కడో పెంకుటి ల్లుండేది - మకాం పెట్టింది. చిన్న పెట్టుబడితో హోటలు ప్రారంభించింది. ఫస్టున ఆట్టే లాభం లేదట. రాను రాను దశ ఎత్తుకొన్నదండీ— తారామండలానికి లేచిపోయిం దనుకోండి. నాలుగేళ్లు గిర్రున తిరిగేసరికి, ఆస్థలం కొని మేడ కట్టించింది. ఇంకా అరడజను మేడలకు సరిపడే డబ్బుందట— జానకీ! ఏ పిక్చర్ కెడదాం ?"

"బాబోయ్ ! తెలుగు సినిమా నే చూ డ లే ను. పాటలూ, ఆ డైలాగూ్స వీళ్లూను......హిందీ షోకు గెంటిం చన్నాయ్" అన్నది జానకి.

"రైటో" అన్నాడు వాసు, స్టీరింగు సర్రున కోసి, "ఎందుకు చెబుతున్నానంటే నారాయణరావుగారూ ! మన తెలుగువాళ్లు ఉత్త......అదీ నా నమ్మకం. ఉన్నవూరు వదలాలంటే గింజుకు చస్తారు...ఈ తాయారమ్మ సంపాద నంతా...అనేకరకాల సంపాందించింది. కొడుకు బి. ఏ., ప్యాసుచేసి 'బి యల్' చదువుతున్నాడు...లక్కీ జానకీ... శాంతారాం పిక్చరుంది. రథాన్ని ఆపుతున్నాను."

వాసు వెళ్లి మూడు టిక్కెట్లు తెచ్చాడు. జానకి కారు అద్దంలో చూస్తూ జుట్టు పమిట సర్దుకొంటున్నది. పూర్తయిన తరువాత నారాయణరావునుకూడా పిలుద్దా మనుకొని, అతనికేసి తిరిగింది.

"అన్నాయ్ !"

వాసు వచ్చి చూశాడు. నారాయణరావు ముఖం పాలిపోయింది. కళ్లు ఎర్రబడి ఉన్నాయి. చెమటతో వళ్లంతా తడిసిపోయింది. వాసు ఆదరా బాదరా రెండు సోడాలు తెప్పించాడు. నారాయణరావు సోడా తాగి, కాసిని నీళ్లు ముఖాన చల్లుకొన్నాడు.

నా వంట్లో బాగా లేదు. మరేమి అనుకోకండి. నేను రూముకు పోతాను'' అన్నాడతను.

''ఇలా మిమ్మల్ని రోడ్డుమీద వదలేసి, మేము సినిమా చూడాలన్నా మీ అరనేది? భలేవారే! కాకపోతే ప్రోగ్రాం మార్చుకొందాం. ఇంకోసారి చూడొచ్చు. పద జానకీ, కారెక్కు. ఇంటికెళదాం'' అన్నాడు వాసు.

జానకి 'ఏం తద్దినంరా బాబూ!' అన్నట్టు ముఖం బెట్టింది.

''నన్ను బలవంత పెట్టకండి. నేను వెళతాను'' అని అరడజను సార్లన్నాడు నారాయణరావు.

వాసు వొప్పుకోలేదు. తన మూలకంగా వాళ్లు సినిమాను మానుకోవటం భావ్యంగా లేదు. అందుకని నారాయణరావు కూడా సినిమా చూడటానికి అంగీకరించాడు.

# 14

''మీ దేవూరు నాయనా?'' అన్నది శాంతమ్మగారు. జానికి తాంబూలం వేసుకుంటూ తల్లివేపు చూసింది. వాసు ఇంకా ఆకు ఈనెలు తీస్తానే ఉన్నాడు. నారాయణరావు మాట్లాడలేదు.

"ఈ అబ్బాయిది ఏవూర్రా వాసూ ?" అన్నది శాంతమ్మ మళ్లీ.

నారాయణరావుది ఏ వూరో వాసుకు తెలీదు. తెలుసుకోవాలన్న ఇచ్ఛగూడా లేదు.

నారాయణరావు తప్పదనట్టు చెప్పాడు.

"మీ నాన్నగా రేంచేస్తూంటారు బాబూ ?"

"చనిపోయారండీ !" అన్నాడు నారాయణరావు.

"మీ అమ్మ—"

"మా అమ్మగూడా చనిపోయింది—"

"పాపం !" అన్నది శాంతమ్మ. అప్పటికే వికృతంగా మారిపోయిన నారాయణరావు ముఖంవేపు చూస్తూ, "బాధపడబోకు నాయనా! భగవంతుడు చేసిందానికి ఎవరేంచేస్తారు? ఒక్కొక్కళ్ళకు అలాంటి కష్టదశ సంభవిస్తుంది..."

ఇవేమీ నారాయణరావుకు వినిపించటం లేదు. శరీరమంతా కరిగిపోసిన సీసపు ముద్దలాగా ఉంది. 'గాలిలో కదులాడు గడుసు దయ్యాలు' అతని మనస్సులో విచ్చలవిడిగా తిరగసాగాయి. హఠాత్తుగా లేచి "నేను వెడుతున్నాను వాసుదేవరావుగారూ ! నా వంట్లో బాగాలేదు. వీలుంటే మరొకసారి వస్తాను." అంటూ బయలుదేరాడు. వెనకనుండి, జానకి ఒకసారి ఆగమన్నది. వాసు పదడుగులు నడిచాడు. నారాయణరావు ఎక్కిన టాక్సీ అప్పటికే వెళ్లిపోయింది.

* * *

టాక్సీవాడికి డబ్బిచ్చి, బద్ధకంగా తలుపు తీశాడు. తడుముకొంటూ వెళ్ళి స్విచ్ వేశాడు. ఒక బల్లి చరచరా పుస్తకాల వెనుకకు పరుగెత్తింది. వళ్ళంతా విరగొట్టినట్టుంది. ఊగుతూ వెళ్ళి బెడ్ మీద వెల్లకిలా పడుకొన్నాడు. విపరీతంగా దాహమేస్తున్నది. లేచి కూజాదాకా వెళ్ళేవోపిక లేదు.

"ఇప్పుడే నాకంత బద్ధక మేమిటీ ?" అనుకొన్నాడు నారాయణరావు. లేదామనీ, వెళ్లి తాగుదామనీ చాలాసార్లు అనుకొన్నాడు. లేవనూ లేదు : తాగనూ లేదు. కాలుస్తున్న సిగరెట్టు, వేళ్ల పట్టుజారి కిందపడిపోయింది. దాన్నిగూడా నారాయణరావు తిరిగి తీసుకోలేదు. సిజర్ సిగరెట్టు పొగ, తిన్నగా, సంగీతంలా పైకి లేస్తున్నది. నారాయణరావుకళ్లు మూసుకొన్నాడు. కళ్లు భగ్గుమన్నాయి. నీళ్లు కారాయి.

గుండెల్లో గుబగుబలాడుతున్న వ్యథ పైకి తన్నుకు రావాలని ప్రయత్నిస్తున్నట్టు, నారాయణరావు అటమట లాడాడు. రెండు చేతులూ ముఖానికి కప్పుకొని బావురుమని ఏడిచాడు. తను నీచుడు. పురుగు. తన తల్లి ఇంకా జీవించే ఉన్నది. తను చనిపోయిందని చెప్పాడు. తనకోసం కలవరిస్తూ అరడజను ఉత్తరాలు రాసింది. తను ఒక్కదానికీ జవాబు రాయలేదు. ఒకసారి మాత్రం "అరువందలు కావాలి, అర్జంటు" అని రాశాడు. వారం తిరక్కుండానే అమ్మ పంపింది. జాగ్రత్తగా చదువుకోమనీ, రాత్రులు మేలుకోవద్దనీ, సిగరెట్లు తాగొద్దనీ తరచు హెచ్చరికలిస్తూనే ఉంది. ఆ ఉత్తరాలు చదువుతుంటే, ఆమెగారి ఆత్మఘోష

స్పష్టంగా వినిపిస్తున్నది. తనకోసం ఆమె కలవరించే కలవరింతలు, ఆ ఉత్తరాలు భద్రంగా వినిపిస్తున్నాయి. కానీ తనేమిటి చేస్తున్నాడు ? తనకు తల్లే లేదని చెప్పుకొంటున్నాడు. తను అనాధుణ్ణని ప్రచారం చేసుకొంటున్నాడు. ప్రపంచంలో-ఒక మహత్తరమైన వరం – మాతృమూర్తిని ఉంచుకొనిగూడా, లేదని నమ్మించ చూస్తున్నాడు. తను ఎందు కిట్లామారాడు ? ఎందుకన్నాడు ? ఏ దుష్టశక్తి తన చేత ఆ మాట అనిపించింది ? ఎవరో తాయారమ్మ ఏదో చేసిందని వాసు అన్నాడు దానిమీద వ్యాఖ్యకూడా చేశాడు. తన మనస్సు చిరుకుపోయింది, ఆ సమయంలో తనకూ తల్లి లేదన్నాడు. నిజంగా తన తల్లే ఇప్పుడు లేక పోతే ? నారాయణరావు కొన్ని క్షణాలు ఆలోచించాడు. అతని కంతా చీకటి మయంగా అయోమయంగా, గజిబిజగా కనిపించింది. నల్లని అలలు ముఖాన్ని ముంచాయి. కాళ్ల క్రింది భూమి దొలుచుకు పోయింది. అగాధంలోకి కూలి పోతూ, ఆఖరి కేక వేసినట్లు అనుభూతి పొందాడు. భీతిచే గడ గడ వణికిపోయాడు. గుండెలు పైకి రావాలని చూస్తున్న బాధలో దిండులో ముఖం దాచుకొన్నాడు. చాలాసేపు ఏడిచాడు. దిండంతా కన్నీటితో తడిసింది.

"అమ్మా ! నువ్వున్నావు. ఉన్నావు. నాకోసం నువ్వు బ్రతికున్నావు—"

తనలో తను అనుకొన్నాడు. మనసు తేలికపడ్డది. బద్దకం, మత్తు వదలినట్లయింది. ప్రశాంతిగా, తేలిగ్గాఉన్నది.

సిగరెట్టు వెలిగించాడు. దీపం ఆర్పేశాడు. నిశ్చింతగా మంచంమీద నడుం వాల్చాడు.

క క క

లేచేటప్పటికి చాలా ప్రొద్దెక్కింది. అప్పటికైనా లేవకపోను. పనిమనిషి పోరుబెట్టి లేపింది.

"శానా పొద్దెక్కింది బాబయ్యా."

"అవును. పొద్దెక్కింది."

అతను ముఖం కడుక్కొని స్నానంచేశాడు. పనిమనిషి గదంతా వూడిచి, కూజానిండా నీళ్లుపెట్టి, తలుపుదగ్గర నిలబడ్డది.

"ఏం కావాలి నరసమ్మా"

"జీతం డబ్బులు బాబయ్యా" అన్నది నరసమ్మ సిగ్గుపడుతున్నట్టు.

నారాయణరావు తేదీ చూశాడు. ఇవ్వాళ పది. ఒకటో తారీఖునే తను జీతం ఇచ్చాడు. మళ్లీ పదో తారీఖు జీతమా?

"ఫస్టున ఇవ్వలేదూ?" అన్నాడు నారాయణరావు, నరసమ్మ ఏమంటుందో చూదామని.

"ఇచ్చారండీ!"

"మరి—"

"కూటికి లేదు బాబయ్యా? ఆయన జొరపడ్డాడు రిచ్చా యెయ్యటం లేదండీ!"

'పాపం' అనుకొన్నాడు నారాయణరావు. పాంటులో నుండి పర్సుతీసి, పది రూపాయల నోటు నరసమ్మ కివ్వబోయాడు. నరసమ్మ కళ్లు పెద్దవిచేసి నోటువేపు చూసింది. ఆ చూపులో, దెబ్బ తిననున్న లేడిభీతి, కాళ్ళక్రింద పెటపెటలాడే గడ్డిపోచ దైన్యము నారాయణరావుకు కన్పించాయి.

"ఫర్వాలేదు. తీసుకో నరసమ్మా."

నరసమ్మ రెండడుగులు వెనక్కు వేసింది. "నాకాడ సిల్లరనేదు బాబయ్యా...నా కొద్దులెండి."

"తిరిగి నువ్వు నాకివ్వక్కర్లేదు. పాపం! చాలా ఇబ్బందిలో ఉన్నానంటున్నావు. ఊరకే ఇత్తున్నాను తీసుకో..."

నరసమ్మలో భయం పోయి, కోపం తా వేర్పరచుకొన్నది. కోపంతో భగ్గుమన్నది నరసమ్మ.

"ఏందండీ అబ్బాయిగారూ! నేను అటువంటి దాన్నిగానండి...కూటికి నేక ఈ యదవ శాకిరి సేస్తుండానని...గునానికి లోకువుదాన్ని అవుతానంటండీ! మీరు మంచోల్లనుకొంటాను. ఇసుమంటోరని తెలిత్తే ఈ గడపకే రాను. అంతగా గంజికి నేకపోతే సముద్రంలో పడి సత్తాంగానీ ఈ యిడిసేసిన కూడు మా కొద్దు బాబయ్యా...నాకు జీతం ఇప్పిచ్చొద్దు లేండి."

టపటప రాల్చిపోసింది నరసమ్మ. నారాయణరావు మొదటి మాటకే నిర్విణ్ణుడయినాడు. ప్రయత్నపూర్వకంగా తనను తాను సంభాళించుకొన్నాడు. తనెంతటి సద్బుద్ధితో ఆ పది రూపాయలూ ఇద్దామనుకొన్నది సాకల్యంగా విచారించాలని ఎంతగానో ప్రయత్నించాడు. నరసమ్మ అప్పటికే మెట్లుదిగి వెళ్లిపోతోంది. దోవ పొడుగునా ఏదో అరుస్తూనే వెడుతోంది. నారాయణరావుకు ఒళ్లంతా వికారపెట్టింది. కళ్లు పచ్చలు కమ్మాయి. అలాగే మంచంమీద చేరగిలపడ్డాడు...

ఒక్క క్షణం అతన్నొక సందేహం బాధించింది ఇంత వరకూ జరిగిన ఈ 'విపరీత విపత్కర పరిస్థితి నిజమేనా? చేతిలో పది రూపాయల నోటు అతన్నిచూచి నవ్వింది. అదొక మహాభూతమై మానవులను పట్టుకు పీడిస్తున్న దనుకొన్నాడు నారాయణరావు. డబ్బు! వెధవ డబ్బు!! డబ్బుకోసం మానవుడు మానవత్వాన్ని కోల్పోతున్నాడు. యుద్ధాలుచేస్తున్నాడు. మారణహోమాలు రేకెత్తించి తనను తాను నాశనం చేసుకొంటున్నాడు. డబ్బు మనిషికీ మనిషికీ మధ్య ఉండవలసిన దయ, నిర్మలత్వం, ఆర్ద్రితలనే మాపు మాపుతున్నది. అవినీతి చేయిస్తున్నది. అబద్ధాలాడిస్తున్నది. అపనమ్మకాలు కలిగిస్తున్నది. మధామేధావుల్ని "మూఢులను" చేస్తున్నది. డొక్కశుద్ధిలేని వాళ్లకు నీరాజన మిస్తున్నది. జేజేలు కొట్టిస్తున్నది. ఆలోచించిన కొద్దీ ఈ డబ్బు మహాపాపిష్టిదిగా నారాయణరావుకు గోచ

రించసాగింది. చేతిలో పది రూపాయలు కాగితాన్ని కసికొద్దీ ఉండలాగా నలిపి గదిమూలకు విసిరాడు. పగబట్టిన పాము లాగా ఉండ మూలన పడిగూడా, మెల్లగా విప్పారుతోంది. నారాయణరావు అది చూడలేకపోయాడు. రెండు చేతుల తోనూ ముఖాన్ని కప్పుకొన్నాడు.

తను—బుద్ధిపూర్వకం — నరసమ్మకు ఉపకారం చెయ్యబోయాడు. ఆవిడ తనను అపార్థం చేసుకొన్నది. ఎందు కని ? నారాయణరావుకు వెంటనే సమాధానం దొరకలేదు. తన ప్రవర్తనలో 'దుష్టవాంఛ' నరసమ్మకు కనపడి ఉండ వచ్చు. తనలాగే ఇతరు లెవరో ఇబ్బందిలో ఆమె నాదు కొని, అందుకు ప్రతిఫలంగా ఆమెను కోరివుండవచ్చు. నిజమే ! ఆ అనుభవాన్ని నరసమ్మ మరచిపోగలదా ? ప్రతి ఉదారకార్యం వెనుకా, ఇటువంటి దేదో ఉండి తీరుతుందని ఆమె అనుమానించటంలో తప్పు లేదు. ప్రస్తుతః లేకపోవచ్చు. కానీ ఒక వ్యక్తి జీవితంలో కలిగిన అనుభవాలన్నీ అటు వంటివే అయినపుడు, అలాగే భావించటంలో విడ్డూర మేమున్నది ?

ఏవో ఆలోచనలు రేగాయి. అలసిపోయాడు. అలా పడుకొన్నాడు.

"హరి నీయిల్లు బంగారం గానూ ! ఇప్పుడుట్రా నీ నిద్రా ? అని ఘోషించాడు ప్రసాద్.

"నిద్రా ?" బద్ధకంగా లేచాడు నారాయణరావు. "అవును నిద్రపోయాను...అరే రెండు గంటలైందా ?"

"మనవంటి అల్పుల నిమిత్త మీ కాలవాహిని యాగజాలదు. ఈ ప్రాథమిక సత్యమైన నీ వేల యెఱుంగ కుంటివో నాకు తోచకున్నది. వివరింతువేని సావధానుండనై యాకర్ణింప నుద్యుడు."

అంత చికాకులోనూ నారాయణరావు నవ్వాడు.

"అది గాదురా!" అన్నాడు ప్రసాదు. "నాకు చెబితే, నేను మానుకోమంటానా? కాదంటానా? ఏమిటి నీ భయం?"

"నా కర్థంబు గాలేదు" అన్నాడు నారాయణరావు.

"భాషను ఖూనీ చెయ్యక"—"అదికాదోయ్ శుభలేఖ వచ్చిందని చెబితే దోషమనుకొన్నావా?"

"ఏం శుభలేఖ?"

"వెధవ నాటకం నువ్వూనూ, నేనే వెర్రిబాగుల వాణ్ణయితే—ఒహ్ ? డాన్సు చేయిద్దువు నా చేత. ఇదిగో... కవర్లో...సరేనా?"

నారాయణరావూ రవంత ఆశ్చర్యపోయాడు. బహుశ తను నిద్రపోతున్నప్పుడు పోస్ట్ వచ్చి ఉంటుంది.

"నేనూ చూడలేదు. భాయీ! ఏదీ ఇలా ఇవ్వు"

శ్రీరస్తు. పెండ్లి పిలుపు. శుభమస్తు

స్వస్తిశ్రీ చాంద్రమాన ........... సంవత్సర చైత్ర శుద్ధ 5 లు గురువారం (...........) మకరలగ్న పుష్కరాంశమందు.

| | |
|---|---|
| నా | వేగిపురం వాస్తవ్యులు |
| కుమార్తె | శ్రీ బొత్తాడ వెంకటప్పయ్యగారి ప్రథమ పుత్రుడు |
| చి.ల.సౌ. శారదను | చి. నరహరికి |

ఇచ్చి ......... గ్రామములోని నా స్వగృహమున వివాహ మహోత్సవము జరుపుటకు పెద్దలు సుముహూర్తము నిశ్చయించినారు గాన తాము సతీసుత బంధుమిత్ర సపరివార సమేతులై విచ్చేసి, నా జేయు సత్కారము లంది, వధూవరుల నాశీర్వదించి, నన్నానందింపజేయ ప్రార్థన.

.................. ఇట్లు,

.................. కంచుగంట పురుషోత్తం

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

బంధు మిత్రుల అభివందనములతో.

"ఒరేయ్ !" అన్నాడు ప్రసాదు. "మనవాళ్లకు బొత్తిగా బుద్ధి లేదనటానికి ఇదో తార్కాణం. పెళ్లాం బిడ్డలు లేని నీవంటి బ్రహ్మచారికిది పంపడంలో అర్థమేమిటి ? ఒక రకంగా—నిన్నిది అవమానించుట కాదాకో..."

నారాయణరావు పలకలేదు.

"ఈ కంచుగంట పురుషోత్తంగా డెవరోయ్ ? ఇత్తడి చెంబు జగన్నాధాని కేమవుతాడ్రా వీడు ?"

"తెలీదు" అన్నాడు నారాయణరావు విసుగ్గా.

"సరే నేను పోతున్నాను...ఈనాడొక ఆంగ్లేయ చలన చిత్రం బీ నగరమున ప్రదర్శింపబడనున్నది. అద్దాని దిలకింప నీవత్తువని భావించి ఇట కేగుదెంచితిని. నీ మనం బన్య లగ్నం బైనటుల దోచెడి — నేను వెడతాను... గుడ్‌బై...టా టా...వెళ్ళనా ?"

"వెళ్లు."

"కమ్మని పిక్చర్‌రా. గ్రిగరీ పెక్కూ, లోండా లూసియా యాక్టు చేశారు. లూసియా బేర్ బాడీ డాన్సెస్, హాఫ్ యె డజన్ ఉన్నాయట. హాలీవుడ్ వాటిల్లో రికార్డు బ్రేక్ ఈ పిక్చరు. చూస్కో తడకా!" అని ఆశపెట్టాడు ప్రసాదు.

"వుల్లో ఉంటే—థియేటరు దగ్గరకొస్తాను."

"ఉండక? నీ వెట కేగదలించివి?"

"ఈ మారేజికి వెళ్లాలనుకొంటున్నాను."

"ఈ వధూవరులు నీ కేమవుదురు ?"

"గాడ్దు" అన్నాడు నారాయణరావు కోపంగా, అప్పటికిగ్గానీ ప్రసాదు వెళ్లలేదు. శుభలేఖవేపు మరొకసారి

చూశాడు నారాయణరావు. శారద పేరు అచ్చులో—ఆ ప్రక్కనే నరహరి, నారాయణరావు రక్తం ఉద్వేగంతో ప్రవహించింది. ఎవరో బలవంతాన తనను పిసికేస్తున్నట్లు గిజగిజలాడిపోతున్నాడు. జైలులో పెట్టిన ఖైదీ మనస్తత్వం లాగా, అతని మనస్తత్వం స్వేచ్ఛను కోరుతున్నది. దేనినుండి తనకు స్వేచ్ఛ ? ఏ బాధనుండి తను విముక్తుడు కావాలి ? తనకూ శారదకూ మధ్య, వూహించని అడ్డుగోడలు, ఆకాశమంత ఎత్తుకు లేస్తున్నాయి. మరొక వారం రోజులకు తనకు శారదను శాశ్వతంగా సంబంధాలు తెగి పోతాయి. ఆనాడు తను శారదను పలకరించేందుకు గూడా వీలులేదు. ఆ భర్త ఉత్తముడైతే, దూరంగా వుండి చూసు కోగలడు. అపాయంలేని ఒకటి రెండు మాటలు మాట్లాడుకో గలడు. కాని పశువైన ఆ అదృష్టం గూడ తన కుండదు. ఒకప్పుడు శారద తనదే ననుకొన్నాడు. ఆమెను భార్యగా భావించి, పచ్చి కలలుకన్నాడు. ఏమి టేమిటో చిత్రంగా వూహించాడు. ఆ కలలు ఎంతో ఆనందాన్నిచ్చాయి. ఆ వూహలు ఎంతో సంతృప్తి నిచ్చాయి. ఆ కలలను యథార్థం చేసుకొన్నట్లయితే ?—లేదు. తన కా అదృష్టం లేదు. కనపడని గడుసు భూత మేదో, తన సుఖ జీవనంపై పనిగట్టుకొని నిప్పులు విరజిమ్ముతున్నది. కాక ఈ వైపరీత్యా లన్నీ ఒకేసారి ఎందుకు సంభవించాలి. తన మనసు ఇంతగా వికావిక లెందుకవ్వాలి ?

నారాయణరావు ఆపుకోలేకపోయాడు. పసివానిలా బావురమని ఏడిచాడు. అది శారదకోసమూ, తల్లికోసమూ, నరసమ్మకోసమూ, శారద రూపం కన్నీటిలో పొడగట్టింది. రివటలాగా ఏపుగా పెరిగిన పైరులాగా నవ్వుతో, గెంతుతో, ఆనందముతో తూగుతో ఉండే శారద—ఆ నరహరి ఆస్తి అయిపోతుంది. ఆస్తి! 'ఎంత నీచం' అనుకొన్నాడు నారాయణరావు. హృదయం శారదకోసం ఘోషించింది. 'ఈ వివాహాన్ని ఆపటానికి వీలులేదా?' అనుకొన్నాడు నారాయణరావు. తమ వెడితే ఆగుతుంది. తను వెడితే, శారద తనపక్షమే అవుతుంది. ఈవివాహాన్ని అంగీకరించదు. ఎదురు తిరుగుతుంది. వివాహం రసాభాసవుతుంది. మొగ పెళ్ళివారు, తిట్టి దుమ్మెత్తిపోస్తారు. ఆ లగ్నానికే తనకు, శారదకు పెళ్ళవుతుంది.

ఈ ఆలోచన నారాయణరావుకు కొంత సంతృప్తి నిచ్చింది. చివాలున లేచాడు. ప్రక్కచుట్ట సర్దుకొన్నాడు. కావలసినన్ని గుడ్డలు, ట్రంకులో కుక్కాడు. కిటికీలు మూసేశాడు. పర్సులో డబ్బు లెక్క చూచుకున్నాడు. నూరు పై చిలుకున్నాయి. వివాహానికంటూ పోతున్నప్పుడు ఈ డబ్బేమి సరిపోతుంది! శారదకు మంచి చీర—ఆ మొగ పెళ్ళివారు దారుమనే మాంచి చీర—కొనాలి. ఆచీరె చూసి వాళ్ళు—ముఖ్యంగా శారద హడలిపోవాలి. తను గుడ్డలు కొనుక్కోవాలి. నగలు కొనాలి. తను ఎంతటి ధనవంతుడో అక్కడి వాళ్ళకు తెలియాలి. తెలిసి వారి తలలు హీన

భావంతో వంగిపోవాలి. నిజమే! అందుకు ఈ డబ్బు ఎటు గూడి చాలదు. అందుగ్గాను — ముందుగా తను సరాసరి అమ్మదగ్గర కెళ్ళాలి. నారాయణరావు వంగి మూలకు చూశాడు. ఉదయం తను విసిరేసిన పదిరూపాయల నోటు విచ్చినపువ్వులా ఉంది. ఆప్యాయంగా తీసి జేబులో పెట్టుకొన్నాడు. ఉదయం ఆ నోటుపట్ల అతనికున్న ఏ ఆలోచనా ఇప్పుడు లేదు. ఏ భావమూ జ్ఞప్తికి రాలేదు.

డబ్బుకోసం తల్లిదగ్గరి కెళ్ళక తప్పదన్న నిర్ణయం అతన్ని బాధించింది. ఈ పట్టణంలో (తప్పు, నగరంలో) తను అడుగు పెడుతూనే 'ఇక అమ్మ ముఖం చూడకూడదు' అనుకొన్నాడు. ఆ నిశ్చయాన్ని ఇంతవరకూ పాలిస్తూ వచ్చాడు. ఎన్నోసార్లు సుందరమ్మ వచ్చిపొమ్మని ఉత్తరాలు వ్రాయించింది. నారాయణరావు వాటిని లక్ష్యపెట్టలేదు చించి, తగలేశాడు. అయితే ఈ నాడు ఆ తల్లితోనే అవసర మొచ్చింది. ఆమెదగ్గర కెడితేనే తనకు శారద దక్కుతుంది. తనకు తల్లి లేదని చెప్పుకొన్న సంఘటన గుర్తుకొచ్చింది. ఈనాడెలా వెడతాడు? వెళ్ళి తల్లిని ఎలా ప్రాధేయపడతాడు? కేవలం డబ్బు లేనంతమాత్రాన శారద తనను చేసుకొనేందుకు ఒప్పుకోదా? ఏమో? అయినా శారద ఈ సంబంధాన్ని బుద్ధిపూర్వకంగా ఒప్పుకొన్నదేమో? ఒప్పుకోలేదని, ఒప్పుకోదని తనెలా రూఢి చెయ్యగలడు? ఎంతో ఆశతో అక్కడికెళ్ళి శారదచేత తిరస్కృతుడై తిరిగి రావటం ఎంతో చిన్నతనంగా కనిపించింది. అయినా

ఈ విషయంలో శారదపాత్ర అట్టే ప్రాముఖ్యం లేదని కావచ్చు. ఒక్క శారద అంగీకరించినంత మాత్రాన ఏమీ జరుగకపోవచ్చు.

నారాయణరావు నిరాశతో కుంగిపోయాడు. నరాలు దుర్బలములైనాయి. మెదడులో మంటలు మండుతున్నట్లు తహతహలాడాడు. జేబులో పర్సుతీసి గోడకేసి కొట్టాడు. అందులోంచి శారదఫొటో తళుక్కున మెరసి కింద పడ్డది. బెడ్డింగు ఎత్తి క్రిందపడేశాడు. ట్రంకును లాగి తన్నాడు. జర్రుమంటూ వెళ్ళి డ్రాయరుకు తగిలింది. డ్రాయరు కదిలింది. పుస్తకాలు వొలికాయి. అద్దం క్రిందపడి ఫెళ్ళున బద్దలైంది. నారాయణరావు తలుపుకు తాళం వేశాడు. చాలాసేపు వాకిట్లో కూర్చున్నాడు. చిత్తడిగా చెమట పోసింది. నాలుక పిడచకట్టుకుపోయింది. రెండేసి మెట్లొకొక అంగవంతున వేస్తూ దిగిపోయాడు.

"రండి" అన్నది జానకి సంతోషాన్ని ప్రకటిస్తూ.

"కాలక్షేపం ఎలాగా అనుకొంటున్నాను. మీరొచ్చారు"

"మీఅన్నగారు లేరాండి?" అన్నాడూ నారాయణరావు.

"ఎవరో ఫ్రండొచ్చారు. వెళ్ళాడు."

"వస్తాను" అని వెనక్కు తిరిగాడు నారాయణరావు.

జానకి హతాశురాలైంది. "మాస్టరుగారు ఇప్పుడే వస్తారు. మీరొస్తే ఉండమని కూడా చెప్పారు"

ఇంత చీకాకులో ఉన్నా, ఈ మాటలో విశ్వాసం కుదరలేదు నారాయణరావుకు. ఐనా తిరిగివచ్చాడు.

"ఇందా కాఫీ !"

"థాంక్స్. అక్కర్లేదు"

"అప్ టు డేట్ ప్రావెర్బ్ ఏమిటో మీకు తెలుసునాండి... ముందు కాఫీ తీసుకోండి. చెబుతాను."

నారాయణరావు కాఫీ తాగాడు. తాగిన తరువాత ఆ ప్రావెర్బేమిటో అత నడగలేదు. జానకి చెప్పనూ లేదు.

"ఏరీ మీఅన్న యింకా రాలేదు"

"మీకు తోచడంలేదు గదూ ?"

"యస్"

"నేను కరెక్టుగా మిమ్మల్ని అంచనా వేశాను." అన్నది జానకి. నాకూ తోచడం లేదు ... పోనీ అలా వెళ్ళొద్దాం వస్తారా ?"

"ఎలా ?" అన్నాడు నారాయణరావు.

"అలా !"

"నేను నడవ లేనండీ !"

జనకి ఫక్కున నవ్వింది.

"నేను నడవగలనని మీ రనుకొంటూన్నా రనుకొంటున్నాను. అవునా ? బాబూ ! మీరు ఏమైనా అనుకోండి. నేను తగని బద్ధకస్తురాలిని. మీ కో ఎగ్జాంపు లిస్తాను

చూడండి. నాకోసం మరొకరు ఆవలిస్తానంటే, నాకొచ్చే సంతోషం అంతా ఇంతా కాదు. ఇంతకీ ఏమిటి చెబుతున్నాను?—ఆ అవును. అది గదూ! నేనూ నడవలేను. కారుంది" అన్నది జానకి.

"నేను డ్రైవ్ చెయ్యలేను."

జానకి ఆశ్చర్యం నటించింది.

"నిజంగానా?" అన్నది జానకి "నాకొచ్చు పదండి. నాగమ్మగారూ! నే నలా కారును తోలు కెడుతున్నాను. రాత్రికి రావుగారు కూడా భోజనానికొస్తారు. అన్నతో చెప్పు...రండి సార్"

కారు వూగుతో, మెల్లగా పోతోంది.

"మీకు డ్రైవింగు ఒచ్చుననుకోలేదు"

"డ్రైవింగ్ రాని లేడీకి ఈ రోజుల్లో పెళ్ళి కావడం కష్టం సార్...అయినా నే నందుకోసం నేర్చుకోలేదనుకోండి. ఏమిటో? అదో వెర్రి హాబీ నాకు-కూల్ డ్రింక్ తీసుకోరూ?"

నారాయణరావు ఏ సంగతీ చెప్పకముందే జానకి కారును ఆపింది. రెండు బాదంఘీర్ ఆర్డరిచ్చింది. సగం మేర తాగింతరువాతగానీ, నారాయణరావుకు డబ్బు సంగతి జ్ఞాపకం రాలేదు. ఇప్పుడెలా? జానకి చేత ఇప్పించడమా? ఏం బావుంటుంది గనుక. నారాయణరావు ఏమీ తోచక జేబులో చెయ్యి పెట్టుకొన్నాడు. జానకి తేలుకుట్టినదానల్లే ఉలిక్కిపడి "నో. నో. నో. నే నెంతమాత్రం ఒప్పుకోను.

అమ్మయ్యో! ఈ సంగతి మా అన్నకు తెలిస్తే చంపే య్యడూ'' అన్నది.

"ఈ దోరణి తగ్గితే బావుండు'' ననుకొన్నాడు నారాయణరావు.

జానకి చాలాసేపు అటూ ఇటూ తిప్పింది. చివరి కోహాలు దగ్గిరాపి, "హెడీ లామర్ యాక్టు చేసిన పిక్చరండీ! మోస్ట్ వండర్‌ఫుల్ పిక్చర్ కాసేపు ఎంజాయ్ చేదాం. ఏమంటారు?'' అన్నది.

నారాయణరావు మాట్లాడలేదు. కారును సరాసరి లోపలికి పోనిచ్చి, బాయ్ కొప్పగించింది. గబ గబా మెట్లెక్కుతూ "రండిసార్! ఇప్పుడే కమెన్స్ చేశారు'' అంటూ అతను వస్తున్నదీ లేనిది కూడా గమనించకుండా లోపలికి దూసు కెళ్ళింది. తరువాత చాలాసేపటికి, రెండు కాగితం ముక్కలు చిల్లరా కుర్రా డొకడు ఇచ్చిపోయాడు. జానికి టిక్కెట్లకని డబ్బెప్పు డిచ్చిందీ నారాయణరావుకు తెలీదు.

పిక్చరు చూస్తున్నంతసేపూ జానకి ఏదో అంటూనే ఉంది. ఇంకో సందర్భంలో అయితే నారాయణరావు విసుక్కునే వాడేమో మరి! జానక్కి గెస్టుగా రావడం, అందులో అందమైన యంగ్ చాప్ అనడమూ గనక నానాయణరావు భరించాడు. ఆ అనడంలో కూడా అట్టే నైపుణ్యాం ఉన్నట్టు నారాయణరావుకు అనిపించలేదు.

ఉండుండి ఒక్కసారి "బ్యూటీ'' అంటుంది. 'ఐరనీ, "వండర్'' "నైస్'' "వాట్ యేనా టీ గరల్'' "హెవెన్స్''

ఈ పదాలు అర్థమం’ రెండొందలసారులన్నా ఉపయోగించి ఉంటుంది. ఇన్ని అభివందనాలందుకోదగ్గ దేమీ నారాయణ రావుకు స్ఫురించలేదు. ఆట మధ్యలో చిప్సూ, గరంచా తెప్పించింది జానకి.

“వేస్టు” అనుకొన్నాడు నారాయణరావు.

పిక్చరయిపోయింది. ఈలోపుగా అరడజనుసార్లు అతన్ని ఏ చేత్తోనో పొడవడటమూ, “సారీ” అనటమూ జరిగాయి.

“నన్ను రూం దగ్గర దింపుతారు గదూ!” అన్నాడు నారాయణరావు.

“పాపం! అలా ఆశపడ్డారు గావును. హైలీ ఇంపాసిబుల్ మిస్టర్ నారాయణ్...మీరు విధిగా మా యింటికి రావలసిందే...అదీగాక మా బ్రదర్‌తో ఏదో పనుండి గదూ వచ్చారు. అది వాయిదా వెయ్యడమెందుకూ!”

కారు ఆగీ ఆగకముందే “హల్లో” అన్నాడు వాసు. “పిక్చరెలా వుంది అమ్మడూ! మీ రెలా ఫీలయ్యారండీ?”

“బ్రహ్మాండమైన సీక్వెన్సులు నాలుగైదు ఉన్నాయన్నయ్యా! మన ఇండియన్సు మరో వెయ్యేళ్ళవరకూ అలాంటిది తియ్యలేరనుకో. ఏమండీ నారాయణరావుగారూ! అవునుగదూ!”

నారాయణరావు నవ్వాను. ఇంతమాత్రానికే జానకి వదిలేపెట్టే రకం గాదు. నిగ్గదీసి అడిగేసేదే! నంటమనిసొచ్చి

నారాయణరావును రక్షించింది. లేకపోతే వెయ్యేళ్ళలోపల ఇండియన్సు అలాంటిసినిమా తీయగలరో లేదో అతను ఖచ్చితంగా చెప్పవలసి వచ్చేది.

*　　*　　*

పాల వానలాంటి వెన్నెల. వెలుతురు తాగినమబ్బులు సోమరిగా కదులుతున్నాయి. చల్లని గాలి వీస్తున్నది. గాలి వీచినప్పుడల్లా రావిచెట్టు గలగల మంటున్నది. బజారులో జన మింకా తిరుగుతూనే ఉన్నారు. పురుషోత్తం మంచం మీద వెల్లికిలా పడుకొని చుట్టకాలుస్తున్నాడు. సుందరమ్మ ఆఖ రబ్బాయిగ్గూడా భోజనం పెట్టి, తానూ రెండు మెతుకులు తిని, "పోక చెక్క" నములుతూ గుంజకు ఆనుకొని కూచున్నది. ఆమె మాట్లాడలేదు. పురుషోత్తం గూడా మాట్లాడలేదు. కొంచెం సేపైన తర్వాత, చుట్ట మంచంకోటి కానించి, కాసినినీళ్ళు పుక్కిలించి, గట గట గట త్రాగి మూతి తుడుచుకొని చిన్నదగ్గు దగ్గాడు పురుషోత్తం. అన్న ఏదో మాట్లాడబోతున్నా డనుకొంది సుందమ్మ.

"నువ్వింత మనస్సు కష్ట పెట్టుకొంటా వనుకొంటే, నారిగాడికే ఇచ్చి చేద్దును. అప్పుడేమో 'సరే' నంటివి. నువ్వు ఒప్పుకొన్నావుగదాఅని నేను శారదను "పరాయి కిచ్చాను. అంతగా ఇదయ్యే దానివి అప్పుడే గట్టిగా చెప్పలేకపొయ్యావా మధ్యన నన్నిరుకున పెట్టటం దేనికే? సుందరం" అన్నాడు పురుషోత్తం.

"నేనేం చేశానన్నయ్యా? నే నేమనుకొంటేమటుకేం! నీకొచ్చిన నష్టమేమీ లేదుగా?"

"ఒక్కగా నొక్క బిడ్డ్ఞోబుట్టువున్నావు. నా కూతురు పెళ్ళికి రాకపోతే, నేనెంత బాధపడ్డానో నీకేం తెలుసు? అక్కడికీ మనిషిని పంపానుగదా! రాకూడదూ?" అన్నా డాయన

"తీరిక లేదు"

"ఊహూ, రావటం ఇష్టం లేదనవే సుందరం! నువ్వు రాదలచుకొంటే తీరికే దొరకదా? కేవలం తప్పించుకొందా మని ఏదో ఒకటి అంటే ఎట్లా చెప్పు. ఇదే నారాయణరావు పెళ్ళి జరిగితే, నేను రానుండా ఉండను. ఉండలేను. నువ్వు న్నావు. నీకు తీరికలేదు సరే — వా డెందుకు రాలేదు? వాడికీ తీరికలేదా?...ఎందుకు చెబుతావే సుందరం! నా యింటికి రావటం మీ ఇద్దర్లో ఎవరికీ ఇష్టంలేదు. అం దుకే తప్పించుకొన్నారు. వెర్రిబాగులవాణ్ణి. నేనే ప్రాణం ఉండబట్టక వస్తుంటాను."

"వచ్చినందుకు నిన్నెవ రేమిటన్నా రన్నాయ్"

"ఎవరో ఎందుకంటారు? అంటే ఎవరు పడతారు... పదిమందికీ చెప్పుకోలేక, నా తల నేలబడ్డది. అరె! ఈ బండి కొస్తారు, ఇంకో బండి కొస్తారు. అని ఎదురు చూడటమే సరిపోయె. పోనీ రాదలచుకోని వాళ్ళు, అలాగని ఖండి తంగా చెప్పేయకూడదూ? ఈ కాస్త ఆశ చంపుకొంటా నుగా?"

పురుషో_త్తం బాధ పడుతున్నాడని సుందరమ్మ గ్రహించింది. "పడనీ" అనుకొన్నది సుందరమ్మ.

"పెళ్ళికి రాకపోతే మానె. ఇక్కడికి కొచ్చినప్పుడన్నా వాణ్ణి కాస్త మా కొంపకు రమ్మని చెప్పు. చూసి కూడా చాలాకాలమైంది. వెధవ కళ్ళల్లో మెదుల్తున్నాడు... ఎప్పుడొస్తాడట?"

"ఏమో వాడి దయ"

"దయా!" ఆశ్చర్యపోయాడు పురుషో_త్తం.

"అదేమిటేమ్. అప్పుడప్పుడు వస్తుండడా ఏమిటి?"

సుందరమ్మ మనస్సు గతుక్కుమన్నది. ఏమని చెబుతుంది? ఎనిమిది నెలలనుండీ రానే రాలేదని చెబుతుందా? వచ్చి పోతున్నాడని చెబుతుందా? రాలేదని చెబితే తన అన్న నారాయణరావును కించగా చూడడా?

"ఎందుకు రాడు. అప్పుడప్పుడొస్తుంటాడు"

ఈ దఫా మా యింటికి రమ్మను. అయినా నీదేముందిలే! రాదలచుకొన్నవాడయితే, నువ్వు చెబితేనే రావాలా ఏమిటి? నీతో బాటు వాడిక్కూడా నేను పగవాణ్ణయ్యాను. ఈ దిక్కుమాలిన పెళ్ళి చెయ్యకపోయినా బావుండేది. అందర్నీ దూరం చేసుకొంటున్నాను."

"అందరూ ఎందుకు దూరమవుతా రన్నయ్యా పిచ్చిబట్టా!" అన్నది సుందరమ్మ.

పురుషో_త్తం నవ్వాడు. ఆ నవ్వుకు అర్థం కనబడదు.

"ముందు మీ వదినెకు దూరమయ్యాను. అది అర విడిచి నాతో మాట్లాడి చాలా కాలమైంది. నారిగాడి కివ్వాలని మహా కొట్టుకులాడింది నిజం చెబుతున్నాను సుంద రం—పచ్చని చెట్టుక్రింద కూచుని చెబుతున్నాను. ఈ సంబంధం దానికి బొత్తిగా యిష్టంలేదు. అసలు పీటల మీదికే రానన్నది. శకుంతలను తప్పకుండా నారిగాడి కిస్తా నంటే—అప్పటికి కాస్త శాంతిన బడ్డది. ఏదో గొడ్డులాగ అరుస్తుం దన్న మాటేగానీ, అంత పిచ్చి బొందను నే నెక్కడా చూడలేదు... ఇస్. ఇస్... ఓరి నీ కుక్కను పగల గొయ్య..." అని అదిలించాడు పురుషోత్తం.

సుందరమ్మ లేచి, తలుపు దగ్గరకు లాగి, గొళ్ళెం బెట్టి, తనూ మంచంమీద పడుకొంది. రాజయ్య చుట్ట కాల్చు కొంటూ, ఒకటి రెండుసార్లు తనింటి ముందటే పచారుచేసి తిరిగి లోపలి కెళ్ళాడు. సుందరమ్మ భయంతో అన్నవైపు చూసింది. ఆయనగారు ఇది గమనించనట్లే ఉన్నాడు. "హమ్మయ్య" అనుకొన్నది సుందరమ్మ.

"ఏమిటోలే సుందరం! ఆ పెళ్ళి కూడా పెళ్ళిలాగా జరగలేదు. ఒక వేపు మీరు రాలేదని దిగులు, మీ వదిన కూడా పట్టీ పట్టకుండా ఉండటం, వూళ్ళోవాళ్ళందరూ "రవ్వలాంటి మేనల్లు డుండగా పరాయి సంబంధ మిచ్చా వేమిటయ్యా"? అని కాకుల్లాగా తగులుకోవటం, అనుకొన్న వాళ్ళంతా ఎగ్గొట్టటం—నానా హైరానా అయిపోయిం దనుకో. ఇక గత్యంతరం లేక నలుగుర్లో మాట పోతుందే

భగవంతుడా అని. ఆ శాస్త్ర పనీ గట్టెక్కించాను..." అన్నాడు పురుషోత్తం ఎంతో విరక్తిగా ఉన్నట్లు.

"శారద ఇప్పుడత్తగారింట్లోనే ఉందిగా అన్నయ్యా"

"ఆ" అన్నాడు పురుషోత్తం "నిన్ననే ఉత్తర మొచ్చింది. అల్లుడిగారికేదో సుస్తీ చేసిందట. అయిదారు రోజుల్లో వెళ్ళాలి. ఎక్కడికని చావను? అన్నిటికీ నేనే తగు లబడాలి. మీ వదిన్ను పొమ్మంటే "నేను చచ్చినా ఆ యింటికి పో"నంటుంది. ఆ అల్లుడంటే దానికంత మంట. పోకపోతేనా బాగుండదు. పోదామంటే, ఇక్కడ కుమ్ము దుమ్ముగా ఉంది. ఏమిచెయ్యాలో తోచటంలేదు. పోనీ...నువ్వు కూడా రారాదుటే చూసొద్దువుగాని. ఇదివరగ్గూడా నువ్వు చూడ లేదుగదా? అన్నీ కలిసొస్తాయి. ఏమంటావ్?"

సుందరమ్మ మాట్లాడలేదు.

"ఏం సుందరం! రారాదు?"

ఈసారిగూడా సుందరమ్మ పలకలేదు. పురుషోత్తం సుందరమ్మవైపు చూశాడు. మెడవరకు శాలువా కప్పుకొని సుందరమ్మ ఎప్పుడో నిద్రపోయింది.

* * *

"అది గాదురా! ఈ యీడు కుర్రాళ్ళకు లవ్ లెట రొస్తుంటాయి. నీ కర్మ గాలి జబ్బు ఉత్తరాలేమిట్రా నీ కెప్పుడొచ్చిననూ!" అన్నాడు ప్రసాదు.

నారాయణరావు మాట్లాడలేదు. ఏదో చదువు కొంటూ అలానే కూచున్నాడు.

"అధిమగు పఠనవలన ఆరోగ్యం బంతరింపగల ప్రమాద మొందున్నది కావున మిత్రశ్రేష్ఠమా! లిప్త కాలమా పొత్త మావల నుంచుము. లేదేని, నేనే యావల నుంచవలసిన యావశ్యకత ఏర్పడగలదు... అది సరేగానీ మైడియర్ మిల్టన్‌లు ఆవశ్యకత అన్నపదంలో "స" ఉండాలా? "శ" ఉండాలా? ఏమిబాసరా బాబూ మనది! ఏ వెధవిచ్చాడోగానీ "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అని ఉత్త వెర్రివాడులాగున్నాడు. ఈజ్ ఇట్ నాట్?"

"తెలీదు"

"చంపేస్తాను" అంటూ గబాలున దూకి పుస్తకం లాగిపారేశాడు ప్రసాదు.

"నన్ను చదువుకోనివ్వరా?"

"రేవు ఇవ్వాళ కుస్తీల కెడదాం పద. దారాసింగ్, కింగ్ కాంగ్ అలీ రిజాబే, ఫ్లయింగ్ టైగర్. ఓహ్హో. మోతెత్తిపోతుం దనుకో. మన గాంగ్ మొత్తం బయలు దేరుతున్నది. నువ్వూగూడా రావాలి."

"వీళ్ళతో కలిశా? అన్నాడు నారాయణరావు. "బాబోయ్ నేను రాను ఇదివర కైన పరాభవం చాలు."

"అప్పుడు చలపతిగా డుండేవాడు. ఆడపిల్ల కనిపిస్తే వెర్రెత్తిపోయి, నానా చండాలమూ చేసేవాడు అందుకని

గోడవైంది. ఇప్పు డామాత్రం కలేజి ఉన్నవా దేవుడా మనలో? అంతా తాతయ్యే లేగా. మరేం భయం లేదు. నీ వీపుకు నా వీపు అడ్డ మేస్తాను. సరా?

పోతుంటే మధ్యలో వాసు కనిపించాడు.

"మీరూ కుస్తీలకేనా పోతున్నారు? అన్నాడు వాసు నారాయణరావుతో.

"అవునండీ!"

"రక్షించారు. మాసిస్టర్ మధ్యాహ్నంనుండి నా ప్రాణాలు తీసేస్తోందంటే నమ్మండి. నా కా ఈదిక్కుమాలిన గుద్దులాట చూడమంటే జాస్తిగా ఇంటరెస్ట్ లేదు."

"దిక్కుమాలిన గుద్దులాటా అది" చూశారా రావు గారూ! మాఅన్న ఎలా అంటున్నాడో?" అన్నది జానకి.

"కేవలం డబ్బుకోసం, ఇద్దరు మనుష్యులు తలబడి గుద్దుకొని, రక్కుకొని, పొడుచుకోవటంలో ఉన్న బ్యూటీ ఏమిటో నా కర్థంగాదు." అన్నాడు వాసు.

"వూరికే గుద్దుకొనటమా అది?" అని ఫక్కున నవ్వింది జానకి అన్నగారి తెలివితక్కువతనానికి. "ఎంత కాంపిటీష నుంటుంది అందులో" అదే బ్యూటీ! ప్రతివాళ్ళూ దాన్ని ఎంజాయ్ చెయ్యలేదు. నీకంత ఇష్టం లేకపోతే మానెయ్. నేనూ రావుగారూ వెడతాం. రండి మిస్టర్ నారాయణ్."

"ఆ అపాయంనుండి నన్ను తప్పించారు. చాలాచాలా థాంక్స్" అన్నాడు వాసు.

జానకి స్టీరింగు తీసుకొంది. నారాయణరావు ఆమె ప్రక్కనే కూర్చున్నాడు.

"అమ్మడూ! రావుగార్ని సరాసరి మనయింటికేపట్టు కురా! నేను వెడుతున్నాను. ఏయ్ టాక్సీ"

వాసు వెళ్ళిపోయ్యాడు.

నారాయణరావు జానకితో సహా వెడుతుంటే ప్రసాదు ముఠా "హుర్రే హుర్రే" అని కేకలు వేసింది. ఆ కేకలు బహుశః వారికి వినపడి ఉండవు.

* * *

"ఎలా వుందీ?" అన్నాడు వాసు.

"మోస్ట్ వండర్‌ఫుల్ అన్నాయ్! ఆలీ రిజా బె, ఒక్కదెబ్బతో డవున్ అయిపోయ్యాడు. కింగ్‌కాంగ్ మన వాణ్ణి గడ్డి తినిపించాడనుకో. మరో వందేళ్ళకుగానీ మనం రెస్లింగ్‌లో కంపీట్ చెయ్యలేమని నాఅభిప్రాయం. ఏంమటావు మిస్టర్ నారాయణ్? ఈజ్ యిట్ నాట్ ఫాక్ట్?"

"భోజనాలకు రండర్రా! అన్నీ చల్లబడి పోతున్నాయి" అన్నది జానకి తల్లి.

"ఓ యస్. వడ్డించమను."

"మీ యింట్లో చాలాసార్లు భోంచేస్తున్నాను. ఈ రుణం ఎలా తీర్చుకోవాలో మరి" అన్నాడు నారాయణరావు.

"ఎందుకు భోంచేస్తున్నాను అనుకొన్నారు గాదు. ఇంకా నయం" అన్నది జానకి ముద్ద నోట్లో పెట్టుకుంటూ, "ఛీ ఛీ... ఈ కాబేజీ తగలడిపోయింది. ఆ చట్నీలో సహానికి సహం కొత్తిమిరి కూరారు. రసం అధ్వాన్నంగా ఉంది. ఎలాగర్రా భోంచెయ్యటం?" ఈ వరసలో అన్నం తింటు న్నంతసేపూ కుమారి జానకి ఘోషిస్తునే ఉంది.

"ఈ ఉత్తరం మీదే ననుకుంటాను. కిందపడి పోయింది" వాసు వో కార్డిచ్చాడు.

"అవునండీ!"

"వాటీజ్ దట్ మిష్టర్ నారాయణ్? అన్నది జానకి." "ఇంద తాంబూలం వేసుకోండి."

"వద్దు."

"ఏం? చక్కని ఆకులండీ! వేసుకోండి."

"అక్కర్లేదు."

"అదా సంగతి" అన్నది జానకి టపీమని నవ్వి "బ్రహ్మచారులు తాంబూలం వేసుకో గూడదని గావును, అవునాండీ?"

వాసు నవ్వాడు. నారాయణరావూ నవ్వాడు.

"నేను బ్రహ్మచారినే! అయితే నేనూ వేసుకోగూడ దన్నమాట!" అన్నది జానకి.

"మీరు బ్రహ్మచారులు గారు"

"ఆఁ"

బ్రహ్మచారిణులు అనాలి. ఫెమినైన్ జెండరులో "రిణులు కలుస్తుంది" అన్నాడు నారాయణరావు.

"నరహరిగారికి జబ్బుగా నున్నది. నోట మాటలేదు. నీవు వెంటనే బయలుదేరి రావలసింది. ఆలస్యము ఉండదు. నీ మేనమామ పురుషోత్తం" అని కార్డులోని వో భాగం బిగ్గరగా చదివింది జానకి. "ఈ పురుషోత్తం — నరహరి కేమతుతాడండీ. మీకు తెలుసా?" అన్నది జానకి ఏమన డానికీ తోచక.

"అల్లుడు"

"మీ తమ్ముడన్నమాట. అయితే మీకు తమ్ము డొకడున్నా డన్నమాట. మరి ఎప్పుడూ చెప్పలేదేమండీ!" అంనువల్ల కొంపలు మునిగిపోయినట్లు మాట్లాడింది జానకి.

"ఛ ఛ. వాడు నాకు తమ్ముడేమిటి?" అన్నాడు నారాయణరావు.

ఆ తరువాత చుట్టరికాలమీద చాలాసేపు సంభాష ణలు జరిగాయి. వాసు విసుగెత్తి వెళ్ళిపొయ్యాడు.

ఆ మరునాడు అతను రూముదగ్గర కొచ్చేటప్పటికి పోస్టు మెసెంజర్ కూచుని ఉన్నాడు.

"నారాయణరావుగారు మీరేనండీ?"

"అవును. ఏం?"

"మీకు టెలిగ్రామొచ్చింది" మెసెంజర్ టెలిగ్రాం ఇచ్చి సంతకం చేయించుకొని వెళ్ళాడు. నారాయణరావు ఆదరా బాదరా విప్పి చదువుకొన్నాడు. గుండెలు దెబ్బతిన్నాయి.

—నరహరి—డైడ్—స్టార్ట్—ఇమ్మీడియెట్లీ—

కొన్ని నిమిషాలపాటు నారాయణరావుకు పిచ్చెత్తినట్లయింది. బొట్టు కాటుకు గాజులు వెంద్రుకలు లేని శారదను వూహించుకొని భయకంపితుడైనాడు. నరహరి చనిపోయినందుకు అతను విచారపడటంలేదు. నిజానికి అతనెవరో కూడా నారాయణరావుకు తెలీదు. ఏ అజ్ఞాతవ్యక్తి మరణించినట్లు ఫీలయ్యాడు. అతని విచారమల్లా శారదకు కష్టాలొచ్చాయనే. ఇంత లేతవయస్సులోనే శారద భర్తను కోల్పోవలసి వచ్చింది. ఆపైన శారద ఏం చేస్తుంది. అలా ఒంటరిగా ఎంతకాలం జీవిస్తుంది? పురుషోత్తం ద్వితీయ వివాహం చేయకుండా ఉంటాడా? చేస్తే ఎవరితో? జానకి ప్రక్కనే తనను వూహించుకొన్నాడు నారాయణరావు. ఎంతో బావుంది ఆ జంట. ఇద్దరూ ఒకరిని చూసి మరొకరు నవ్వుకొన్నారు. చేతులు కలుపుకొని కేరింతలు కొట్టారు. చప్పున బొమ్మ చెరిగిపోయింది. నారాయణరావు ఉలిక్కిపడ్డాడు. ఇటువంటి ఆలోచనలు వచ్చినందుకు తనమీద తనకే అసహ్యమేసింది. ఒకవంక శారద అలా భయంకరమైన అధోగతిలో పడిపోతే తన కిలాంటి దిక్కుమాలిన ఆలోచనలెందుకొచ్చాయి?

నారాయణరావు దేనికి సమాధానం చెప్పుకోలేదు.

# 16

నారాయణరావు వచ్చేటప్పటికి అన్నీ ముగిసిపోయాయి. శారద మూలగా కూచున్నది. అతను చూశాడు. ఎక్కడ లేని దుఃఖమూ పుట్టుకొచ్చింది. గదిలోకెళ్ళి నిశ్శబ్దంగా రోదించాడు...

ఆకాశం సంధ్యను ముసుగులా కప్పింది. స్వర్ణకాంతు లీనుతున్న మబ్బులు సోమరిగా గాలిలో తేలిపోతున్నాయి. దూరంగా రైలుకూత. కాల్చిన సిగరెట్టు కాలవలో వేశాడు. ఒక్కక్షణం "చుయ్" మన్న ధ్వని సిగరెట్టు నీరు పీల్చుకొని ఉబికి విచ్చిపోయింది. అతని కేదో సత్యం గోచరించినట్లయింది.

"ఈ సిగరెట్టుకూ, శారదకూ భేద మేమిటి?! అనుకొన్నాడు నారాయణరావు...

ఊగిసలాడుతూ ఇంటి కొచ్చాడు. అతనికి అన్నం తిన బుద్ధి గాలేదు. బలవంతాన తినిపించారు. ముసుగుపెట్టుకొని గదిలో పడుకొన్నాడు. అప్పటి కింగా పురుషోత్తంగారు యింటికి రాలేదు.

అతను ప్రతిరోజూ ఇంటి కెడదామనుకొనేవాడు. అన్ని ప్రయత్నాలూ చేసేవాడూ. అంతే. వెళ్ళేవాడు కాదు. వెళ్ళలేకపోయేవాడు. ఇదివరకు శారద స్థానంలో ఇప్పుడు శకుంతల... బొమ్మ కుదరడం లేదు. ఒకటి రెండుసార్లు తనివిదీరా శారదను చూశాడు. ఎంతో అందంగా ఉంది. విచార

రేఖలు ఎక్కడా కనపడటం లేదు. ఉన్నా తను వాటిని గుర్తించకపోవచ్చు.

ఒకటి రెండుసార్లు రామమ్మ ఎవరితోటో అంటుండగా తను విన్నాడు :– "మా నారాయణ కిచ్చినా సుఖపడేదమ్మ! పాపిష్టిదాన్ని. ఇచ్చుకోన్నానుగాదు" అని.

ఆ మాటలు వింటున్నప్పుడు ఏ లోతుల్లోనో ఉన్న కసి తీరినట్లు ఆనందం కలుగుతుండేది. అదో చిత్రమైన అనుభవం.

అయిదారు వారాలు గడిచాయిఒకనాడు—

"నేను వెడతాను మామయ్యా" అన్నాడు నారాయణరావు.

"అప్పుడేఏమిట్రా ... మరో రెండు రోజు లుండు" అన్నాడు పురుషోత్తం.

"కాదు వెళ్ళాలి ..."

పురుషోత్తం మాట్లాడలేదు.

"శారద విషయం ఏం చెబుతావ్"

"మీ అమ్మ దగ్గరకు తీసుకెళ్ళే విషయమేనా?" అన్నాడు పురుషోత్తం.

"ఊఁ"

"బావుంటుందా! తలచెడిన మనిషి ... ఏమోనబ్బా! నీ యిష్టం. మీ అత్తగా రిష్టం"

అత్తగారు నిష్పేచీగా వప్పుకొంది. కాకపోతే లాంచనంగా కాసేపు గుసిసింది. రామమ్మ వప్పుకోదేమోనని

నారాయణరావు మొదట భిడియపడ్డాడు. ఆ భయానికి హేతువేమిటో కూడా అతను చెప్పుకొన్నాడు. కానీ హేతువునికి ఉనికి లేదు. లేదని రామమ్మ నిరూపించింది. అత్తయ్య చాలా మంచిదనుకున్నాడు నారాయణరావు.

అంతేగానీ ఈ అంగీకారం వెనుక స్వార్థంలాంటి దేదో ఉండవచ్చని నారాయణరావు అనుమానించలేదు తెలివి తక్కువ దద్దమ్మయినట్లయితే ఏమోగానీ, రామమ్మలాంటి "తెలివైన మనిషి" ఈ అవకాశాన్ని జారవిడుచుకోవటం అసంభవం. మంచిదో, చెడ్డదో ఆవిడొక పని చేసింది. ఆ పని సఫలిత మవుతుందనే ఆశించింది. అందుకోసం పని గట్టుకొని భర్తతో పోరాడింది అతని మెడలువంచి నరహరికి కూతురు నిప్పించింది. అతను చనిపోయాడు. భగవంతుడు కూడా తనకు విషంతలుస్తున్నాడు. తన ప్రయత్నమిలా భంగమవుతుందని ఆమెకు తెలీదు. అయిందేదో అయింది. అయ్యవారిని చేద్దామనిపట్టుబట్టింది. కూతురుకుసంభవించినఈమహా విపత్తుకు రామమ్మ ఘోరాతిఘోరంగా విలపించింది. తన పంతం నెరవేరలేదు ఓడిపోయింది. కాబట్టి ఇప్పుడు చేయవలసిం దేమిటి? ఈ చెడిపోయిన భాగాన్ని ఎలాగైనా బాగు చేసుకోవాలి. ఇప్పట్టున వంటరిగా తను దాన్ని సాధించలేదు. అదీగాక తన జాతకచక్రం సరిగ్గాలేదని భైరవశాస్త్రి కూడా చెప్పాడు. ఎన్నివిధాల చూసినా పిల్ల నక్కడికి పంపటం ఉత్తమంగానే ఉన్నది. అలా పంపిన తరువాత ఏమి జరిగేదీ రామమ్మ సూచాయగా వూహించింది. అందువల్ల-

అంటే - తను వూహించినట్లు జరిగినందువల్ల జరిగేమాట నిజమే కావచ్చు. కాని ప్రస్తుతం అలా జరిపించటమే ఉత్తమం. రామమ్మ ఎవ్వరితోటి ఈవిషయాలు చెప్పలేదు. చెప్పినా ఇంతదూరం ఆవిడ ఆలోచించగలదని కూడా ఎవ్వరూ అనుకోరు. సంతోషంగా (విధవయిందన్నవిచారం లేకపోలేదు) శారదను నారాయణరావువెంట పంపించింది. పురుషోత్తంగారుకూడా సంతోషించారు.

* * *

దాదాపు ఏడెనిమిది నెల్ల తర్వాత నారాయణరావు తన స్వగ్రామ మొచ్చాడు. ఇలా రావటం—నిజంగా అతని కిష్టం లేదు. శారదలేకపోతే, అతను వచ్చేవాడు కాడు. ఈ విషయం సుందరమ్మ కూడా పసికట్టింది. ఆమె కొడుకును అడగనూ లేదు. అతను చెప్పనూ లేదు.

నారాయణరావు తన పాత స్నేహితులను చూడడానికి వెళ్ళలేదు. అతని కెందుకో భయం వేసింది. కొందరిని దోవనపోతుండగా చూశాడు. ఇంకొందరు తన హోటలుకు వచ్చినప్పుడు చూశాడు. రాజయ్య ఆప్యాయంగా పలకరించాడు. పట్నం విశేషాలెన్నో అడిగాడు. "జవాబులు రాయటం లేదేం బాబూ" అని ప్రశ్నించాడు. నారాయణరావు సరైన సమాధాన మివ్వలేదు. ఏదో చెప్పి తప్పుకొన్నాడు. ఒక రిద్దరు మేష్టర్లొచ్చి పలకరించారు. అందులో ఒకాయన్ని నారాయణరావు ఎరుగడు. కొత్తగా వచ్చాట్ట.

మహా ఉంటే అతనికంటే రెండు మూడేళ్ళు పెద్దేమో? అప్పుడే మేష్టరుగిరీ చేస్తున్నాడు. ఈ హోటల్లోనే భోం చేస్తున్నాడు. రాత్రిళ్ళు స్కూల్లో పడుకొంటాడు శంకరం మేష్టారు. అతన్ని రమ్మని నాలుగైదుసార్లు ఆహ్వానించాడు. నారాయణరావు పోలేదు ముక్కు మొఖం ఎరగనివాడితో భేటీ వేయడమేమిటి గనుక?

శారదలో ఎంతో మార్పు కనుపించింది నారాయణరావుకు. ఆ మార్పు పసనావస్థకు చెందినది కాదు. బాగా ఎదిగినట్లు జీవితం అర్థమైనట్లు కనిపించేది. ఇది తన భ్రమే కావచ్చు ననుకొన్నాడు నారాయణరావు.

కొంతకాలం పట్నంలో ఉండి వచ్చాడేమో అవే అలవాటయినాయి. ప్రొద్దెక్కిలేవడం, చన్నీటి స్నానం, రాత్రి ఒంటిగంటదాకా మేలుకోవటం. ఇవన్నీ గాకపోయిన కొంతలో కొంత శారదకూ అనుభవమే. కొన్ని నెలలే అవుగాక—ఆవిడా ఒక స్త్రీ కాపరం చేసింది. ఆ కొద్దికాలంలోనే ఆ వాతావరణానికి వీలయినంత చేరువకు రాగలిగింది. అందుచేత నారాయణరావుమీాది అజమాయిషి ఆమె వహించవలసి వచ్చింది. తనకు వివాహమైందనీ, తన భర్త చనిపొయ్యాడనీ, ఎప్పుడోగానీ జ్ఞాపకం రాని మనిషిలా ఉంటుంది శారద. అలా జ్ఞాపక మొచ్చినప్పుడు, కొన్ని నిమిషాలు మాత్రం అలా మూలగా, దిగులుగా కూచుంటుంది. మామూలప్పుడు ఉల్లాసంగా, చలాకీగా ఉంటుంది. ఇతరుల ముందు విషాదం నటించటం శారద కొక ముఖ్య

కార్యమైకూచుంది. అనేకసార్లు ఆ పిల్ల ఈ విషయం మరిచి పోయి, నవ్వుతూ పేలుతూ ఉండటమూ, ఆ తరువాత సుందరమ్మ చేత "తిట్లు" తినడమూ మామూలైంది. నారాయణరావు మదరాసు పోదామనుకొన్నాడు. కానీ పోలేకపోతున్నాడు. "ఎందుకని?" అని ఎవరన్నా అడిగితే అతను సమాధానం చెప్పేవాడు కాదు. ఎందుకంటే ఆ సమాధానం నీతివంతమైందికాదు. అయినా కాకపోయినా, అలా అనటం భావ్యమా? లోకం "అది తప్పు" అనవచ్చు. కానీ అతని అంతరాత్మ కది ఎంతో నచ్చింది. ఎంతో సంతృప్తి నిచ్చింది. శారద ఒప్పుకొంటే— తనామెను పెళ్ళాడుతాడు. "ఇందుకు ఎన్ని అడ్డంకులు వచ్చినా జంకగూడదు. చివరికి మా అమ్మ ఒప్పుకోకపోయినా సరేనూ." అనుకొన్నాడు నారాయణరావు. అవసరమయితే ఆమెను కాదనటానిక్కూడా నారాయణరావు సిద్ధపడ్డాడు. బావుంది. ఐతే శారద ఇందుకు ఒప్పుకొంటుందా? అదే కావాలి తనకు. అందుకోసమే తను ఇంతకాలం ఇక్కడున్నాడు.

ఈ రాత్రి అటో యిటో తేల్చివేయాలనుకొన్నాడు. ఈ ముసుగులో గుద్దులాటవల్ల అన్నివిధాలా నష్టమేగానీ లాభం కనుపించటంలేదు. అందరి భోజనాలూ అయినాయి. నారాయణరావు చాలా ప్రొద్దుబోయి ఇంటి కొచ్చాడు. సుందరమ్మ అప్పటికే నిద్రపోయింది. శారద ఏదో పత్రిక ముందువేసుకుని కూర్చున్నది. అడుగులు చప్పుడయితే, తలెత్తి చూచింది. నారాయణరావుగూడా చూశాడు.

హరికేన్ లాంతరు కాంతి ఆమెమీద పడి మెరుస్తున్నది. గాలికి ముంగురులు చలిస్తున్నాయి.

"ఏం చక్కదనం" అనుకొన్నా డతను.

నీళ్ళు తోడింది. సబ్బుయివ్వటానికి వచ్చినప్పుడు అడుగుదామనుకొన్నాడు. మాట నోటిదాకా వచ్చింది. అడగలేదు. భయమేసింది. గుండెలు దడదడ మన్నాయి. వ్రేళ్ళు పట్టుతప్పి చెంబు క్రిందపడి పోయింది. గబగబా స్నానంచేసి వాకిట్లోకి వచ్చాడు. తల్లి ఇంకా నిద్రపోతూనే ఉంది. దూరంగా గొడ్లు మేతమేస్తున్న ధ్వని గాలికి చెట్టు ఆకులు సమాధాన మిచ్చాయి. లుంగి కట్టుకొని బనియను వేసుకొన్నాడు. చాలనట్టుఫీలయ్యాడు. వేళ్ళతో తల దువ్వు కొన్నాడు దగ్గరిలో ఉన్న పూచికపుల్ల తీసుకొని పళ్ళు కుట్టు కొన్నాడు.

"భోజనానికి రా బావా!"

మండిగానికి అటొక కాలు, ఇటొక కాలు వేసి, చేతులు రెండూ వెనక్కు పెట్టుకొని నారాయణరావును చూస్తూ అడిగింది శారద.

"వస్తాను"

ఖర్మం. తనేదో అడగాలనుకొన్నాడు. చుట్టూ చూశాడు. గొంతు సరిచేసుకొన్నాడు. "వస్తాను" అన్నాడు. లాభం లేదు. తను బైటపడలేడు. అడగలేడు.

"వడ్డించాను బావా! చాలాసేపైంది."

లేచాడు. నిలదొక్కుకొని వంటింటివైపు నడిచాడు. మండిగం దగ్గర కొచ్చాడు. ఇదే సమయమని ఎవరో చెబుతున్నా రతనికి. టపీమని అడిగేదా మనుకొన్నాడు. ఇప్పుడడగకపోతే, శారద మళ్ళీ చిక్కదు. ఈ అవకాశమూ లభించదు. ఒక్కక్షణం అక్కడ తచ్చాడాడు. శారద కదలలేదు. కొంచెంగా, ద్వారబంధానికి వత్తుకొని, కోకను దగ్గరకు లాక్కుంది. నారాయణరావు అడగనేలేదు. వెళ్ళి అన్నం ముందు కూచున్నాడు. అన్నం పేడకుప్పలాగా అగపడ్డది. వేళ్ళతో అటూ ఇటూ కెలికాడు. ఒక్కముద్దకూడా మింగలేదు. నోటపెట్టుకొన్న ఒక్కముద్దకే గుంఢ్రింపు వచ్చింది. లేచి చెయ్యి కడుక్కొన్నాడు.

"అదేమిటి బావా! అన్నం తినలేదేం?"

"సయించలేదు"

ఎలాగో అనగలిగా డామాట.

"నువ్వు తింటావుగదా అని పెరుగుపచ్చడి చేసింది అత్తయ్య...ఒంట్లో బాగుండలేదా!"

"లేదు"

మంచంమీద పడుకొన్నాడు. ముసుగు పెట్టుకొన్నాడు. నిద్రపట్టటంలేదు. వంటిల్లు సర్దుతున్న చప్పుడు వినపడుతోంది. ఎందుకింత పిరికివాడయ్యా డతను! (ఇటువంటి విషయాల్లో అతనెప్పుడూ ధైర్యాన్ని చూపెట్టలేదు.) ఈ మాట అడగడానికి ఎందుకు భయపడుతున్నాడు! శారద తనకు కాదే! మీదుమిక్కిలి తనంటే, ఎంతో కొంత సదభి

ప్రాయమున్నదేనే! ఒకవేళ అడిగినా అది రద్దీ కావలసిన అవసరం లేదే. రద్దీ అయినా, బావ వరుస గనుక (నవ్వుతూ) అడిగాడని సర్దుకోవచ్చునే. తనెందుకు ధైర్యం చెయ్యలేక పోయినాడు? మంచందగ్గర అడుగుల చప్పుడు వినిపించింది. నారాయణరావు ముసుగు తీసి చూచాడు. శారద!

"కాఫీ అన్నా తీసుకో బావా" అన్నది శారద.

నారాయణరావు లేచాడు. చుట్టూ భయం భయంగా చూశాడు. కాఫీ గ్లాసుకోసం చెయ్యిచాపి అందుకొన్నాడు. కావాలని శారద వేళ్ళను తాకాడు. చిత్రమైన అనుభవం. శారద ఇవేమీ గమనించినట్లులేదు. తాగిన తరువాత గ్లాసు తొలిచి లోపల బెట్టింది. వంటింటికి తాళం వేసింది. సిగరెట్టు పెట్టె, అగ్గిపెట్టె నారాయణరావు మంచం క్రింద బెట్టింది. తలుపులు వేసి గడియ బెట్టింది. దీపం చిన్నదిగా తగ్గించి డ్రాయరుమీద పెట్టి పడుకొంది. ఇదంతా నారాయణరావు చూస్తూనే ఉన్నాడు. చూస్తున్నాడని శారదకు తెలియక పోవచ్చు.

గంటలకు గంటలు గడిచిపోతున్నాయి. గడియారం టిక్కు టిక్కుమన్న ధ్వని, శారద గాలిపీలుస్తున్న చప్పుడు. ఏమైనాసరే ఈ రాత్రి అడిగేయా లనుకొన్నాడు. మెల్లగా మంచంమీదినుండి లేచాడు. మంచం కిర్రుమన్నది. ఊపిరి బిగబట్టి అడుగులో అడుగు వేసుకొంటూ తల్లి దగ్గరకెళ్ళి చూశాడు. ఆవిడ యథాప్రకారం నిద్రపోతూనే ఉంది. ఆ గదితలుపులు జాగ్రత్తగా దగ్గరకు వేసి, నిశ్శబ్దంగా గొళ్ళెం

పెట్టాడు. మెల్లగా శారదమంచం సమీపించాడు. శారద నిద్రపోతున్నది. కనురెప్పలు టక టకమని కొట్టుకొంటు న్నాయి. శరీరం బెదురుతున్నట్టున్నది. శాలువా మెడవరకు కప్పుకొన్నది మందపుదీపపుకాంతిలో ఆమెముఖం అందంగా కనుపిస్తున్నది. చేతి బంగారు గాజుల మిలమిల. మెల్లగా మంచంప్రక్కనే కూచున్నాడు గుండెలు దడ దడ లాడాయి. శరీరమంతా వణికిపోయింది. లుంగీ చెరుగుతో ముఖం తుడుచుకొన్నాడు. గుండెలు కుదుటపరుచుకొన్నాడు. కళ్ళుమూసుకొని శారదచేయి పట్టుకొన్నాడు. ఏమి జరుగు తుందోనని హడిలిపోయాడు. ఏమీ జగదని సమాధానం చెప్పుకొన్నాడు. నిజానికి ఏమీ జరగలేదుకూడాను. శారద చేయి తన చేతిలో ఉంది. కానీ శారద ముఖం భయంతో ముడుచుకుపోయినట్టున్నది. కనురెప్పలు వేగంగా చలిస్తు న్నాయి. పెదవులు అదురుతున్నాయి. నారాయణరావు చుట్టూ చూశాడు. గడియారపు ధ్వని, శారద త్వరత్వరగా గాలిపీలుస్తున్న చప్పుడు. తనలో ఏదో కలవరం జరుగు తోంది. ఏవో తిరగబడుతున్నాయి. తనను చికాకు పరుస్తు న్నాయి. శారద చెయ్యి కదిపాడు. శారద కళ్ళు తెరవ లేదు. చెయ్యిలాక్కొని ప్రక్కకు తిరిగి పడుకొంది. నారా యణరావు దూరం జరిగాడు. అయితే శారద నిద్రపోలే దన్నమాట. మేలుకొని ఉండే ఇదంతా చూస్తున్న దన్న మాట. మేలుకొని ఉంటే తన నెందుకు వారించలేదు? నారాయణరావుకు పెద్ద ప్రోత్సాహం లభించి నట్లయింది.

అంటే — శారదకు...తనే భయపడుతున్నాడు. వొణికి పోతు న్నాడు. నారాయణరావు ధైర్యం (మళ్ళీ) తెచ్చుకొన్నాడు. శారదను లేపాడు. అతను అన్నీ ఆలోచించే ఈ పని చేశాడు. మంచిగా ఉంటే తను అనుకొంటున్నది అడుగవచ్చు. కాక పోతే, అమృతాంజనం ఎక్కడుందో తెచ్చిపెట్టమనవచ్చు. తను ఇందాకనే వంట్లో బాగుండలేదన్నాడు అప్పుడు ఎందు కన్నప్పటికీ ఆ మాటే ఇప్పుడు బాగాఉపయోగపడ్డది. శారద లేచింది. నారాయణరావును చూసింది. ఆశ్చర్యపడ్డది. ఆ ఆశ్చర్యంలో చాలాభాగం నటనగా నారాయణరావు అర్థం చేసుకొన్నాడు. కళ్ళు తుడుచుకొని "ఏమిటి బావా!" అన్నది మెల్లిగా. అలాఅన్నప్పుడు టక్కునచెప్పేయవలసింది. చెప్పలేదు. చెబుదామనుకొన్నదాని బొమ్మ చెదిరిపోయింది. "ఛీఛీ" అనుకొన్నాడు నారాయణరావు. శారద కొన్ని క్షణాలు అతని వేపు చూసింది. చిన్న నవ్వు ఆమె ముఖాన మెరసి, వెంటనే మాయమైంది.

"ఇంత అమాయకుడవేం బావా?" అంటోంద శారద. ఇవేమీ నారాయణరావుకు వినిపించటం లేదు. ఆ ఏకాంతం, నిశ్శబ్దం, రాత్రి, ఎదురుగా శారద, గడి యారపు ధ్వని-అతణ్ణి పిచ్చివాణ్ణిచేశాయి. కళ్ళుమూసుకొని శారదచెయ్యిపట్టుకున్నాడు విసురుగా ముందుకు లాక్కు న్నాడు. శారద తూలి, అతనిమీది కొచ్చింది

అతనిలోని ఉద్రేకాలు రెచ్చి విచ్చిపోయాయి. సరికొత్తగా లభించిన ఈ అమూల్యానుభవంకోసం శరీరం

పరవళ్ళు త్రొక్కింది. వంటినిండా విద్యుద్మెరుపులు, కళ్ళలో లావణ్యాలోకాలు...

తెల్లవారి చాలాసేపయింది. నారాయణరా వింకా లేవలేదు. సుందరమ్మ ఒకసారివచ్చి లేపింది. మూలిగి మళ్ళా పడుకొన్నాడు.

"పట్నం వెళ్ళి వెధ వలవాట్లు నేర్చుకున్నాడు" అంటోంది సుందరమ్మ ఎవరితోనో ?

నారాయణరావు లేచాడు. బద్ధకంగా ఉంది. గాల్లిలో తేలిపోతున్నట్టుగా ఉంది. బైటికి చూశాడు. ఎండ తీవ్రతకు కళ్ళుచురుక్కుమన్నాయి. చికిలించి- కళ్ళుమూసుకొన్నాడు. రాత్రి అనుభవం స్మృతిలో కొచ్చింది. తేనెలు ప్రవహించి నట్లయింది. మనోహరమయిన ఆ దృశ్యం... ...

"లేవరా. ప్రొద్దెక్కింది"

అమ్మ పిలుపు. చివ్వున లేచాడు. ఆవులించి చిటిక వేశాడు. దాపునుండి బంగారు గాజుల మెత్తని శబ్దాలు. నారాయణరావు ఉత్సాహంగా అటుచూశాడు. శారద తలొంచుకొని కూరగాయలు తరుగుతోంది. అందంగా వంగిన ఆ తలవైపు అలానే చూస్తున్నాడు నారాయణరావు. శారద మెల్లగా తలెత్తి నారాయణరావువైపు చూసి బల వంతాన నవ్వాపుకొంటూ (సిగ్గు పడుతూ) కూడా క్రింది పెదవి బిగబట్టి అటూ ఇటూ చూసి "చెప్పొద్దు" అన్నట్టు తలూపింది. నారాయణరావు వెంటనే బైటికెళ్ళిపోయాడు.

*　　*　　*

"ఏమిట్రా ఆ ఉత్తరం?" అన్నది సుందరమ్మ

"మద్రాస్‌నించి వచ్చింది" అన్నాడు నారాయణరావు. సెలవులు అయిపోవచ్చాయి వారం రోజుల్లో కాలేజీ తెరుస్తారట."

"ఆహా... వెడతా నంటావా?"

"ఇప్పుడే ఎందుకమ్మా! రేపు తెరుస్తా రనగా వెళ్ళొచ్చు. పెద్ద మునిగిపోయే దేమీ లేదు" అన్నాడు నారాయణరావు.

శారద తనలో తను నవ్వుకొంది. సుందరమ్మకూడా నవ్వటానికి ప్రయత్నించినట్లు నారాయణరావు అర్థం చేసుకొన్నాడు.

వెళ్ళే రోజున మళ్ళీ భోరెడంత హంగామా చేసింది సుందరమ్మ. ఇవేమీవద్దన్నాడు నారాయణరావు అయితే, ఈ సారి శారదకూడా అత్తగారి పక్షమవడంచేత అత నేమీ కాదనలేకపోయ్యాడు.

ఇక రేపు ఉదయం వెడతా డనగా శారద ఏడ్చినంత పని చేసింది. నారాయణరావు ఎంతో ఓదార్చాడు. ఎన్నో చెప్పాడు.

"నేను అప్పు డప్పుడు వచ్చిపోతుంటాను. నువ్వేమీ దిగులు పడకు ... మీ పుట్టింటికి వెళ్ళడం కంటే ఇక్కడుండడమే మంచిదనుకొంటాను..."

"ఏం? ఎందుకని?" అన్నది శారద నవ్వి.

"అద్భుతంగా నవ్వుతావు శారదా. ఏదీ మరోసారి. ఇంకోసారి... నవ్వు"

శారద నవ్వింది.

"ఎందుకంటే... సరే... నీకు తెలియందికాదనుకో... ఈ దఫా వచ్చినప్పుడు మా అమ్మతో గూడా చెబుతాను. ఆమె ఒప్పుకొన్నా ఒప్పుకోకపోయినా నిన్ను చేసుకోవటం ఖాయం. కాకపోతే ఇద్దరం మద్రాసులోనే ఉండిపోదాం"

"ఆ చదువు ఇక్కడెక్కడా లేదా బావా?"

నారాయణరావు ముఖం నల్లబడ్డది.

"అహ. నాకు తెలియక అడిగాను బావా! మరోలా అనుకోబోకు" అన్నది శారద రాజీగా.

నారాయణరావు మాట్లాడలేదు.

## 17

"ఈ దిక్కుమాలిన చదువులేకపోతే అక్కడే ఉందును" అనుకొన్నాడు నారాయణరావు మద్రాసులో చదవటం దుర్భరంగాతోచి. అక్కడెక్కడా చదవటానికి మనస్కరించకనే ఇక్కడకొచ్చానని అతనికి జ్ఞాపకం రాలేదు.

చదువు విషయంలో మునుపటంత శ్రద్ధ చూపలేకపోతున్నాడు. శారద స్మృతిపథంలో మెరసి ఏకాగ్రతను భగ్నం చేస్తున్నది. ఒక్కసారి ఆ అనుభవాలన్నీ రేగి చిరా

కెత్తుకొచ్చేది. రాత్రులకు రాత్రులు నిద్రపట్టేదికాదు. కొన్నిసార్లు పక్కచుట్టేసి వూరికి వెళ్ళిపోదా మనుకొన్నాడు. ఒకటి రెండుసార్లు స్టేషనుదాకాకూడా వెళ్లి తిరిగి వెనక్కు వచ్చేశాడు. అక్కడ లేకపోతే త నీపని చేసి ఉండనని అత ననేకసారు లనుకున్నాడు. దగ్గరగా ఉన్నప్పటికంటె దూరంగా ఉన్నప్పుడే శారదమీంది "ప్రేమ" గాఢమవుతున్నది. ఆమె అందం చూసినదానికంటే వూహిస్తున్నది మరింత సమ్మోహనంగా ఉన్నది. ఈసారి తను వెళ్ళినప్పుడు శారదకు ప్రజెంట్ చేసేందుకని సిల్కుచీర కొనడం మంచిదా, చైన్ కొనడం మంచిదా అన్న ముఖ్యమైన విషయం ఆలోచిస్తున్నాడు నారాయణరావు.

"హల్లో మిస్టర్ నారాయణ్"

నారాయణరావు అడిగాడు.

"నిన్న మీరు వస్తారేమో ననుకొన్నాను. రాలేదేం? బ్రదర్ మీంకోసం చాలాసేపు వెయిట్ చేశాడు" అన్నది జానకి.

"వెరీ సారీ...మరిచేపోయాను"

"ఫరవాలేదు, ఎక్కడి కిలా వెడుతున్నారు? అన్నట్టు ఇవ్వాళ రీటా హేవర్త్ యాక్టుచేసిన పిక్చ రొకటుంది. 'రాక్సీ'లో ననుకొంటా, వెడదాం వస్తారా? ఒక్కదాన్నే పోదామంటే—అబ్బే హోప్‌లెస్. ఎవరు దొరుకుతారా అనుకొంటున్నాను. రండీ" అన్నది జానికి.

"ఎక్స్క్యూజ్ మి. రాలేను"

"దేనికి? 'ది లవ్స్ ఆఫ్ కార్మెనా' కా మీరు రాలేనిది? ఆ పిక్చరు చూడండే చాలటంలో అర్థం లేదని హాలీవుడ్ క్రిటిక్సు బోలెడంతమంది రాశారు. రండి సార్."

నారాయణరావు జేబు వెదికాడు.

"పిక్చరు కొస్తాను. తిరిగి ఈ రాత్రే నన్ను రిలీజుచేస్తానని హామీ యివ్వండి."

"ఇచ్చినా మీరు రాలేరు లెండి" అన్నది జానకి నాజూగ్గా నవ్వుతూ.

"ఎందుకని?"

"అమ్మ మీతో మాట్లాడా లంటోంది. బ్రదర్ గూడాను...మైగాడ్...పిక్చరు కమెన్సు చేసే టైమయింది... టాక్సీ..."

తిరిగొస్తున్నప్పుడు ఆ సినిమామీద జానకి బ్రహ్మాండమైన కాంప్లిమెంట్సు పే చేసింది.

"సినిమా అంటే అలా ఉండాలి. ఎంత చక్కని కథను సెలెక్టు చేసుకొంటారండీ ఫారెనీర్స్! వాట్ యె బ్యూటిఫుల్ పిక్చర్ యిటీజ్! ఏమోనబ్బా! నాకు మన చిత్రాలంటేనే తిక్కొత్తుకొస్తుంది. రీటా హేవర్త్ లాగా మన స్టార్సుని డాన్సు చెయ్యమనండి చూద్దాం ... సైకాలజీమీద అటువంటి ఫీట్సు చేయించడం మరో పదివేల సంవత్సరాలకు గానీ మనవాళ్ళవల్ల కాదు. మీరొప్పుకొంటారు గదా?"

ఇదీ ధోరణి.

"నాకు నచ్చలేదు" అన్నాడు నారాయణరావు.

"వాట్?" అని దిమ్మెరపోయింది జానకి.

"నిజంగానా ? ఫన్నీగానా మిస్టర్ నారాయణ్"

"నిజంగానే. ఆ కథలో ఏదో తగులపడిపోయినట్లు నేను ఫీలవుతున్నాను. అంతకంటే ఆ సినిమా బాగుండాలంటే ఏమేమి కావాలో నాకు తెలీదు. నేను చెప్పలేను. కానీ అలా మట్టుకు ఉండకూడదు. ఉంటే నాకు నచ్చదు. ఒక ఆడది, ఇష్టమొచ్చిన ప్రతివాడితోనూ పోవటం మంచి లక్షణమని నేననుకోను. అనుకోలేను. ఆ పాత్రకే పిల్లలున్నారనుకో. అప్పుడేమవుతుంది? ఆపిల్లలు తమతల్లి దుశ్చరిత్రను విని ఎంత ఖేదిస్తారు? ఈ ప్రశ్నలకు సమాధానం "లవ్స్ ఆఫ్ కార్మెనా"లో లేవు. బహుశః ఇందుకే నచ్చక పోయివుండొచ్చు" అన్నాడు నారాయణరావు.

"ఇవన్నీ ఉంటే ఎన్సైక్లోపీడియా అవుతుంది గానీ సినిమా కాదు" అన్నది జానకి ఏమాత్రమో కోపంగా. "తీరా చూస్తే మీకు ఫారెన్ పిక్చర్స్ నచ్చేటట్లు లేదు."

"నేను చూసినవే కొద్ది. ఆ కొద్దిలో నేను అర్థం చేసుకొన్నవి మరికొద్ది. వాటిల్లో నాకు నచ్చినవి..."

"డ్రైవర్. ఆపు..." అన్నది జానకి.

నారాయణరావే డబ్బులిచ్చి పంపాడు.

డబ్బులిచ్చి పంపినతరువాత నారాయణరావు చాలా విచారించాడు. అతను నెర్వస్ అనుకొన్నాడు. జానకి

ఇంట్లో అన్నం తినకూడదని. అది తప్పనీ కాదు; తిన కూడదనీ కాదు. రోజులకు రోజుల మేయడంలో అర్థం లేదను కొన్నాడు. ఈ ఉద్దేశ్యంతోనే భోజనం చేయటానికి నిరాక రించాడు. ఇదివరకు జానకి బలవంతపెట్టేది. వాసుకూడా చెల్లెలిని సమర్థించేవాడు. ఈసారి ఈ బాధ్యతలు శాంతమ్మ గారు తీసుకొన్నది. నారాయణరా విది గ్రహించాడు. ఇం దులో అతనికి ఆలోచించదగ్గ అంశ మేమీ కనిపించలేదు. అదీగాక ఇదివరకు వంటమనిషి వడ్డించేది? ఈసారి జానకే స్వయంగా వడ్డించింది. వంటమనిషి ఎదురుగా లేకపోతే, అతను ఏదోవిధంగా సరిపెట్టుకొనేవాడు. కానీ అట్లా జరగ లేదు. ఈ చర్యను ఏ విధంగానూ సమర్థించలేకపోయాడు నారాయణరావు.

అతను భోజనంచేసి వచ్చాడు. జానకి కుర్చీలో కూచుని ఏదో చదువుకొంటున్నది. శాంతమ్మగారు తాంబూలం నములుతూ దూరంగా కూచున్నది.

"లేచి అన్నం తినరాదటే జానకీ! అస్తమానూ ఆ పుస్తకాలతో కొట్టుకొంటుంటావు. కాస్త ఆరోగ్యమన్నా చూసుకో...లే. లేచి అన్నం తిను" అన్నది శాంతమ్మ.

జానకి వయ్యారంగా లేచి, అంతకన్న వయ్యారంగా నారాయణరావు వేపు చూచి, అనవసరంగా నవ్వి లోపలి కెళ్ళింది.

"ఇదేదో అవుతుంది" అనుకొన్నాడు నారాయణరావు

"వాసు ఏడండీ?"

"ఎవరో స్నేహితులొస్తే వెళ్ళారు" అన్నది శాంతమ్మ ఏదో చెప్పబోతున్న దానిలా గొంతు సరి చేసుకొని, "చూడు నాయనా! మీ దేవూరన్నావూ?"

నారాయణరావు చెప్పాడు.

"జానకి చెప్పింది. పాపం! నీకు అమ్మా నాన్నా లేర టగా—అదో గ్రహచారం...నువ్వు మేనమామల ఇంటి దగ్గ రుంటున్నావా?"

"అవునండీ!" అన్నాడు నారాయణరావు.

ఆ తరువాత శాంతమ్మగారు ఎన్నో ప్రశ్నలు వేసింది. వీటన్నిటినీ బట్టి చూస్తే ఆవిడ మనస్సులో పెద్ద ఆలోచనలే ఉన్నట్టు నారాయణరావుకు అనుమానం వేసింది. అయితే, ఆ ఆలోచన లేమిటయి ఉంటాయి?

నారాయణరావు ఆలోచించాడు.

"జానక్కి పదహారు వెళ్ళి పదిహేడు. రేపు జులై మాసం తారీక్కి వస్తాయి. ఇక దానికి పెళ్ళి చేదామను కొంటున్నాను" అన్నది శాంతమ్మ.

"చేయండి" అన్నాడు నారాయణరావు నవ్వి.

"అదీ మాటలతో అయ్యేటట్లులేదు నారాయణరావు గారూ! తాసీల్దారుగా రున్నప్పుడయితే మాంచి సంబంధం చూచి పెళ్ళి చేద్దుము. వారు దాటిపోయి కూడా ఆరేళ్ళు కావస్తున్నదాయె ... మన స్థితి కూడా అంత తక్కువది కాదాయె. రెండు మేడ లున్నాయి. ఏదో భూవసతి ఉంది. తగు మాత్రం కట్నం యిచ్చుకోగలం."

"అయితే ఇంకేమండీ!" అన్నాడు నారాయణరావు. "ఇంతకంటే మంచి సంబంధా లుండవని కాదు గానీ, మీకేం, మహారాజులు, జానకిని ఎవడైనా చేసుకొంటాడు."

"అదీ అయిందండోయ్!" అన్నది శాంతమ్మగారు ఆశ్చర్యం నటించి. "భోగాపురం జమీందారుగారి మూడో అబ్బాయికి అడిగారు—"

"మంచిదే—ఇవ్వకపోయారూ?"

"ఇద్దామనే అనుకొన్నాను. కానీ ఈ పెంకె ఒప్పు కోందే! కుర్రవాడు లావుటా, మొద్దుగా ఉంటాడట. అదీ గాక చదువు కూడా లేదు....నా కొద్దంది. డిప్టీకలెక్టరు సూర్యప్రకాశరావుగారి తమ్ముడి కడిగారు. ఆ కుర్రవాడు ముఠాకోరని తెలిసి నేనే ఒప్పుకోలేదు. చూస్తూ చూస్తూ పిల్లదాని గొంతు కోయలేం గదా నాయనా!" అన్నది శాంతమ్మ.

"అయ్యో! ఎంతమాట?" అన్నాడు నారాయణరావు.

"లక్ష సంబంధా లొచ్చినాయి.కొందరు నాకు నచ్చ లేదు. ఇంకొందరు అమ్మాయికి నచ్చలేదు. మా యిద్దరకూ నచ్చితే వాసుకు నచ్చలేదు."

"బావుంది. ఇంతమందికీ నచ్చిన సంబంధం దొరకటం కష్టమేమోనండీ!" నారాయణరావు అన్నాడు.

"దొరికినయ్యనుకోండీ! వాళ్ళు లక్షలమీద కట్నా లడిగారు. పిల్లదాని పెళ్ళికోసం వాసును బికారిగా చేయటం నా కిష్టంలేదు నాయనా! నీతో నిజం చెబుతున్నాను.

ఏదో మనకు అందొచ్చే సంబంధముంటే ఈపడు చేసేదామనుకొంటున్నాను. మేమైనా అల్లుణ్ణి అంత హీనంగా పంపించం. అతగాడు బుద్ధిమంతుడై చదువుకొంటానంటే, ఎంతవరకైనా చెప్పిస్తాం. కాళ్ళట్టుకొని ఇంత ఉద్యోగం వేయిస్తాం. మావాడు ఢిల్లీలో ఉంటున్నాడు గదూ మరి. దీనికేమో ఈ భూప్రపంచంలో ఎవరూ నచ్చేటట్టు కనపట్టంలేదు. వాసుగాడు అంతా దానిష్టాని కొదిలేసి వూరుకొన్నాడు..."

నారాయణరావు మాట్లాడలేదు.

"కొండమీది కోతి దిగి రావాలని అందరికీ ఉంటుంది. మరి దిగి రావద్దూ ? ఏదోవిధంగా సరిపెట్టుకోకపోతే ఎలా చెప్పు నాయనా? మేమంతా నచ్చిన వాళ్ళనే పెళ్ళిచేసుకొన్నామా ? హాయిగా కాపురాలు చేసుకోలేదూ? మరీ ఈ కాలానికే వచ్చింది. ఎక్కడ లేని ఇదంతానూ. ఏమీ ! నీలాంటివాడికిచ్చి చేస్తే హాయిగా ఉంటుంది. నువ్వా "నా" అన్నవాళ్ళు లేనివాడివి. ఇక్కడే పడివుండి ఇంత చదుకోవచ్చు...అహ. నేనంటున్నాననిగాదు నాయనా ! ఇలా చేస్తే బాగుండిపోను. నిన్ననూ_ఏదో మాటమీద మాటొచ్చి, నేను ఇలాగే అన్నాను. మా వాసు సరేనన్నాడు. జానకి కూడా తలూపింది. చెప్పొద్దూ ! నా కన్నమే సయించలేదు."

నారాయణరావు ఉద్విగ్నచిత్తుడైనాడు. శాంతమ్మగారంటున్న ఈ మాటలు, అతన్ని ప్రబలంగా తాకాయి. తీవ్రంగా ఆలోచనలు చేసాయి.

"నేనింతవరకూ — ఇలా జరగొచ్చునని వూహించలేకపోయాను" అనుకొన్నాడు నారాయణరావు.

ఒక్కసారి వాసు ముఖం జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. అందులో కుటిలత్వం గాని, కుయత్నంగాని ఎక్కడా గోచరించలేదు. స్నేహపాత్రులైన బహుకొద్దిమందిలో, అతనూ ఒకడు. కేవలం ఇందుకోసమనే, తనతో స్నేహం చేశాడని వాసును గురించి అనుకోవట మెలా? నిజంగా వెనుక వెనుక జరుగుతున్న ఈ "కుట్ర" వాసుకు తెలుసా? తెలిసికూడా అత నిందుకు ఆమోదించాడా? అయి ఉండదు. ఒకవేళ అదే నిజమైతే అతనికన్నా వంచకు డెవ డున్నాడు? జానకి తనతో అంత "ఇదిగా" ఉండటానికి గల కారణం ఇప్పుడు బోధపడ్డది. ఈ వల చాలకాలం క్రిందటే పన్నబడ్డది. చేప ఇప్పుడిప్పుడే వలలో చిక్కుకొంటున్నది.

"ఏమిటి నాయనా ఆలోచిస్తున్నావు?"

నారాయణరావు తుళ్ళి పడ్డాడు.

"అబ్బే ఏమీ లేదండీ!" అన్నాడు బలవంతాన నవ్వు తెచ్చుకొంటూ. సహృదయులు గనుక మీ రిస్తామంటున్నారు. నిజ మాలోచిస్తే నా కా తాహతు లేదండీ! ఒక తాసీల్దారుగారి కూతురు, నా వంటి సామాన్యుణ్ణి పెళ్ళాడ్డంలో అర్థం ఏమిటంటారు?"

"ఏమైనా ఆవిడగారు నిన్నే చేసుకొంటా నంటున్నది.

'ఇద్దరం కలిసి ఇక్కడే చదువుకొంటాం' అంటున్నది. అందుకని చెప్పాను. నిజం చెప్పద్దూ—ఈ కాలపు కుర్ర సన్నాసుల కంటే నువ్వెంతో నచ్చావు నాకు. నిన్ను చేసుకొంటానని అమ్మాయి అనంగానే "ఏం కావాలి బాబూ! ఎందుకు లేచారు?"

"చాలా ప్రొద్దు పోయింది. వెడతానండీ!"

జానకి చట్టున ముందుకొచ్చి "భలేవారండి మీరు! ఆనకి మా అన్నయ్య మమ్మల్ని తిట్టటానికా మీరు వెడతాననటం. మీకు మేడమీద బెడ్ అరేంజి చేశాం పడుకొండి...మీతో సినిమాలమీద చాలా డిస్కస్ చెయ్యాలి. కాసినోలో ననుకొంటాను 'వార్ ఆఫ్ ది వరల్డ్స్' ఆడుతోంది. మీరు చూడలే దనుకొంటాను. తల తిరిగిపోయే పిక్చ రనుకోండి...అమ్మా! నారాయణరావు గారు పైన పడుకొంటారు. ఇంట్లో పాలుంటే కాస్త కాఫీ చేయించి పైకి పంపు. నేను వీరితో మాట్లాడుతుంటాను. రండి సార్..."

నారాయణరావు కొన్ని క్షణాలు జానకివైపు చూచి తల వంచుకొన్నాడు.

"నాకు తల నొప్పిగా ఉంది. మీతో డిస్కస్ చెయ్యలేను. వెళ్ళి పడుకొంటాను. నన్ను లేపకండి....."అన్నాడు.

"మీ కా పిక్చర్ను గురించి చెబుదా మనుకొన్నానండీ!"

"రేపు చెప్పండి. ఈ పూట వినలేను."

జానకి హతాశురాలైంది.

* * *

నారాయణరావు పడుకొన్నాడు. నిద్ర పట్టటంలేదు. లైటు తీసేసి, బ్లూలైటు వెలగించాడు. కిటికీలు బార్లగా తీశాడు. చల్లనిగాలి ముఖాన్ని తాకి, గిలిగింతలు పెట్టింది. మడతబడిన కాలరు సరిచేసుకొన్నాడు. సిగరెట్టు ముట్టించాడు. కిటికీలోనుంచి బైటికి చూశాడు. మద్రాసు మహానగరం ఇంకా నిద్రపోలేదు. రోడ్లవెంట మనుషులు నడుస్తున్నారు; కార్లు ప్రవహిస్తున్నాయి. రిక్షాల గణ గణ గంటలు. రోడ్డును క్రాస్ చేస్తున్న ఓ మనిషి నీడ దూరంగా సినిమా హాలు దీపం. పైన చిరిగిన గుడ్డలాగా ఆకాశం. స్టేషనులో రైలు కేక. నారాయణరావు అలానే చూస్తున్నాడు. ఓ కారు వేగంతో వస్తున్నది. ప్రక్కనుండి మరో కారు. "దబ్" మన్న ధ్వని. లైట్ల కదలిక: జనం చాలామంది పోగయ్యారు. ఎవరో కారుకిందపడి ఉండొచ్చు; లేక కార్లే డాష్ కొట్టవచ్చు. మత్తుగా సిగరెట్ నలిపి మూలకు విసిరేశాడు. మంచంమీద పడుకొన్నాడు. శారద జ్ఞప్తికొచ్చింది. "ఈ రాత్రివేళ శారద ఏమిచేస్తుంటుందో" ననుకొన్నాడు. శరీరం ఉద్రేకంతో కలవరించింది. అటూ యిటూ మసిలి ప్రక్కకు తిరిగి పడుకొన్నాడు. తను ఒకప్పుడు ఇలాగే పడుకొన్నాడు. శారద వెనకగా వచ్చి ముద్దుపెట్టుకొంది...ఈ ఆలోచనతో అతను లేచి కూచున్నాడు. మంచం "కిర్రు" మన్నది. ఆ అను

భవాలు అలలుగా లేచి పడుతున్నాయి. మనస్సును కలుకు తున్నాయి. శారద రూపం స్పష్టంగా కనుపించి—దగ్గరకు రమ్మని పిలుపు. తనిప్పుడు దూరంగా ఉన్నాడా, దూరమవు తున్నాడా? శారదను భార్యగా చేసుకొని తను అనుభవించా లనుకొన్న జీవితం, తలపు కొచ్చింది. అదంతా కాదని, ఇప్పు డీ జానకిని చేసుకోవటమా? శారదని తను ప్రేమించాడు. అదంటే తన కెంతో ఇష్టం. జానకి అలా కాదే. జానకిని భార్యగా తనెప్పుడూ ఆలోచించలేదు. అదీగాక జానకిమీద తనకు సదభిప్రాయం లేదు. నిజమే! శారదకన్న జానకిఅందంగా ఉంటుంది. అయితే ఏమయినట్టు. అందమైన ప్రతి ఆడదాని హృదయమూ అందంగా ఉండదని తనెక్కడో చదివాడు. జానకి ఈకోవకు చెందిన మనిషి. జానకిని చూడకుండా తను ఉండగలడు. అసలు చూడాలన్న ఇచ్ఛ కూడా తన కంతగా కలగదు. కానీ శారద అలా కాదు. అది తన మనస్సును మార్చేసింది. తనను దొంగిలించింది. డబ్బుకోసం, చదువు కోసం తను శారదను వదులుకోలేడు. ఇవి రెండూ ఎక్కడైనా లభిస్తాయి. కాని శారద లభించదు. ఈ అలభ్య వ్యక్తికోసం తను వేటినైనా "త్యాగం" చెయ్యడానికైనా సిద్ధమే. ఈవిషయం శాంతమ్మగారు ఇంతటితో పోనిస్తే సరేసరి—లేకపోతే తనే వారికి స్పష్టంగా చెప్పితీరాలి. వారేవో గాలిమేడలు కట్టు కొంటూ ఉండవచ్చు. తరువాత ఆశాభంగంపొందకుండా— ఇప్పుడే తెలియచేయటం అన్ని విధాలా ఉత్తమం.

* * *

గది కొచ్చాడు. ఆరోజు ఉత్తరాలు పడున్నాయి. ఒక పత్రిక కూడా వచ్చింది. నారాయణరావు ముందుగా పత్రిక నిప్పాడు. అందమైన త్రివర్ణ ముఖచిత్రం హిందీతార కవ్విస్తూ నవ్వుతోన్న బొమ్మ. గబగబా పేజీలు తిరిగే శాడు. తన కథ అచ్చుబడ్డది. తనపేరు నాలుగైదుసార్లు... పదిసార్లు...చూచుకొన్నాడు. కథ చదువుకొన్నాడు. పత్రిక మడిచి అవతలబెట్టి ఉత్తరాలు తీశాడు. ఒక కార్డు ఎవరో రాశారు...అతనికి ఉత్తరాలు చదవ బుద్ధిగాలేదు. మళ్ళీ పత్రికతీసి తనపేరు చూసుకొన్నాడు. సంతోషంతో ఉప్పొంగిపోయాడు. తను కథలు రాస్తానసీ, అవి అచ్చు పడుతున్నాయనీ శారదకు తెలీదు. తెలిస్తే ఎంత సంతో షిస్తుందో! ఈపత్రిక శారద కొకటి పంపాలనుకొన్నాడు. తన (కానున్న) భర్త ఎంతటి ప్రయోజకుడో శారదకు తెలియాలి.

ఓ బరువైన ఉత్తరం...నారాయణరావు కవరుమీద ముద్ర చూశాడు. అతని వూరునుండే వచ్చింది. దస్తూరి కొత్తది. గబగబా చించాడు. నాలుగు పేజీల ఉత్తరమిది:—

ప్రియమైన నారాయణరావుకు,

నేను నీకు తెలుసు. కానీ నన్ను "ఫలానా" అని గుర్తు పట్టలేవు. కనుకనే నీకీ ఉత్తరం వ్రాస్తున్నాను. ఇది నీకు చాలా బాధ కలిగిస్తుందని నాకు తెలుసు. అలా అను కొనే ఇంతకాలమూ వ్రాయలేదు. కానీ తప్పనిసరి అయి ఇప్పుడు పోస్టుచేశాను. కోపంవల్ల ఉత్తరం సాంతం చదువ

కుండా చించేయకు. అందువల్ల కొన్ని యథార్థమైన విష యాలు, నువ్వు తెలుసుకొనే అవకాశం కోల్పోతున్నావు. నారాయణరావూ! మరొకలాగా అనుకోకు. తెలిసికూడా ఆ అప్రియమైన సత్యాన్నే చెబుతున్నాను. మీతల్లి విషయం నీకు తెలియకపోదు. తెలియదని నన్ను నేను మోసగించుకోలేను. అందుకే నువ్వు చాలా దూరం—మద్రాసుదాకా వెళ్ళావని నే ననుకొంటున్నాను. మీ అమ్మకు రాజయ్యకు ఉన్న సంబంధం నీకు తెలియనిపక్షాన చదువుకోసం అంతదూరం నువ్వెళ్ళటాన్ని ఎలా సమర్థించాలి? దీనికితోడు మఱొక గొడవ ఈ మధ్యనే రేగింది. మన స్కూలులోకి శంకర మనే ఉపాధ్యాయుడు ఇటీవలె వచ్చాడు. అతను మీఇంట్లో అన్నం తింటున్నాడు. బహుశ నువ్వతన్ని ఎరుగ వనుకొం టాను. నువ్వామధ్య ఇక్కడ కొచ్చినప్పుడు అతనుకూడా ఇక్కడే ఉన్నాడు. ఇన్నిటికీ చెప్పవలసిం దేమిటంటే— అతను శారదమీద కన్ను వేశాడు. శారద సౌందర్యం అతన్ని ఆకర్షించింది. ఆమెకోసం ప్రయత్నించాడు. ఆమెను ప్రలోభ పెట్టాడు. ఏవేవో ఆశలు చూపించాడు. బ్రహ్మాండమైన జీవితాన్ని కళ్ళముందు మెరిపించాడు. ఆమెను లొంగదీసు కొన్నాడు. నారాయణరావూ! స్త్రీ అజ్ఞానంతో ఉండటము వల్ల (విద్యావిహీనురాలవటంవల్ల) సంఘానికి ఎటువంటిలోటు కలుగుతున్నదో నువ్వాలోచించు. శారద ఇలా అయి పోతున్నదని మీఅమ్మకు తెలుసు. ఆమె నామక వారించింది. ఆమె చరిత్ర శారదకు తెలిసిపోవడంచేత, మీ అమ్మ గట్టిగా

నిరోధించలేకపోయింది. శంకరం ఇటీవలే మరొకవూరు వెళ్ళి పోయాడు. ఈ అవకాశాన్ని తీసుకొని గ్రామంలోని కొంత మంది గోడలనిండా ఈసంగతులే వ్రాశారు. రాజయ్య చెరిపించాడు. ఒకనాడు శారద బహిర్దేశానికి వెళ్ళివస్తున్నది. ఒకడు ఆమె చెయ్యి పట్టుకొని లాగాడు. మరొకసారి నీళ్ళు తెస్తుంటే...ఎరిదుకులే నారాయణరావూ ... ఇదీ సంగతి. ఇవన్నీ నాకెలా తెలుసని నువ్వాశ్చర్యపడబోకు. గ్రామంలో ఇటువంటి రహస్యాలు దాగవు. అదీగాక చాలామందితో నాకు దగ్గర సంబంధా లున్నాయి. నేను నీ క్షేమాన్ని కోరే వాణ్ణి, నీకు హితుణ్ణి. అందుకనే నీకు వ్రాశాను. నువ్వేమైనా బాగుచేసుకో దలచుకొంటే—వెంటనే ప్రారంభించు. చేయి మించిన తర్వాత విచారించి లాభంలేదు. సెలవు.

ఇట్లు, నీ హితకాంక్షి.

నారాయణరావు లోలోపలికి ముడుచుకుపోయినాడు. ప్రపంచమంతా ఈ విషయనే ఏక కంఠంతో ఘోషిస్తున్నట్లు భావించాడు. కోట్లాది కంఠాలు తననుచూసి అపహసిస్తున్నట్లు అనుభూతి పొందాడు. నిట్టనిలువునా పడుకొన్నాడు. శరీర మంతటినుండి నెత్తురోడ్చుచున్నట్లు వేయి సమ్మెటలతో తనను మోదుతున్నట్లు, చీకటి కాటుక పొగలు చిక్కగా అలుముకొని వూపిరి ఆపుతున్నట్టు విలవిలలాడిపోయాడు. నరనరానా బాధ, మెదడులో బాసుపోటు. గుండెల్లో నెత్తుటిమంట. ఉత్తరం చేతిలోనే ఉన్నది. కళ్ళు భగ్గుమన్నాయి. వెచ్చని కన్నీరు బుగ్గలమీదుగా ప్రక్కకు

జారాయి. వేడిగాడుపు శరీరంనుండి దూసుకుపోతున్నది. ఉదయం పూసుకొన్న కామినియూ నూనె మరోసారి గుప్పు మన్నది. నేలమీద చాపచుట్టగా పడుకొన్నాడు. బరువుతో రెప్పలు వాలిపోయాయి.

రాజయ్య సుందరమ్మచెయ్యి పట్టుకొని దగ్గరకు లాక్కున్నాడు. సుందరమ్మ కుడిచేయి రాజయ్య ఎదురొమ్ము మీదవేసి వెనక్కు నెట్టింది. అతను నవ్వి సుందరమ్మను రెండు చేతులతోనూ—గట్టిగా కౌగిలించుకొన్నాడు.

మెదడులో భగ్గుమన్నది నారాయణరావుకు.

శారద మెల్లిగా లేచింది. కిటికీలో ముఖంబెట్టి బైటికి చూసింది, శంకరం రమ్మని తలూపాడు. శారద చప్పుడు కాకుండా తలుపుతీసి శంకరాన్ని కలుసుకొంది. శారదను ఆప్యాయంగా ఆలింగనం చేసుకొన్నాడు. శారద శంకరాన్ని ముద్దు పెట్టుకొంది. శంకరం శారదను మరింత దగ్గరకు తీసుకొన్నాడు.

నారాయణరావు చివాలున లేచాడు. భూత మావే శించినవాడిలా వెర్రిగా అటూఇటూ తిరిగాడు. పిచ్చిగా చూశాడు. ఉత్తరాన్ని ముక్కలుముక్కలుగా చించి, వీధి లోకి విసిరేశాడు. కల్లోలపాదోధిలాగా మనస్సు. మెరపు లాగా శారద. తన శారద! ఒకప్పుడు తన ఆలింగనములో ఉన్న శారద! ఉద్రేకం పరాకోటి నందుకొంది. ఛరాలున లేచి వీధిలోకొచ్చాడు. అక్కడ, తను పారేసిన కాగితపు

ముక్కలను పిల్లలు ఏరుకొంటున్నారు. అసహ్యంతో ముఖం ప్రక్కకు తిప్పుకొన్నాడు.

"టాక్సీ"

*   *   *

"నేనే మీకోసం వద్దా మనుకొంటున్నాను" అన్నాడు వాసు వినయంగా. "మీరొచ్చారు...అమ్మా! నారాయణరావుగారొచ్చారు. రెండు కాఫీ"

వంటమనిషి రెండు కాఫీగ్లాసులు అక్కడ బెట్టి వెళ్ళి పోయింది.

"మాకుటుంబం తరఫున మిమ్మల్ని క్షమాపణ కోరుదా మనుకొన్నాను. రాత్రి మాఅమ్మ మీతో ఏదో అన్నదానికి, మీరు ఈరోజుదయం సమాధానం చెప్పారని జానకి అన్నది. దానిభాషలో, మీరు మహాకటువుగా మాట్లాడారు. అమ్మ కూడా సపోర్టు చేసింది. అయినా నేను నమ్మలేదు. మీ రలా మాట్లాడరని నాకు తెలుసు. ఉద్రేకంలో ఉండటంచేత మా వారి కలా అనిపించి ఉంటుంది...చూడండి రావుగారూ! జానకిని బలవంతాన మీ కంటగట్టాలని నా ప్రయత్నం కాదు. అందుకోసం మిమ్మల్ని ఆదరించటంకూడా లేదు. మొగమాట పెట్టి పనులు జరిపించుకోవటమంటే నాకు మహా అసహ్యం ... మా వాళ్ళు తెలియక అనుకోండి — ఏదో వాగారు. మీరు వాటిని ఖాతరుచెయ్యక్కర్లేదు ... ఇంద సిగరెట్ కాల్చుకోరూ...జానకీ! కాస్త వక్కచూర పట్రా."

జానకి అల్లంత దూరంలో ఉండి, చూరడబ్బీ గిరవాటెట్టి, విసురుగా వెళ్ళిపోయింది.

వాసు నవ్వాడు.

"ఆడవాళ్ళు చాలా చిన్నపనికి ఇట్టే ఉద్రేక పడతారు. చూడండీ! మీరు చేసుకోనన్నారన్న కోపంకొందికీ జానకి చూరడబ్బా విసిరి పడేసి వెళ్ళిపోయింది. తను ఎంత మందినో రెఫ్యూజు చేసింది గదా! వారందరూ ఇలా కోపంతో భగ్గుమంటే జానకి ఏంచేస్తుంది. తనకులాగానే ఎదుటివారికి కూడా కొన్ని కొలతబద్ద లుంటాయని మా చెల్లి అనుకోదు. ఏం చేయడం?"

'ఆవిషయంగురించి మాట్లాడాలనే నేనిప్పుడొచ్చాను' అన్నాడు నారాయణరావు. "రూముకెళ్ళి చాలాసేపు ఆలోచించాను. జానకిని చేసుకోవటం ఎంతో ఉత్తమంగా అవుపించింది. నా అంగీకారం తెలియచెయ్యడంకోసం వచ్చాను. మీకేమీ అభ్యంతరాలు ఇంతలో కలగకపోతే, నాకేమీ లేవు" అన్నాడు.

"చేసుకొనేది నేనే అయితే, మరొకరి సలహా లడక్కపోదును. ఏమో? మా జానక్కి ఈలోపున అభ్యంతరాలొచ్చాయేమో నాకు తెలీదు మరి. మీరే కనుక్కోండి" అన్నాడు వాసు.

"క్షణానికో రకంగా మారడం నావల్లకాదు. అది తెలిసికూడా తెలియనట్టు మాట్లాడతా వేమిటన్నయ్యా?" తలుపు వెనకుండే జానకి అన్నది.

"మంచిది" అన్నాడు వాసు. "మీకు పట్టింపులు లేక పోతే, మా రేజి చాలా మోడరెట్‌గా చేదాం. టీపార్టీ, పూల దండలు, ఫోటో, ఫినిష్. అనవసరమైన హంగామా చేయడం నాకొట్టె రుచించదు. కాస్తోకూస్తో మనలాంటివాళ్ళ విషయాల్లోనే మార్పులేకపోతే, ఈవివాహసంస్థ చస్తే కదల దనుకోండి...ఆ...ఏమిటో చెప్పొచ్చాను...అదీ సంగతి. మీ బంధువు లందరికీ మీరు వెడ్డింగ్ కార్డ్సు పంపుకో వచ్చు...ఇన్నిటికీ మా రేజి ఎప్పుడంటారు?"

"అదీ జానకినే అడగండి" అన్నాడు నారాయణరావు నవ్వుతో.

"మీనింగ్‌లెస్ మిష్టర్ నారాయన్..."

"క్షమరచాలి. నన్నిక పేరుతో పిలవకండి."

"మీరు నన్ను 'అండీ' అనకూడదు మరి."

"ఆహా!" అన్నాడు నారాయణరావు. "సరే ప్రోసీడ్ కా మరి" మీనింగ్‌లెస్..." అని అందించాడు.

"నన్నడగడ మేమిటీ? పెళ్ళి నా ఒక్కదానిదేగాదు. మీది కూడానూ. మనిద్దరం కలిసి డేట్ నిర్ణయించాలిమరి" అన్నది జానికి.

"దానికి మీ అన్నగారి అనుమతి కూడా కావలసి ఉంటుంది. ఏమండి వాసూ...ఏడీ ?"

వాసు ఎప్పుడో వెళ్ళిపోయాడు.

"ఇవ్వాళ 'కువాడిస్' పిక్చరుకు వెడదా మనుకొంటు

న్నాను..." అన్నది జానకి. ఇదివరకోసారి చూశాను. బెస్ట్ పిక్చ రనుకోండి. అందులో "నీరో" చక్రవర్తిగా ఒకతను యాక్టు చేస్తాడండి? మార్వెలెస్...ఐ నెవర్ సా సచ్ పిక్చర్...ఒక్కో సీను చూస్తుంటే గుండెలు డెక్క పడతాయి. నా మట్టుకు నేను స్టన్ అయిపోయ్యాను. మరో నాలుగువేల సంవత్సరాలదాకా, మనవాళ్ళు అలాంటి సినిమా తియ్యలేరు..."

"అయితే తప్పకుండా చూడాలి" అన్నాడు నారాయణరావు.

జానకి టాయిలెట్ చేసుకొందుకు వెళ్ళింది.

## 18

"అనివార్యమైన కారణాలవల్ల" నారాయణరావు వెంటనే పెళ్ళి చేసుకోలేదు. శాంతమ్మ అండ్ కో., కూడా ఇందుకు సుముఖంగానే ఉన్నది. ఆమెకు సు స్త్రీచేసింది. అది నయమయ్యేసరికి పరీక్షలు దగ్గర కొచ్చాయి.

"ఇప్పుడే మునిగిపోయిం దేమీ లేదు – అంతా రెడీ అయిపోయింది గనుక, ఆ కాస్త తూతూ మంత్రంగా ఎప్పుడనిపించినా అనిపించుకోవచ్చు. ఈ గొడవల్లో పడ్డామంటే చదువు సాగదు. ఈ పరీక్షలు అయిం తర్వాత – వీకంగా ఫలితాలు తెలిసిం తరవాతైతే బావుంటుంది— చేసుకోవచ్చును" అన్నాడు నారాయణరావు.

అందరికీ అది సమ్మతమయింది.

ఇందులో అనుమానించ దగ్గ అంశ మేమీ వారికి గోచరించలేదు. వాసుకు ఈ గొడవతో ఆట్టే సంబంధం లేదు గనుక, నారాయణరావు తీర్మానాన్ని గురించి ఆలోచించలేదు. శాంతమ్మగారు ఆలోచించలేదు. రీటా హేవర్త్, ఎలిజబెత్ టెయిలర్‌లలో ఎవరు అందంగా వుంటారో ఎవరు చక్కగా డ్యాన్సు చేస్తారో, ఎవరికి సినీఫాన్సు అత్యధికంగా ఉత్తరాలు రాస్తుంటారో నన్న అతి ముఖ్య విషయాలను తప్ప! ఇలాంటి చిల్లరవాటిని గురించి ఆలోచించే తీరిక జానకమ్మగారికి లేదు. ఏమాత్రం ఆలోచించినా నారాయణరావులో ఏదో పెనగులాట, రాజకీయ భాషలో 'తిరోగమనం' జరుగుతున్నదని తెలిసిపోయేది.

నారాయణరావు తీరికగా యోచించిన తరువాత, వేలాది సందేహాలు ఆ ఉత్తరాన్ని గురించి కలిగాయి. నిజంగా ఆ ఉత్తరంలోని విషయాలన్నీ జరిగి ఉంటాయా? జరిగి ఉంటే ఆ 'హితకాంక్షి' తన పేరెందుకు చెప్పుకో లేదు? ఉత్తరంలో తనమీద ద్వేష మున్న ఛాయలు ఎక్కడా కనపడలేదు. తన శ్రేయస్సును వాంఛిస్తున్న ధోరణిలో నడిచింది. అయినప్పుడు ఆ 'హితకాంక్షి' ఎందుకు భయపడాలి? ఎందుకు భయపడ్డాడు? ఒక సత్యాన్ని చెప్పటానికి భీతి పడవలసిన ఆవశ్యకత లేదు. అసత్యాన్ని సత్యంగా రూపొందించవలసిన తరుణంలో తత్తరపాటు, భయం కలుగుతాయి. ఈ 'హితకాంక్షి' భయపడుతున్నా డనడానికి అతను పేరు దాచుకోవటమే సాక్ష్యం. అంటే ఏమిటన్న మాట?

ఇతగాడు చెబుతున్నది అసత్యమని తేలుతున్నది. నిజమే! అందులోని అన్నివిషయాలు సత్యమని రుజువేమిటి? కేవలం ఆ ఉత్తరమేగదా! ఒక చిన్న లేఖను అందులోనూ — పేరు బైట పెట్టటానికి జంకిన ఒక భీరువు వ్రాసిన లేఖను-ఆధారం చేసుకొని తను శారదను పోగొట్టుకోవట మంటే-అంతకంటే అవివేక మేముంటుంది? నిజానిజాలను, న్యాయన్యాయాలను ఆలోచించకుండా, తను గుడ్డిగా ఉత్తరాన్ని నమ్మాడు. ఆ ఉద్రేకంలో, అంతకన్న గుడ్డిగా జానకిని చేసుకొంటా నన్నాడు. జానకిని చేసుకోవటం తప్పు అని కాదు. ఆవిడ మంచిదే! కాకపోతే, రవంత పైత్యం ఎక్కువ పాళ్ళున్న మనిషి. ఆవిడ చెప్పిన ప్రతిదానికీ తలూపితే సరి — విషం పుచ్చుకోడానికూడా సంకోచించదు. కావచ్చు. అంత మాత్రాన శారదను ఒదులుకోవలసిం దెందుకు? సరైన కారణం లేనప్పుడు, శారదను గాక జానకిని చేసుకోవటంలో అర్థంలేదు. అట్లానని ఇప్పుడప్పుడే ఈవిషయంలో బైటపడ రాదు. మొన్నమొన్ననే జానకిని చేసుకొంటా నన్నాడు. ఇపుడే కాదంటే—తనను వాళ్లు పిచ్చివాడుగా అర్థం చేసుకొన్నా తప్పులేదు.

నారాయణరావు ఈనిర్ణయాని కొచ్చాడు. ఈవిధంగా చేదామనుకొన్నాడు. వెంటనే అతనికి మరొక ఆలోచన వచ్చింది. ఆ ఉత్తరం కేవలం అసత్యాలతో నిండి ఉండ లేదేమో? ఇదీ అనుమానం. ఇందుకుగాను అతనికి స్ఫురించిన కారణాలు కూడా సవ్యంగానే ఉన్నాయి, ఉత్తరంలోని

మరొక అంశం తన తల్లిని గురించి ఉన్నది. అదంతా చూచాయగా తనూ విన్నాడు. తల్లిని గురించి వ్రాసినంత వరకూ నిజమే! అయినప్పుడు శారదను గురించి అబద్ధమెం దుకు వ్రాస్తాడు. ఒక లేఖలో ఒక వ్యక్తికి సంబంధించిన నిజం కొంతమేర చెప్పి మిగతాది అసత్యం చెప్పటం జరగదు. కాబట్టి ఆ హితాకాంక్షి శారదను గురించికూడా నిజమే చెప్పి ఉంటాడు. అయినప్పుడు—అట్లా పతనమైన వ్యక్తిని ... తను పెళ్ళాడటం అజ్ఞాన మనిపించుకొంటుంది. తన కళ్ళ ఎదటే నీచంగా, ఏహ్యంగా ప్రవర్తించి స్త్రీని వివాహంచేసుకొని తను సుఖపడలేడు, అలాంటి ఉదారపురుషులు ఉంటే ఉండ వచ్చు. కానీ తను ఆ కోవకు చెందడు, చెందలేడు. చూస్తూ చూస్తూ ఆ నరకంలో ప్రవేశించనందుకు తనను తాను అభి నందించుకొన్నాడు నారాయణరావు.

దీనివెంట మరో అనుమానం వేసింది. తల్లినిగురించి తనకు ఎంతో కొంత తెలిసిఉండటంమూలాన ఆ హితకాంక్షి అంతమేరకు సత్యమే చెప్పి ఉండకూడదా — శారద నైతిక జీవనంపట్ల తనకు సద్భావ మున్నది గనుక, అనుమానమేమీ లేదుగనుక, ఆవిడనుగురించి అసత్యాలు వ్రాసి ఉండకూడదా! ఇదే నిజ మనిపించింది. అతనికో తమాషా అయిన కారణం స్ఫురించింది. ఈ హితకాంక్షిగాడే శారదను కోరిఉండవచ్చు; శారద తిరస్కరించి ఉండవచ్చు. ఆకోపంతో, ఆమె జీవితం బ్రద్దలు చేదామని ఇలా లేనిపోని కట్టు కథలు వ్రాసి ఉండ వచ్చు. తన కసిను ఈ విధంగా తీర్చుకోవటానికి అతగాడు

ప్రయత్నించి ఉండవచ్చు. కాకపోతే, తనను అంతగా ప్రేమించిన శారద, తనకోసం కలవరించిపోయే శారద-ఎవడో శంకరయ్యను ప్రేమించటమూ - అతనికి లొంగిపోవటమూ అసంభవం.

నారాయణరావుకు శారద జ్ఞాపక మొచ్చింది. ఆ వెంటనే శంకరం జ్ఞప్తి కొచ్చాడు. వాళ్ళిద్దరినీ ఒకరి ప్రక్క మరొకర్ని వూహించుకొన్నాడు. బొమ్మ సరిపోలేదు. నారాయణరావు మనస్సు సంతోషంతో గంతులు వేసింది. చిరునవ్వు నవ్వాడు. సిగరెట్టు ముట్టించి, డ్రాయరుమీద కాళ్ళు పెట్టి, హుషారుగా వూపాడు. ఎన్నడోగాని రాని ఈలపాట ఆనాడు ఆకస్మికంగా వచ్చింది.

"ఇంద. కాఫీ తీసుకోరూ!" జానకి వయ్యారంగా ట్రే పట్టుకొచ్చింది.

"ఎందుకు తీసుకోనూ? ఉంటే టిఫెన్‌కూడా తీసుకొంటాను" అన్నాడు నారాయణరావు.

"మంచివారే పాపం! టిఫిన్ లేదు."

"మంచిది...నువ్వూ కూచో, నీతో ఓ మాట అడగాలనుకొన్నాను."

జానకి ఫక్కుమని నవ్వింది. నారాయణరావు వెలా తెలాపోయాడు.

"అదిగాదండీ! మాట అడగడ మేమిటి నా ముఖం ప్రశ్న అడుగుతారు, మాట చెబుతారు. మాట అడగడం ఏ సూత్రం క్రింది కొస్తుందో చెబుతారా?" అన్నది జానకి.

"పానకంలాగా ఉంది కాఫీ" అని చప్పరించాడు నారాయణరావు.

"నేననుకొంటూనే ఉన్నా, ఈ ముసలమ్మ కాఫీ ధ్వంసం చేస్తుందని. అనుకొన్నంత్తా చేసింది. పోన్లెండి. ఆనక నే చేసిస్తాను. ఎలాగో ఈ గుక్కెడు తాగేసెయ్యండి" అన్నది జానకి. "ఏదో అడుగుదా మనుకొన్నా నన్నారు. ఏమి టది ?"

నారాయణరావు ఆలోచించి "ఏదో అనుకొన్నారు. జ్ఞాపకం లేదు, అక్కట్టే ముఖ్యం కాదనుకో. అంతమాత్రాన సందేహాలు సందేహాలుగా అట్టే పెట్టుకోవడం ఎందుకూ?" అన్నాడు.

"అది సరేగాని—" అంటూ జానకి ప్రారంభించింది. "నిన్న మధ్యాహ్నం మా అన్నయ్యొక పుస్తకం తెచ్చాడు."

"చివరికి మిగిలేది కదూ ?" అన్నాడు నారాయణరావు బల్లమీదపడ్డ కాఫీ చుక్కలు వేలితో తుడుస్తూ.

"అవునండీ! చదివాను. ఎంత అద్భుతంగా ఉన్న దనుకొన్నారు? అందులో "దయానిధి" అని ఓ హీరో ఉన్నాడు. చిత్రమైన మనషి. విచిత్రమైన భావాలున్నవాడు. అతని తల్లి ప్రవర్తన మంచిది కాదట. అందువల్ల అతని జీవితం ఎన్ని ఒడిదుడుకులకు లోనయిందీ, బ్రహ్మాండంగా చెబుతాడు రచయిత. అందులో మరోపాత్ర అమృతం..."

"నేను చదివాను" అన్నాడు నారాయణరావు. అతని ముఖం అకస్మాత్తుగా మారిపోయింది. "దయానిధి అంటే

నాకు చాలాయిష్టం. అపారమైన అనుభవాలు అతన్నివత్తి వేశాయి. చివరికి జీవితంమీంద పెద్ద దిగులు పుట్టింది. బహుశ రచయిత జీవితంపట్ల అమితమైన జిజ్ఞాస కలిగినవాడు కావచ్చు. అందుకే, నిర్ణయాలు తను చెయ్యకుండా మనకు వదిలేశాడు. నేను చదివినకొద్దీ ఉత్తమ గ్రంథాల్లోనూ 'చివరికి మిగిలేది' ఒకటి. పుస్తకం చదవంగానే, నా అభిప్రాయాన్ని రచయితకు వ్రాశాను. ఏదో సంగ్రహంగా జవాబు వ్రాశాడు. జ్ఞాపకం లేదు" అని కాసేపాగి, "ఆ పుస్తకం మరో మా రివ్వు జానకీ! ఆ చివరి ప్రకరణం చదివిస్తాను."

*       *       *

"మీకు వైరొచ్చిందండి!" అన్నాడు వాసు. "మీ రూము అడ్రసు కొచ్చింది ముందు...ఇంద."

జానకి, శాంతమ్మ, వంట మనిషి మూగారు. నారాయణరావు వణకుతూ కవరు చించి చూశాడు.

"శారద—డైడ్—స్టార్ట్—అర్జెంట్—"

నారాయణరావు తల తిరిగిపోయింది. అక్కడే కుప్పలాగా కూలబడ్డాడు. (పడలేదు. పడకుండా వాసు పట్టుకొన్నాడు) తరువాత జానకి చూసింది — తెనాలి నుండి వచ్చిందా వైరు. తెనాలిలో నారాయణరావుకు బంధువు లున్నట్టు ఎప్పుడూ చెప్పలేదు. అయితే ఈ శారద ఎవరయి నట్టు? ఎంతో దగ్గరది కాకపోతే, ఈయనగా రిలా ఇదయిపోవడమేమిటి? ఈయనకు శారదకూ మధ్యనున్న సంబంధమేమిటి? ఇత్యాది సందేహాలు అసంఖ్యాకంగా కుమారి జానక్కి కలిగాయి.

వివరా లడిగినా నారాయణరావు చెప్పలేదు. "ఆ ! నాకు తెలిసిన మనిషే లెండి. ఓ స్నేహితుని భార్య. ఆమంటే అతని కెంతో ఇష్టం. నానాప్రయత్నాలు చేసి, శారదను వాడు మారేజి చేసుకొన్నాడు...ఇప్పుడు వాడేమయి పోతా డోనని నాకు భయంగా ఉంది. ఇప్పుడు టైమెంతయింది. వాసుగారూ ... మంచిది. నేను వెడుతున్నాను. రెండు మూడు రోజుల్లో వస్తాను. వస్తాను జానకీ ! పోనీ నువ్వుకూడా స్టేషనుదాకా రా. నన్ను పంపించి వద్దువు గాని."

"వెళ్ళవే" అన్నది శాంతమ్మ.

"డబ్బేమన్నా కావాలండీ ?" అన్నాడు వాసు.

"వాట్ నెససరీ."

"రండీ" అన్నది జానకి, కారును వాకిట్లో నిలిపి.

"వస్తానండీ ! వస్తామ శాంతమ్మగారూ!"

"త్వరగా రా నాయనా ! మళ్ళీ పరీక్షలు దగ్గర కొచ్చాయి" అన్నది శాంతమ్మ.

"అలాగే" అంటూ నారాయణరావు కారెక్కాడు.

# 19

రైలు దిగి ఊళ్లోకి వస్తుంటే; కాలువదగ్గర రాజయ్య కనుపించాడు. నారాయణరావుకు అతన్ని పలకరించ బుద్ధిగా లేదు. వడివడిగా నాలుగడుగులు వేశాడు. వెనకనుండి రాజయ్య చప్పట్లుకొట్టి పిలిచాడు.

నారాయణరావు రాజయ్య ముఖంలోకి చూశాడు.

గడ్డం పెరిగింది. కళ్లు, బురబుర లాడుతున్నాయి. ముందుకు కొద్దిగా వంగిపోయాడు.

"అంతా అయిపోయింది అబ్బాయీ! శారదమ్మను ఆ ఎదవలు పొట్టన బెట్టుకొన్నారు" రాజయ్య కళ్ళలో నీళ్లు తిరిగాయి.

నారాయణరావు గతుక్కుమన్నాడు.

"ఏ వెధవలు రాజయ్యా?"

"ఊళ్ళోవాళ్ళేనండీ! దొంగనాయాళ్లు, అప్పుడే వాళ్ళ పనయిందా? రేపుక తీకొక మనిషిని నరకనూ...?పద నారాయణా! అమ్మా వాళ్ళూ ఆసుపత్రిలో ఉన్నారు పద."

నారాయణరావు సరిగ్గా నడవలేకపోయాడు. హాస్పిటల్ వాకిట్లో అడుగుపెట్టాడు. లోపలనుండి ఒక్కసారి గొల్లుమని ఏడుపులు వినిపించినై. నారాయణరావు వెర్రెత్తిపోయాడు. తూలుకొంటూ ముందుకెళ్ళాడు. పురుషోత్తం, రామమ్మ, శకుంతల, దాని తమ్ముడు, సుందరమ్మ, అందరూ ఉన్నారు. అతన్ని చూడంగానే, కావిలించుకొని ఏడిచారు. పురుషోత్తంగారు ఏడవంగా, నారాయణరావు చెప్పనూ చూడలేదు.

"ఏయ్! ఏమిటీ జాతర? ఇక్కడ ఏడవగూడదు. ఏడవదలచుకొంటే అలా బజార్లోకి వెళ్లి ఏడవండి" అని కాంపౌండరన్నాడు.

నారాయణరావు, పదిరూపాయలు కాంపౌండరు చేతిలో బెట్టి "శవాన్ని చూడాలి' అన్నాడు.

"రండి."

ఓ బల్లమీద వెల్లికితలా పడివుంది శవం. వీపుమీద జానెడులోతు గాయం. నెత్తురుకారి, గడ్డకట్టుకుపోయిన దృశ్యం. పోస్టుమార్టెమ్ చేశారు. కడుపు బద్దలుగా కోయ బడి వుంది. కన్నులు ఎండిపోయి, లేత ఆకుపచ్చ గాజు పెంకు ల్లాగా వున్నాయి. జుట్టు గాలికి కదులుతున్నది. నారాయణరావు కుంగిపోయ్యాడు. అతనికి ఏడ్చే శక్తికూడా లేనట్టు తోచింది.

ఇదివరకు శారదకు, ఇప్పటి శారదకు పోలికలు వెది కాడు. వృధా వృధా వృధా ! అతన్నొక విధమైన వేదాంతం ఆవరించింది. నిన్న మొన్నటివరకూ శారద బ్రతికున్నది. ఇప్పుడు చనిపోయింది. చనిపోవడమంటే ఏమిటి? తను తాకిన స్థలాలు, చుంబించిన ప్రదేశాలు, ఆలింగనం చేసుకొని తన్మయత్వం చెందిన శరీరమా యిది ? ఎంత ఘోరం! ఇలాంటి వికృతపు మాంసపుముద్దలలో నుంచి అలాంటి సౌఖ్యము, ఆనందమూ ఎలా కలుగుతున్నాయి ?

"ఇక వెళ్ళండి."

నారాయణరావు బైటికొచ్చాడు.

"బ్రతికుండగా ఆమె నేమీ సుఖపెట్టలేదు. సుఖ పెట్టాలనుకొన్నా నా భావాలన్నీ అనుమానాలతో లుకలుక లాడిపోయాయి. ఈ లోక వ్యవహారములకు, శారదకు ఋణం తీరింది. అవివేకంవల్ల ఆమె కొన్ని తప్పులు చేసి ఉండవచ్చు. దయామయా ! ఆమెను క్షమించు. నీ సన్నిధికి చేర్చుకోమని ప్రార్థిస్తున్నాను."

సుందరమ్మ కొడుకును దూరంగా చెట్టుక్రిందికి తీసుకెళ్లి, జరిగిన సంగతంతా చెప్పింది.

"భగవంతుడుసాక్షిగా నాకు మొన్న మొన్నటివరకూ తెలియదు నాయనా!" అన్నది సుందరమ్మ కళ్ళొత్తుకొని. "ఆ శంకరంగాడు దీనికొంప నిలువునా కూల్చాడు. ఆ తరువాత వెంకటరెడ్డికొడుకు లేడూ సూరారెడ్డి—వాడు కన్నేశాడు. ఇదంతా ఆ నాగులముండ చేసింది. దానికి బాగా దోచపెట్టాడు సూరారెడ్డి. ఒకరోజు నాటకం చూస్తామని ఇద్దరూ వెళ్ళారు. అయిపోయినా రాలేదు. నాకు భయం వేసింది. వెళ్ళాను. శారదను నేనెంతో చెప్పాను నాయనా! అదొక పిచ్చిగొడ్డు. అనగూడదు గానీ, దానివల్ల నేను పదిమందిలో తలెత్తుకు తిరుగలేకపోయాను. చలపతిరావుకూ, సూరారెడ్డికి పోట్లాటొచ్చింది. శారదను పంపెయ్యకపోతే మాట దక్కదని ఊళ్ళో పెద్దలన్నారు. పంపుదామనికూడా అనుకున్నాను నాయనా! పాపిష్ఠిదాన్ని అలా వెంటనే చేసినా బాగుండేది. ఇన్నిటికీ దానిరాత అలావుంది. సూరారెడ్డి కత్తితో పొడిచాడు. రాజయ్యచేత పోలీసుకేసు పెట్టించాను."

గాలికి చెట్లకొమ్మలు కదిలి చిత్రమైనశబ్దాలు వినపడుతున్నాయి. గడ్డిలో ఓ నల్లికళ్ళపాము కదిలింది. నల్లనిసీతాకోక చిలుక క్షణంసేపు ఎగిరి దూరంలోకి వెళ్ళిపోయింది. అప్పుడేపుట్టి లోకాన్ని వింతగా చూస్తున్న గడ్డిమొలక: మిడత దాన్ని కొట్టివేసి రివ్వున అతని భుజంమీద వాలింది. సుందరమ్మ తీసి దూరంగా పారేసింది.

"మరీ చిక్కిపోతున్నావేం నాయనా! అన్నం సయించటం లేదూ?" అన్నది సుందరమ్మ.

సయిస్తుందన్నట్టు నారాయణరావు తల తిప్పాడు.

"పాడు చదువుకోసం ఇంత ఆట్టే బాధపడకు నాయనా! మనకు జరగం దేమీ లేదు."

నారాయణరావు సిగరెట్టు వెలిగించాడు.

"ఎన్ని ఉత్తరాలు రాసినా జవాబు రాయవు. నే నెంత బాధపడతానో నీకు తెలియదా? నీ వెట్లా ఉన్నావో నని, ఏమి చేస్తున్నావోనని నేను హడలిపోతుంటాను...నా కైనా నువ్వు తప్ప ఎవరున్నార్రా నారాయణా! నే నేమి చేసినా నాకోసంగాదు. నువ్వింత సుఖపడటమే నా క్కావలసిందల్లా. పంచప్రాణాలు నీ మీద పెట్టుకొని నే నుంటే, నువ్వేమో ఉత్తరానికి జవాబే రాయవాయె..." సుందరమ్మ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "చివరికి నా డబ్బు కూడా పనికి రాకపోయింది. నాలు గైదు నెలలనుండి మనిఆర్డర్లన్నీ తిప్పి కొడుతున్నావు..."

నారాయణరావు లేచాడు.

"ఎక్కడికిరా?" అన్నది సుందరమ్మ.

"మళ్ళీ వస్తాను"

అద్దంలోగుండా శారదను చూశాడు. రెండుచేతులూ మొఖానికి కప్పుకొని బాపురుమని ఏడిచాడు.

వీధిలో కొచ్చాడు. జనం, రొద, బళ్ళు "ఏటికీ శారదకూ సంబంధంలేదు" అనుకొన్నాడు. తలవంచుకొని

నడుస్తున్నాడు. గాంధిచౌక్‌లో రేడియోల గోల, పుస్తకాల షాపుల్లో హడావుడి. షరాబ్ బజారులో, మెయిన్‌రోడ్డు మీద రిక్షాలగోల, కూలీల కేకలు, వ్యగ్రచిత్తంతో బోసు మైదానం దాటాడు. కాలువలు రొదపెడుతూ పారుతున్నాయి. సరంగులు పడవను అడ్డంగా తిప్పుతున్నారు. కలపబళ్లు, బస్సులు ...పూల అంగళ్లు ... చాయ్‌గరం కేకలు, అక్కడికొచ్చి ఆగిపోయ్యాడు. రైలుగేటు వేసి ఉంది. వెనక్కు తిరగ బుద్ధిగాలేదు. సోడా తాగి, ఆ నీళ్ళతోనే ముఖం కడుక్కొన్నాడు. ముక్కోణాకారంలోఉన్న పార్కు, మునిసిపల్ రేడియో పాట. బద్ధకంగా పార్కు బెంచీకి ఆనుకొన్నాడు. నిద్రపట్టేసింది.

తిరిగి లేచేసరికి రాత్రి చాలా ప్రొద్దుపోయింది. ఆవలించి చిటిక వేశాడు. వళ్లు విరుచుకున్నాడు. రోడ్డుమీద కొచ్చాడు.

"రిక్షా కావాలా బాబూ?"

నారాయణరావు తలొంచుకొని పదడుగులు వేశాడు. బస్సు ప్రయాణీకులకోసం వేసిన రెల్లుపాక కనిపించింది. చాలామంది బెంచీలమీద పడుకొన్నారు. ఇంకొందరో కింద ఉంపచుట్టుకొని పడుకొన్నారు. అతను వెనక్కు తిరిగాడు. బాగా ఆకలవుతున్నది. పెట్రోమాక్సు లైట్లు పెట్టుకొని, నాలుగైదు టీ షాపులున్నాయి. నారాయణరావు ఒక టీ కొట్టుదగ్గర చల్లని గారెలు, వేడి టీ తాగాడు. సిగరెట్లు కొన్నాడు.

"మద్రాసు వెళ్ళేబండి ఎన్నింటికి ?"

"ఆరున్నర కొస్తుందండీ! ఎక్స్‌ప్రెస్ తొమ్మిదిలోపు వస్తుంది."

నారాయణరావు సరాసరి హాస్పిటల్ దగ్గరకొచ్చాడు. గేటు వేసి ఉంది. శారద నుంచిన గదివేపు చాలాసేపు చూశాడు. దుఃఖం పొర్లుకొచ్చింది. ఇందాక తనూ తల్లి కూచుని మాట్లాడిన చెట్టువేపు చూశాడు. కొన్ని క్షణాల పాటు తలవంచుకొని అలాగే నిలబడ్డాడు. ఒక్కసారి ఆస్ప త్రంతా కలయచూశాడు. వెనక్కు తిరిగాడు.

## 20

వాణీమహల్ ఈ రోజు బ్రహ్మాండంగా అలంకరించ బడ్డది. అందంగా అలంకరించుకొన్న చాలామంది పురుషులు, స్త్రీలు ఇంటినిండా బిలబిల లాడుతున్నారు. జానకి అప్స రసలా తయారైంది. వచ్చిన స్త్రీలను గౌరవించటం వగై రాలు ఆమె చూస్తున్నది. వాసు తన స్నేహితులందర్నీ పిలిచాడు. బంధువుల్లో చాలా కొద్దిమంది మాత్రమే వచ్చారు. ఇంకొందరు శుభాశ్శీసులు మట్టుకు పంపారు. శాంతమ్మగారికి వంటింటితోనే సరిపోతున్నది.

రెండు పెద్ద హాల్సులో టీపార్టీకి ఏర్పాట్లు జరిగాయి. బారులు బారులుగా ఆడవాళ్ళు, మగవాళ్ళు కూర్చున్నారు. కొందరు జానకిని విసుగుపుట్టేవరకూ అభినందించారు. వాళ్ళ దృష్టిలో జానకి చాలా అదృష్టవంతురాలు. నారాయణరావు

లాంటి భర్త దొరకడమంటే మాటలు కాదని వాళ్ళ నమ్మకం. మరి అతనిలో ఉన్న విశిష్టత వాళ్ళేమి గ్రహించారో తెలీదు. ఇంతకన్నా అభినందనాలందుకొన్నాడు నారాయణరావు. ఎందరో జానకికోసం ప్రయత్నించారట. ఆమె అందాన్ని చూసి పిచ్చెత్తిపోయిన వాళ్ళుకూడా ఉన్నారట. "అంతమందినీ కాదని, జానకి నిన్ను చేసుకోవటమే నీకు మహావరం" అన్నాడొకాయన. అంతమంది మహామహుల్ని వెర్రెత్తించిన సౌందర్యం, తనను కదలించనైనా కదలించలేదు. బహుశః తనకు సౌందర్యాన్ని అనుభవించే—అంటే—గ్రహించే—నేర్పు లేక పోవాలి. కాకపోతే వీరంటున్నమాటలకు అర్థంలేదు. జానకి, నారాయణరావు బల్లల మధ్యకు వచ్చారు. హర్షధ్వానాలు చెలరేగాయి.

"పెళ్ళికొడుకు ముఖం అలా ఉందేమిటి?"

"ఏం?"

"ఉత్సాహంగా ఉన్నట్టు లేదు."

"బహుశా తల్లిదండ్రులు వచ్చి ఉండరు."

"వారు చిన్నప్పుడే చనిపోయారు."

"అయితే మంచిదే! మా జానక్కి అత్తపోరు ఉండదు" అని సతోషించిందో గొంతు.

ఆ తరువాత వివాహ వ్యవస్థమీద చిన్నసైజు ఉపన్యాసాలు, చర్చలు జరిగాయి. జానకి, నారాయణరావు ఒకరికొకరు పూలదండలు వేయించుకొన్నారు. ఫొటోలు

తీయబడ్డాయి. వివాహతంతు పూర్తయింది. అందరూ సెలవు తీసుకొని వెళ్ళిపోయారు.

ఆ రాత్రి నారాయణరావుకు మేడమీది గదిలో పక్క వేశారు. కొంతమంది ఏదో గొడవ జరుపుతామన్నారు గానీ, కుమారి జానకి, కాదు – శ్రీమతి జానకిగారి దృక్కుల్ని తిలకించి నిరాశాహతులైనారు. వివాహానికి ప్రసాదరావు–పద్యాలు రాసుకొచ్చాడు. అచ్చుకావడం ఆలస్యమైంది. అందుకని, రాత్రి ఎనిమిదింటికొచ్చి ఆ కాగితాలిచ్చి పోయాడు.

గడియారం పదకొండుసార్లు పిలిచి నోరు మూసుకొంది. నారాయణరావు కళ్ళుమూసుకొని, చేతిని కళ్ళకు అడ్డంగా పెట్టుకొని పడుకొన్నాడు. ఊదు వత్తులు కునారిల్లుతున్నాయి. ఫాన్ సోమరిగా తిరుగుతున్నది. ఆలోచనలు పెల్లుబుకుతున్నాయి. ఈ విషయం తన తల్లికి తెలియదన్న భావం కలగగానే అతను చలించి పోతున్నాడు. ఇప్పుడు గాకపోతే మరొకనాటికన్నా తెలుస్తుంది. తెలిసినప్పుడు అమ్మ ఏమనుకొంటుంది ? భయం వేసింది నారాయణరావుకు. ఈ వివాహానికి తల్లిని పిలుద్దామనుకొన్నాడు. కానీ వీల్లేక పోయింది. తల్లి లేదని తను ఏనాడో చెప్పుకొన్నాడు. ఇప్పుడున్నదంటే ఎలా ? తన మాటకేమి విలువుంటుంది ? ఒక్కగాను ఒక్కడు తను. తనంటే అమ్మ కెంతో యిష్టం. తను ఉత్తరం రాయనందుకే వల వలా ఏడ్చింది. తనకు తెలియకుండానే పెళ్ళి చేసుకొన్నట్లు

తెలిస్తే? చల్లనిగాలి తోలుతున్నా ఉక్కబోస్తున్నట్లు, చాలీ చాలని చొక్కా తొడుక్కున్నట్లు ఫీలయ్యాడు.

గప్పున సువాసనలు విచ్చుకొన్నాయి. తలుపు వెనుక అడుగులు ధ్వని, నారాయణరావు తలతిప్పి చూశాడు. మెల్లగా తలుపు తెరుచుకున్నది. తెల్లని జరీచీరె లైటు వెలుతురులో ధగ ధగ మెరిసింది. పసిమిలీనుతున్న పాదాలు కదులుతున్నాయి. నారాయణరావు లేచి కూచున్నాడు. పాదాలు కదలిక ఆగిపోయింది. ఒక్క నిమిషం ఆలాగే కూచున్నాడు. మెల్లగా తలెత్తాడు. రెండు నీటి బిందువులు బుగ్గలమీదకు జారాయి. వేలితో చిమ్మాడు. జానకి యిది గమనించనే లేదు. మామూలు సమయాల్లో ఎంతో 'ఇది'గా ఉండే జానకి, ఇప్పుడెక్కడలేని సిగ్గుపడుతున్నది. నారాయణ రావు జానకి దగ్గరకొచ్చాడు. తలుపు వెనక గుసగుసలు. వెళ్ళి గడియ వేసొచ్చాడు.

* * *

"ఎవరు స్వామీ ఈ సుందరమ్మ?"

నారాయణరావు ఉలిక్కిపడ్డాడు.

"ఏం"

"ఉత్తరం రాసింది. మిమ్మల్ని చూడాలని కలవరిస్తున్నదట. ఎవతంకీ అది?" అన్నది జానకి.

నారాయణరావు కలవరపడ్డాడు.

"ఏదీ యిలా తే"

జానకి కార్డిచ్చింది. 'ప్రియమైన కుమారునకు' అంటుం దేమిటి? మీకు తల్లి లేదుగా? ఈ తల్లి ఎవత్తె?" అన్నది జానకి.

నారాయణరావు మ్లానముఖుడైనాడు. కార్డు అందుకొని గబగబ చదివేశాడు.

"అది గాదండీ? కుమారు డంటుం దేమిటా అని" నిగ్గదీసింది జానకి.

"ఇంతప్పణ్ణించీ నన్ను పెంచింది. నాకు చాలా దూరపు బంధువు. అంచేత నే నావిణ్ణి "అమ్మా" అని పిలిచేవాణ్ణి, ఆవిడకూడా నన్ను కొడుకులాగే చూసేది" అన్నాడు నారాయణరావు.

"హోటల్ ఎత్తేశాననీ, ఆరోగ్యం సరిగ్గా లేదనీ, పది రోజులనుండి ఉప్పెనగా దగ్గు వస్తోందనీ, రాసిం దేం?"

"ఆవిడ హోటలు పెడుతుండేది."

"మీరు మేనమామగారింట్లో పెరిగామన్నారు గదూ?" దీర్ఘం తీస్తూ అడిగింది.

నారాయణరావు సమాధానం చెప్పకుండా వెళ్ళిపొయ్యాడు. జానకి కేడీని చూసినట్లు చూసింది.

గదిలో కొచ్చి, తలుపులు వేసుకొని జేబులోనుండి కార్డు తీశాడు: చీకరి బీకరిగా ఉన్నయ్యి అక్షరాలు.

"నాయనా ! నాకు పదిరోజులనుండి జ్వరం తగులుతున్నది. రాత్రింబవళ్ళు దగ్గలేక అల్లాడిపోతున్నాను. హోటలు నెలక్రిందటే ఎత్తేశాను. ఇక్కడ నన్ను చూసే వాళ్ళెవ్వరూ లేరు. నువ్వు వస్తావని గంపెడాశతో ఎదురు చూస్తున్నాను. నా ప్రాణాలు నీకోసం నిలుపుకొన్నాను. నే నేమయినా తప్పులు చేస్తే మన్నించు. కన్నతల్లిని నిన్నొకసారి చూచి చచ్చిపోదా మనుకుంటున్నాను. ఈ ఆఖరు కోరిక చెల్లించు. నీచేతిమీదుగా నన్నింత మట్టిచెయ్యి. అదే నాకు కావలసింది. ఆస్తంతా నీపేర వ్రాయించి దస్తావేజులు సిద్ధం చేశాను. నాకష్టార్జితం నువ్వనుభవించి సుఖంగా బ్రతుకు. ఒక్కసారి నా కళ్ళకు కనిపించు.

నీ తల్లి,
సుందరమ్మ"

నారాయణరావు మంచంమీద పడి, భోరుమని ఏడిచాడు. వెక్కివెక్కి పడ్డాడు. జానకి, వాసు వచ్చి అడిగారు. నారాయణరావు ఏడుపు మానలేదు. వాళ్ళకు సమాధానం చెప్పనూలేదు.

## 21

సుందరమ్మ బలవంతాన కళ్లు తెరిచింది. రాజయ్య ఆమె ముఖంమీదికి ముఖం పెట్టాడు ఏమిటన్నట్లు.

"అబ్బాయి రాలేదుగా రాజయ్యా" అన్నది సుందరమ్మ. ఆమె కళ్లు నీళ్ళతో నిండినాయి. శుష్కకపోలాల మీదుగా కన్నీరు స్రవించింది.

"వస్తాడు సుందరమ్మా. నువ్వట్టా అధైర్యపడవద్దు" అన్నాడు రాజయ్య.

"రాడు" నీరసంగా అన్నది. "మనం ఉత్తరం రాసి అయిదారు రోజులు అయింది. వచ్చేవాడైతే, ఈపాటికే వచ్చేవాడు. వాడు రాడు రాజయ్యా" ఆయాసంతో ఆగింది సుందరమ్మ. "నేను చచ్చిపోయేనాటికి, నా కొడుకుకూడా దగ్గరలేడు...నేను వాడిమీద ఎన్నో ఆశలు పెట్టుకొన్నాను రాజయ్యా. వాడిచేత ఇంత మట్టయి పొయ్యే అదృష్టం నాకు లేదు" శుష్కహస్తాలు ముఖానికి కప్పుకొని పసిపిల్లలా ఏడ్చింది సుందరమ్మ. రాజయ్య పెదిమి బిగబట్టి విచారాన్ని దిగమ్రింగాడు. ఏడవడంవల్ల సుందరమ్మకు దగ్గు ముమ్మరంగా వచ్చింది. దగ్గలేక మెలికలు తిరిగిపోయింది. రాజయ్య కూచోబెట్టి గొంతుసర్దాడు. కాస్తమందుగొంతులోపోశాడు.

"పురుషోత్తందగ్గిరికి మనిషిని పంపాను. రానన్నాడట గాడిదకొడుకు. తిన్నంతకాలం పీల్చుకుతిన్నాడు" కోపంతో అనలేకపొయ్యాడు రాజయ్య.

"రాజయ్యా! నాకు భయంగా ఉంది,........ నా నాయన రాడు. నేనన్నా పోతాను. ఎలాగైనా నన్ను మద్రాసు చేరిపించు. రాజయ్యా, నీ మేలు జన్మజన్మాలకు మరిచిపోను" అని రెండు చేతులూ ఎత్తి దణ్ణం పెట్టింది సుందరమ్మ.

రాజయ్య ముఖానికి గుడ్డ అడ్డం పెట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చాడు.

"డాక్టరు కదలకూడదన్నాడు. కదిలితే దగ్గు మరింత ఎక్కువవుతుందట."

"అయినాసరే! నన్ను మద్రాసు చేరిపించు, నీ కాళ్లు పట్టుకొంటాను" సుందరమ్మ పూనిక చేసుకొని లేవబోయింది.

రాజయ్య వారించాడు.

* * *

" ఈ రోజుల్లో చావులు మరీ ఎక్కువైపోతున్నాయి" అన్నాడు వాసు పేపరు చూస్తూ.

"పేపర్లో పడినవాటికే మనం ఇదయిపోతున్నాం. అనామికులు, రోజూ కొన్ని లక్షలమంది చస్తుంటారు" కాఫీ పూర్తిచేసి అన్నది జానకి.

" ఇదలాంటి చావుగాదు. చదువుతా విను. జూన్, 8 ఈ రోజు ఉదయం సింగరాచారి స్ట్రీట్‌లో ఒక్క స్త్రీ చచ్చి పడివున్నది. కొద్దిరోజులనుండీ ఆమె జబ్బుతో

బాధపడినట్లు కనిపిస్తున్నది. చంకలో చిన్న గుడ్డలమూట ఉన్నది. చేతిమీద, 'మందడపు సుందరమ్మ' అని పచ్చ ఉన్నది. పోలీసులు మూటను విప్పి చూశారు. ఇరవై వేల రూపాయల ఆస్తిని కొడుకు నారాయణరావు పేర వ్రాసిన దస్తావేజు, కొల్లూరునుండి తెనాలి వచ్చిన బస్సు టిక్కెట్లు, పదిరూపాయల నోట్లు నాలుగు, కొంత చిల్లరా ఉన్నాయి. శవపంచాయితీ జరిగింది. దస్తావేజును, డబ్బును పోలీసులు స్వాధీనం చేసుకొన్నారు. మన విలేఖరి, ఆ చుట్టుప్రక్కల వారిని విచారించగా, నిన్నరాత్రినుండీ, ఆమె అక్కడే తిరుగుతున్నట్టు ఆమె కొడుకు మదరాసులో చదువుతున్నట్టు ఈ గదిలో ఉంటున్నట్టు ఆమె చెప్పిందట. ఇప్పుడిక్కడ ఉండటం లేదని చెప్పినా ఆమె వినిపించుకోలేదట.

"అమ్మా" అని గావుకేక పెట్టి నారాయణరావు పడిపోయ్యాడు. అతనిలో ఏ ఏ భావాలు, ఆలోచనలు, ఉద్రేకాలు, ఉద్వేగాలు రేగాయో ఎవ్వరికీ తెలియదు. జానకి భయంతో అన్న ముఖంలోకి చూసింది. వాసు దీర్ఘంగా నిట్టూర్చాడు.

(సమాప్తం.)



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | IDLA 10.5 B 127 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 233 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | pratyusha |
| పేజీలు విడదీసినది | Thasin. |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |